శ్రీరస్తు.

# శుక్రనీతిసారము

ఇది


శ్రీ పీఠికాపురము ఆర్. సి. హెచ్. హైస్కూలులో

తెనుఁగు పండితులగు

పురాణపండ మల్లయ్యశాస్త్రులచే





ఆంధ్రపత్రికా కార్యాలయమున

ముద్రితము

౧౯౧౯




వెల రు 1-4-0

# FOREWORD.

This is a Telugu translation of the well-known Sanskrit book called Sukraneetisaram-essence of Sukra's treatise an polity. The book deals, as its name implies with polity in its various aspects and is, in parts, so up to-date that some may be tempted to suspect its antiquity which is however, beyond all doubt. Many a present day Indian, being fed entirely on western culture, is apt to think that there is nothing worthknowing or caring for in India's past histoty or its literature. This book cannot fail to act asan eye opener to such men and to instil in them some degree of national respect without which there can be no national progress and it is to be hoped that the study of the subject will receive the encouragement which it deserves. The name of the translator Brahmasree Puranapanda Malliah Sastry Garu is a guarantee that the translation is correct. The language used in the book is correct and chaste.

22nd September, 1918. **J. RAMAYYA.**

# గ్రంథకర్తృవిజ్ఞాపనము.

విద్వాంసులార!

శుక్రనీతిసార మను నీ పొత్తము సంస్కృతభాషయం దున్న దానిని నాతికఠినమైన శైలిని దెనిగించి మున్ను సరస్వతీపత్రికయందుఁ బ్రకటించితిని. ఇపుడు శ్రీ శ్రీ శ్రీ పీఠికాపుర మండలాధీశ్వరులు నాకుఁ బోషకులు, భాషాభిమానులుఁ గవితారసజ్ఞులు, మహావదాన్యులు, సద్గుణగరిష్ఠులు, సి. బి. ఇ బిరుదాంచితులు నగు మ. రా. రా. శ్రీ శ్రీ శ్రీ రాజా రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహదరు ప్రభువువారు ద్వితీయ ముద్రణమున కగు నట్టి సకల వ్యయమును నాయం దనుగ్రహించి దయచేసి ముద్రింపించి నన్నుం గృతార్థుఁ జేసిరి. నా రచించిన దాన విద్యాస్వరూప నిరూపణము కడ నొక్కింతమూలమున కధికముగ వ్రాయం బడియె; కాని తక్కిన యెల్లచోట్ల మూలమున కంతరము లేకుండనే సాధ్యమగునంతవఱకు వ్రాసితిని. పురాతన ముద్రణమునందలి లోపములను బుస్తకాంతరసహాయమున జాగ్రత్తగఁ బూరించితిని. అయిన నల్పజ్ఞుఁడ నగుటం జేసి నా యజ్ఞానమున నేని ప్రమాదమున నేని దోషములు పెక్కు లుండంబోలును గాఁబట్టి నాయందు వాత్సల్యముంచి క్షమియింపుఁ డని సవినయముగఁ బ్రార్థించుచున్నాను. మూలగ్రంథప్రాశస్త్యము నుపోద్ఘాతమునఁ గవితావిశారదులు ననేకభాషల విద్వాంసులు మున్ను మహోద్యోగములఁ గావించి యిపు డుపకారవేతనము నందుచున్నవారు నగు మ. రా. రా. శ్రీ-బ్ర-శ్రీ జయంతి రామయ్య పంతులుగారు

వ్రాసిరి కాఁబట్టి మరల నే వ్రాయుట నావశ్యకము. శ్రీ రామ య్యపంతులవారు నే నడిగినంతమాత్రమున నా ప్రార్థన మన్నించి యింగ్లీషుభాషలో నుపోద్ఘాతము వ్రాయించి దయ చేసినందులకుఁ గృతజ్ఞతాపూర్వకముగా నమస్కరించు చున్నాను. నేను బ్రధానమంత్రిముఖంబున వేఁడికొన్నంతనే యీ పొత్తము ద్వితీయముద్రణమున కగు నట్టి సకలవ్యయ ముం బ్రసాదించి ముద్రింపించి దయచేసిన శ్రీ శ్రీ శ్రీ పీఠికా పుర మండలాధీశ్వరుల కధికాయురారోగ్యైశ్వర్యముల దయ చేసి పుత్త్రమిత్త్రాదిసకలబంధుసమేతముగఁ జిరకాలము పర మేశ్వరుఁడు రక్షించుఁగాత మని యహరహముం బ్రార్థించు చున్నాను. మఱియు మున్నిట ముఖ్యమంత్రిపదంబున నున్న వారుఁ బరోపకారైకపరాయణులు ననేకవిద్యార్థులఁ బోషిం చిన వారు నిపుడు కథావశిష్టులు నగు బ్ర. శ్రీ. మ. రా. శ్రీ మొక్కపాటి సుబ్బారాయఁడు పంతులుగారు నేనాంధ్ర సాహిత్యపరిషత్సభకుఁ జెన్నపురము వెళ్ళినపు డీపుస్తకము ద్వితీయముద్రణము గూర్చి విన్నవించినంతమాత్రాన నా విన్న పమును మన్నించి శ్రీ శ్రీ శ్రీ ప్రభువువారికి లేఖారూప మునఁ దెలిపి వాక్సహాయము చేసినందుల కెంతయు నభినందిం చుచు వారికిఁ బరలోకసుఖమును వారి కుటుంబమువారి కిహ లోకసుఖముం బ్రసాదింప సర్వేశ్వరు వేఁడికొనుచు నా విన్న పమును ముగించుచున్నాను.

ఇట్లు విన్నవించు విధేయుఁడు,

పిఠాపురము.
4-4-19.

పు॥ మల్లయ్య శాస్త్రి.

# విషయసూచిక

## ప్రథమాధ్యాయము


| విషయము. | పుటసంఖ్య. |
|---|---|
| 1. నీతిశాస్త్రప్రశంస ... ... ... | 1 |
| 2. నీతిశాస్త్రాభ్యాసము రాజునకు ముఖ్యము ... ... | 2 |
| 3. రాజు కాలప్రవర్తకుఁడు ... ... | 3 |
| 4. రాజునకు గుణములచేఁ త్రైవిద్యము ... ... | 3 |
| 5. వర్ణభేదము ... ... | 4 |
| 6. వర్ణగుణములు ... ... ... | ,, |
| 7. కర్మవిచారము ... ... ... | 5 |
| 8. రాజుప్రవర్తనము ... ... ... | 6 |
| 9. రాజ్యాంగస్వరూపము ... ... ... | ,, |
| 10. రాజునావశ్యకత ... ... ... | ,, |
| 11. రాజనిర్మాణహేతువు నతనియందలి దేవాంశములును ... | 7 |
| 12. రాజునకుఁ బ్రజలకు నన్యోన్యానురాగ మావశ్యకము ... | 8 |
| 13. ఇంద్రియనిగ్రహము ... ... ... | 9 |
| 14. కామజంబులగు వ్యసనంబులనింద ... ... | 10 |
| 15. కామాదు లెక్కుడమంచివి యెచటఁగావు ... ... | 11 |
| 16. తపఃపాపఫలములు ... ... ... | ,, |
| 17. రాజుగుణదోషములు ... ... ... | ,, |
| 18. రాజు కామక్రోధాదుల నవశ్యము విడువవలయును ... | 13 |
| 19. రాజునకు విద్యాభ్యాసమావశ్యకము ... ... | ,, |
| 20. ఆన్వీక్షిక్యాదులస్వరూపము ... ... ... | 14 |
| 21. రాజుకర్తవ్యాకర్తవ్యములు ... ... ... | 14 |
| 22. రాజ మండలేశ్వరాదుల భేదము ... ... | 16 |

విషయము. — పుటసంఖ్య.

23. భూపరిమాణము ... ... ... 17
24. రాజు భూమినెట్లీయవలెను ... ... ... 19
25. పత్తననిర్మాణము-రాజగృహనిర్మాణము ... ... ,,
26. పాంథశాల ... ... ... 24
27. రాజుదినచర్య ... ... ... ,,
28. రాజారెకులకుఁ జేయు నేర్పాటు ... ... 25
29. రాజవశ్యముచేయవలసిన శాసనములు ... ... 26
29 (అ) రాజులాదాయము నెట్లు వ్యయము చేయవలెను ... 28
30. రాజచారసంభాషణాదికము ... ... 29
31. రాజ్యంబెట్టిది కావలయు – రాజు దాయాదులపట్ల నెట్లుండవలయు ... ... 30
32. రాజు కార్యములనెప్పుడాలోచింపవలెను ... ... 31
33. రాజు లేఁటేఁట స్వదేశమునం జరించి చేయవలయుపని... 33

## ద్వితీయాధ్యాయము.

1. రాజు సేవకుల నవశ్యము గ్రహింపవలెను ... 35
2. యువరాజు గాఁదగినవారు ... ... 36
3. యువరాజును రక్షించువిధము ... ... ,,
4. యువరాజు చేయవలయుపనులు ... ... 38
5. సుసేవకులయు దుస్సేవకులయు గుణములు ... 39
6. పురోహితుఁడు ప్రధానుఁడు మొదలగు వారి గుణములు 40
7. తక్కిన చిన్నయుద్యోగుల నేర్పఱచువిధము ... 44
8. సేవకధర్మములు ... ... ... 52
9. పలువిధములగు దస్తావేజులు ... ... 60
10. ఆయవ్యయంబులస్వరూపము ... ... 62
11. మానసంఖ్యాదిస్వరూపము-ద్రవ్యధనస్వరూపము ... 64
12. లిఖితములు వ్రాయువిధము ... ... 65
13. వేఱువేఱు మానంబులయుఁ గాలంబులయు స్వరూపము 67

| విషయము. | పుటసంఖ్య. |
|---|---|
| 14. భృతివిభాగము మొదలగునవి ... ... | 67 |
| 15. సేవకభేద భృతిభేదములు-సేవకుఁడు పనిచేయవలసినకాలము | 69 |
| 16. రాజు సేవకులకీయవలయు సెలవు మొదలగునవి. ... | ,, |
| 17. రాజు భటులకు విరోధమునను రాగము గలిగించువిధము | 70 |
| 18. రాజు సేవకుల కెట్టివస్తువుల నీవలయు ... ... | 71 |
| 19. పురోహితాదులయు గ్రామాధికారులయు జాతినిరూపణము ... ... | 72 |


## తృతీయాధ్యాయము.


| | |
|---|---|
| 1. మనుజుఁడు లోకుల సంతసిల్లఁజేయువిధము ... | 73 |
| 2. మనుజుఁడు దూరదృష్టి కలవాఁడు గావలయును ... | 80 |
| 3. మిత్రప్రశంస ... ... ... | ,, |
| 4. విద్యాదులవలని గర్వము ... ... ... | 81 |
| 5. విద్యాదిఫలము ... ... ... | 82 |
| 6. మనుజుఁడు చేయవలసినవి; విడువవలసినవి. ... | ,, |
| 7. గౌరవార్హులు ... ... ... | 84 |
| 8. దాఁపవలసినవి ... ... ... | 85 |
| 9. దేశసంచారాదులవలనిఫలము ... ... | ,, |
| 10. అతిథిపూజాదులు ... ... ... | 86 |
| 11. జనసమ్మతుఁ డగువిధము ... ... ... | 87 |
| 12. స్త్రీలదుర్గుణములు ... ... ... | 89 |
| 13. రక్షింపవలసినవారు ... ... ... | ,, |
| 14. కన్యాదానము ... ... ... | 90 |
| 15. విద్యాధనముల సంపాదనము ... ... | ,, |
| 16. విభాగవిషయము ... ... ... | 92 |
| 17. మిత్రునియెడఁ బ్రవర్తిల్లువిధము ... ... | 93 |
| 18. ఉత్తమాదిస్వరూపము ... ... ... | ,, |
| 19. దానప్రశంస ... ... ... | ,, |
| 20. వివిధములగు దానములు ... ... ... | 94 |

| విషయము. | పుటసంఖ్య. |
|---|---|
| 21. మంచినడువడి-చెడునడువడి-వానిఫలము ... | ,, |
| 22. ఖలస్వరూపము ... ... ... | 97 |
| 23. మంచిపుత్త్రులు-చెడుపుత్త్రులు ... ... | 98 |
| 24. భార్య మొదలగువారి ప్రాశస్త్యము ... ... | ,, |
| 25. దుఃఖహేతువులు ... ... ... | 99 |
| 26. మనుజుల వేఱువేఱుకోర్కులు ... ... | 100 |
| 27. బ్రాహ్మణప్రాశస్త్యము ... ... | ,, |
| 28 వృత్తిభేదములు ... ... ... | 101 |
| 29. బుద్ధిప్రశంస ... ... ... | ,, |
| 30. అల్పభాగ్యాదులయప్రాశస్త్యము ... ... | 102 |
| 31. నాశహేతువులు ... ... ... | ,, |
| 32. సంసర్గమహిమ ... ... ... | ,, |
| 33. సుఖహేతువులు ... ... ... | ,, |
| 34. అంతఃపురసేవార్హులు ... ... ... | 103 |
| 35. మార్గమున సుఖహేతువులు ... ... | ,, |
| 36. జరాకారణములు ... ... ... | 104 |
| 37. స్తుతి ... ... ... ... | ,, |
| 38. దుర్గుణహీనము ... ... ... | 104 |
| 39. సాధునకు నసాధునకుఁ గావించిన యుపకారము ... | 105 |
| 40. జనుల రంజించు విధము ... ... ... | ,, |
| 41. వ్యవహారము నెఱుఁగు సాధనము ... ... | 107 |


## చతుర్థాధ్యాయము

### ప్రథమప్రకరణము


| | |
|---|---|
| 1. మిత్త్రామిత్త్రుల లక్షణము ... ... ... | 108 |
| 2. సహజమిత్త్రులు - సహజశత్త్రులు ... ... | 109 |
| 3. రాజు శత్త్రులయెడను మిత్త్రులయెడను ప్రవర్తించు విధము ... ... ... | 110 |

| విషయము. | పుటసంఖ్య. |
|---|---|
| 4. ఉపాయస్వరూపము - వానిఁ బ్రయోగించు విధము... | 111 |
| 5. మంచిరాజు ప్రవర్తనము ... ... ... | 114 |
| 6. రాజు శిక్షింపవలయు విధము ... ... | 115 |
| 7. శిక్షార్హులు - శిక్షయు ... ... ... | 118 |

## ద్వితీయ ప్రకరణము

| | |
|---|---|
| 8. కోశస్వరూపము - దాని సంగ్రహించు విధము ... | 121 |
| 9. ధాన్యసంగ్రహము ... ... ... | 123 |
| 10. రత్నసంగ్రహము - వాని స్వరూపాదులును ... | 125 |
| 11. రత్నముల వెల ... ... ... | 127 |
| 12. లోహస్వరూపము - వాని మూల్యములును ... | 129 |
| 13. ఆవు మొదలగు పెంపుడుజంతువుల వెలలు ... | 130 |
| 14. పన్ను గ్రహించు పద్ధతి ... ... ... | 132 |

## తృతీయ ప్రకరణము

| | |
|---|---|
| 15. రాష్ట్రస్వరూపము ... ... ... | 135 |
| 16. చాతుర్వర్ణ్యస్థితియుఁ - దద్ధర్మములును ... ... | 136 |
| 17. విద్యాకలాస్వరూప సంఖ్యానిర్ణయము ... ... | 137 |

## చతుర్థ ప్రకరణము

| | |
|---|---|
| 18. ఆశ్రమములు ... ... ... | 149 |
| 19. స్త్రీ సాధారణధర్మములు ... ... ... | ,, |
| 20. శూద్రధర్మము ... ... ... | 152 |
| 21. జన్మ గుణముల ప్రాశస్త్యము ... ... ... | 153 |
| 22. పనివాండ్ర రక్షణము ... ... ... | ,, |
| 23. వృక్ష లతాది స్థాపనము ... ... ... | 154 |
| 24. కూపాదుల నిర్మాణము - దేవాలయ నిర్మాణము ... | 155 |
| 25. ప్రతిమాభేదము - వాని స్వరూపనిర్మాణము ... | 156 |

# పంచమప్రకరణము

| విషయము. | పుటసంఖ్య |
|---|---|
| 26. రాజుల ధర్మము ... ... ... | 169 |
| 27. సభానిర్ణయము ... ... ... | ,, |
| 28. సభాంగములు ... ... ... | 173 |
| 29. వాడుకలో నున్న ధర్మములు ... ... | 174 |
| 30. రాజు వాదిం బరీక్షించి యతని వాదమును విను విధము | 174 |
| 31. శిక్షార్హులు ... ... ... | 175 |
| 32. న్యాయముల విచారించు విధము ... ... | ,, |
| 33. ఛలములు ... ... ... | 176 |
| 34. అపరాధములు ... ... ... | 177 |
| 35. నృపతిపదములు – రాజజ్ఞేయములు ... ... | ,, |
| 36. ఆసేధభేదములు ... ... ... | 178 |
| 37. సభకు రాఁదగనివారు ... ... ... | 179 |
| 38. ఎప్పుడెల్లవారును సభకు రావలెను ... ... | 180 |
| 39. ప్రతినిధులు ... ... ... | ,, |
| 40. ప్రతినిథుల నంగీకరింపరాని నేరములు ... ... | 182 |
| 41. ప్రతిభూగ్రహణము ... ... ... | ,, |
| 42. గ్రాహ్యాగ్రాహ్యాపక్షాదులు ... ... | 183 |
| 43. లిఖితాదిపరీక్ష ... ... ... | 185 |
| 44. లిఖితవిభాగము ... ... ... | 187 |
| 45. సాక్షిస్వరూపము ... ... ... | 189 |
| 46. అగ్రాహ్యసాక్షులు ... ... ... | ,, |
| 47. సాక్షివిచారము ... ... ... | 190 |
| 48. సాక్షిశ్రావణము ... ... ... | 191 |
| 49. సాధనములు–వానిబలాబలములు ... ... | ,, |
| 50. అగ్న్యాదిపరీక్ష ... ... ... | 193 |
| 51. తీర్పు ... ... ... ... | 197 |
| 52. వాదముల పునర్విమర్శనము ... ... | 198 |

| విషయము. | పుటసంఖ్య. |
|---|---|
| 53. పదార్థస్వామ్యము-వానివిభాగము ... ... | 199 |
| 54. దండింపఁదగినవారు ... ... ... | 203 |
| 55. గనులనుండి తీయువస్తువుల కరనిర్ణయము ... | ,, |
| 56. చేసినవస్తువులస్వరూపము ... ... | 204 |
| 57. స్వర్ణరజతాదివస్తునిర్మాణమునకు భృతినిర్ణయము ... | ,, |

## షష్ఠప్రకరణము

| | |
|---|---|
| 58. దుర్గభేదములు ... ... ... | 206 |

## సప్తమప్రకరణము

| | |
|---|---|
| 59. సేనాస్వరూపము-దానిభేదములు ... ... | 208 |
| 60. ఆయమునుబట్టి గ్రహింపవలసిన సేనయు, సంవత్సరవ్యయమును ... ... ... | 210 |
| 61. రాజుసంపాదింపవలయు రథగజాదులు ... | 211 |
| 62. గజభేదమును దల్లక్షణములును ... ... | ,, |
| 63. అశ్వపరిమాణమును లక్షణమును వానిభేదమును ... | 212 |
| 64. అశ్వగతులు ... ... ... ... | 222 |
| 65. వృషభోష్ట్రస్వరూపము ... ... ... | ,, |
| 66. నరాదులవయోనిర్ణయము ... ... | 223 |
| 67. ఎద్దు మొదలగువానివయసు పరీక్షించువిధము ... | ,, |
| 68. గజాదుల శిక్షాసాధనములు ... ... | 224 |
| 69. వృషభాదుల రాజువిడియించుచోట్లు – దండువిడియువిధము – శత్రులవశపఱచికొనువిధమును ... | 225 |
| 70. శస్త్రాస్త్రస్వరూపము, వానిభేదమును ... | 227 |
| 71. అగ్నిచూర్ణస్వరూపము ... ... | 228 |
| 72. బాణములవిడుచువిధము, ఆయుధపరిమాణమును ... | 229 |
| 73. ఎట్టిరాజు యుద్ధకాముఁడు గావలయును ... | ,, |
| 74. యుద్ధస్వరూపము-దానిభేదములును ... ... | 230 |

| విషయము. | పుటసంఖ్య. |
|---|---|
| 75. యుద్ధానుకూలకాలము-దేశము ... ... | ,, |
| 76. అసాధారణబలములకు నెప్పుడు జయము కలుగును ... | 231 |
| 77. సంధివిగ్రహములస్వరూపము - వానివిభాగములు - నుపయోగించువిధమును ... ... | ,, |
| 78. సేనానాయకుల ముఖ్యకార్యము ... ... | 234 |
| 79 సేనాపతి యెప్పు డెట్టి వ్యూహమును రచింపవలెను ... | ,, |
| 80. సైనికులు పోవువిధము ... ... ... | 235 |
| 81. వ్యూహస్వరూపము-వానిభేదము ... ... | 236 |
| 82. రాజు సేనల నెట నిల్పవలయు - శత్రుల నెట్లు వశపఱచి కొనవలయు ... ... ... | ,, |
| 83. ఓడినవారిసొమ్ము గ్రహింపవలయువారు ... ... | 237 |
| 84. రాజుపాయములను నిశ్చయింపనప్పు డెట్లుండవలెను... | ,, |
| 85. కార్య మెట్లు సిద్ధించును - ఎట్లు సిద్ధింపదు ... | ,, |
| 86. రాజే యుపాయము నే గుణమును గ్రహింపవలెను... | 238 |
| 87. రాజెప్పుడు తప్పక యుద్ధము సేయవలెను ... | ,, |
| 88. రాజున కెట్టి మరణము ప్రశస్తము ... ... | 239 |
| 89. శౌర్యాభివర్ణనము ... ... ... | 240 |
| 90. రాజు విద్వాంసులతో నెప్పు డాలోచింపవలయు నెప్పుడు గూడదు ... ... ... | ,, |
| 91. రాజు యుద్ధమునఁ బలాయితుఁ డైన నేమి? ... | 241 |
| 92. రాజెవని విడువరాదు ... ... ... | ,, |
| 93. రాజు బ్రాహ్మణాదుల నెప్పుడు చంపిన దోషి కాఁడు... | ,, |
| 94. బ్రాహ్మణు లెట్టికాలమున యుద్ధము చేసిన దోషులు కారు | ,, |
| 95. యుద్ధ మెద్ది యుత్తమము - ఎద్ది తదితరము ... | 242 |
| 96. యుద్ధస్వరూపము ... ... ... | ,, |
| 97. బాహుయుద్ధ విభాగము ... ... ... | ,, |
| 98. యుద్ధమున సేనల నిల్పు విధము ... ... | 243 |
| 99. రాజు స్వసేనల నెప్పుడు రక్షింపవలెను ... ... | ,, |

| విషయము. | పుటసంఖ్య. |
|---|---|
| 100. యుద్ధకాలమున రాజు చేయవలయు నేర్పాటులు ... | 244 |
| 101. యుద్ధమున వధానర్హులు ... ... ... | 245 |
| 102. కూటయుద్ధము ... ... ... | ,, |
| 103. స్వకార్యము సాధించు విధము ... ... | ,, |


## పంచమాధ్యాయము


| | |
|---|---|
| 1. నీతిశేషము ... ... ... | 252 |

శ్రీరస్తు

# శుక్రనీతిసారము

## నీతిశాస్త్రప్రశంస

శ్రీమంతం బగు స్వావాసంబున సుఖాసీనుండైన భార్గవుని నమస్కరించి పూజించి పూర్వదేవతలు నీతిశాస్త్రముపదేశింపు మనిన నతఁడు సర్గాదికారణం బగు దేవునకు మ్రొక్కి యిట్లనియె. మున్ను లోకహితంబునకై పరమేశ్వరుండు శతలక్షశ్లోకపరిమితం బైన నీతిశాస్త్రంబుఁ గావించె. అల్పాయువు లగు నరులయు నరపతులయు నుపయోగంబు కొఱకుఁ దర్కవిస్తృతం బైనదాని వసిష్ఠాదుల మైన మేము సంగ్రహించితిమి. క్రియైక దేశబోధకంబు లగు శాస్త్రంబులు పెక్కులున్నను జతుర్వర్గసాధకం బైన నీతిశాస్త్రంబు సకలలోకోజ్జీవకంబు. శబ్దశాస్త్రంబు నభ్యసింపకయు లోక వ్యవహారానుసారంబుగఁ బదార్థసంబంధజ్ఞానంబు నందవచ్చు. కాణాదాదుల నేరువకయ ప్రాకృతంబులైన వస్తువుల నెఱుఁగ వచ్చు. ఉపనిషదాది పరిజ్ఞానంబు నొందకయు దేహాదుల నాశంబు తెల్లంబుగాఁ గానవచ్చు. బుద్ధికౌశల్యజ్ఞాపకంబులైన శాస్త్రంబు లెల్లను దత్తత్కర్త్రభిప్రాయంబుల వెల్లడించుఁ గాని వ్యవహారుల కుపయోగింపవు. మఱియుఁ దత్తచ్ఛాస్త్రంబుల నధిగమింపక యెట్టులేని తత్త్వజ్ఞానంబు నొందఁ

గాని జంతువులకు నిరశనంబున నసువులు నిలువనియట్లు నీత్య భావంబున లోకమర్యాద నిలువ దనుట యెల్లరకుఁ దెల్లంబ.

### నీతిశాస్త్రాభ్యాసము రాజునకు ముఖ్యము

సర్వాభీష్టదంబును నెల్లరకు సమ్మతంబు నగు నీతి విద్య లోకపాలకుం డగుట చేని కత్యావశ్యంబు. అపథ్యాశికి రోగంబులువోలె నీతిహీనుండైన యేలికకు శత్రువులు సద్యస్కాలంబునఁ గొందఱుఁ గాలాంతరంబునఁ గొందఱు వొడమి బాధింతురు. రాచవారికిఁ బ్రజాపాలనంబు ముఖ్యధర్మంబు; అయ్యది దుష్టనిరసన శిష్టరక్షణ రూపంబై యుండు. ఇవి రెండును దుర్నయునకు దుష్కరంబులు. రాజునకుఁ జెడునడతయ యత్యాహితకరంబును శత్రువృద్ధికరంబును స్వబలహ్రాసకరంబు నగుట నయంబు వదలి చరించు స్వతంత్రుండైన రాజు దుఃఖభాజనం బగు; అట్టివాని సేవయు నసిధారావలేహనంబై యుండు. నీతిమంతుఁ డగు రాజు స్వారాధ్యుండు ననీతిమంతుం డగు రాజు దురారాధ్యుండు నగు. నీతియు బలంబునుగల పుడమిఱేనియింట సిరి యచంచలయై యుండు. కావునఁ దన ప్రేరణంబు నొందకయ యెల్లరుఁ దనకు హితంబు సేయున ట్లాత్మహితంబు గోరు సమ్రాట్టు నీతి ధారణంబు సేయునది. బలరాష్ట్రామాత్యగణంబు భిన్నంబగుటకు సామి యకౌశలంబుకంటె నొండు హేతువు లేదు. శాసనపాలనంబులచే రంజకుం డగు రాజు బుద్ధిబలంబుచేఁ దేజస్వంతుండై పూర్వసుకృతంబున నైహికంబైన తపోవిశేషంబునను మహీమండలంబు ధరియించు.





రాజు కాలప్రవర్తకుఁడు

వృష్టి శీతోష్ణాదులచేతను బెక్కు లగు నాచారాదుల చేతను గ్రహనక్షత్రగతి విశేషంబులచేతను గాలంబు పలు విధంబు. నృపాలుం డాచారప్రవర్తకుండు గావునఁ గాల మూలం బని యెన్నంబడు. కాలవిశేషంబునన యట్టి యాచారంబులు గలుగు ననిన వానిఁ గావించువారికి ధర్మాధర్మంబు లొందవనేరవు. రాజదండంబునకు వెఱచియే లోకంబు స్వధర్మనిరతంబై దాన నుత్తమతేజంబు వడయుచుండు. స్వధర్మాచరణంబు సుఖకరంబైన తపంబు. అట్టితపంబుఁ గావించువారి కింద్రాదులుం గింకరు లగుదురు. మనుజులమాటఁ వేఱ చెప్పనేల? రాజు స్వధర్మనిరతుండు గాఁడేని యతని తేజంబు క్షయించు. కావున నభిషిక్తుండైనఁ గానివాఁడైనఁ బాలనంబు సేయ నారంభించిన నాఁటఁగోలె నచ్ఛిద్రుండై స్వధర్మపరతంత్రుండై బుద్ధి శౌర్య తపోబలంబులచేఁ బ్రజఁ దనప్రజఁ బోలెఁ బాలించుచు దుర్జనుల మహాభయహేతువు లగు దండంబులచే భీతులఁ జేయుచు స్వధర్మాచరణంబునకు మఱల్పునది.

బుద్ధిమంతు కార్యమునకు నల్పం బేని దొసఁగుపొసఁగఁ బోలదు. నీతి బుద్ధి శౌర్య బల ధనసంపన్నునకుఁ దిర్యక్కులును వశగతంబు లగును.

రాజునకు గుణములచేఁ త్రైవిధ్యము

సాత్త్వక రాజస తామసంబు లగు తపంబుల నెద్దాని రా జాచరించుఁ దద్గుణప్రధానుం డగు. ఉదారుండును

స్వధర్మనిరతుండును క్షమియు విషయ నిస్పృహుండును సాత్త్వికుండు శూరుండు నగు రాజైహికసుఖంబుల నొంది యవసానంబున మోక్షంబు నొందు. నిర్దయుఁడు మత్తుఁడు హింసారతుఁడు శఠుఁడు నీచప్రియుఁడు స్వతంత్రుఁడు దాంభికుఁడు భోగైకపరాయణుఁడు ననృతవాదియు నగు రాజు నరకభాజనంబై తదవసానంబునఁ దిర్యక్త్వంబు నొందు.

సాత్త్వికుం డుత్తమభోగంబులను దామసుం డధమభోగంబులను రాజసుండు మధ్యమభోగంబుల ననుభవించుఁ గావునఁ జిత్తంబు సత్త్వంబునం బనుపఱచునది. సుకృతదుష్కృతకర్మంబుల సుగతిదుర్గతులు వాటిల్లు. ఎట్టివాఁడు క్షణంబు నక్రియుండై యుండనేరఁడు.

## వర్ణభేదము

బ్రాహ్మణాదివర్ణంబు లెల్లను గుణకర్మంబులచే భేదిల్లుం గాని జననంబుచే భేదిల్లవు. జననంబు వలన బ్రహ్మతేజస్సంపత్తి యొదవనేరదు గావున బ్రహ్మవలన నుప్పతిలినవారి నెల్ల బ్రాహ్మణు లనంజనదు.

## వర్ణగుణములు

ఎఱుకవలనను గర్మోపాసనాదులవలనను శమదమంబుల వలనను దయాదాక్షిణ్యంబుల వలనను బ్రాహ్మణుండు నాఁబడు. ప్రజాసంరక్షణ సామర్థ్యంబు పరాక్రమంబు నింద్రియనిగ్రహంబు దుష్టనిగ్రహ శైలియుం గలవాఁడు క్షత్రియుండు. క్రయవిక్రయనైపుణ్యంబుఁ బాశుపాల్యంబుఁ గృషియుఁ గలవాఁడు వైశ్యుఁడు. ద్విజార్చనాసక్తుఁడు జితేంద్రి

యుఁడు శూరుఁడు సీరకాష్ఠాదివహుఁడు శూద్రుఁ డన నొప్పు.
స్వకులోచితధర్మంబుఁ బరిత్యజించి పరపీడనంబుఁ గావించు
చుండు లైన యవివేకులు మ్లేచ్ఛు లనఁబడుదురు.

## కర్మవిచారము

తొలిమేనఁ జేసిన చేఁతవలనన పున్నెంబునం జెట్టయుం
దుం దలఁపు వోడము. దాని నొండు తెఱఁగున గావింప మాని
సికి వెరవు దోఁపదు. సహాయంబులుం దాని కనుగలంబులైన
వ యమరు అదృష్టంబు స్త్రీఱ నేవాఁడును నెరవరి గాఁ డను
ఱింతయు నిక్కంబు గావునఁ గర్తవ్యాకర్తవ్యంబు లైనకర్జం
బులదెస నుపదేశంబు విత యనంజనదు. శిష్టచరితులైన బుద్ధి
మంతు లెల్లం బౌరుషంబుఁ గొనియాడుదురు; స్వశక్తిచేఁ
గార్యంబుల నెఱవేర్చికొననేరని క్లీబు లదృష్టంబు గొనియాడు
దురు. సకలకార్యంబులు దైవపౌరుషంబులయందు సుప్రతి
ష్ఠితంబులై యుండు. కర్మంబు పూర్వకృతంబు నైహికం
బనియు నిరుదెఱఁగు లయియుండు. ఇం దెయ్యది బలవత్తరం
బది తక్కటిదానికిఁ బ్రతికారి యగు. తద్బలాబలపరిజ్ఞానంబు
ఫలంబున ననుమేయింపఁదగు. ఫలోపలబ్ధికి బ్రత్యక్షంబైన
హేతువు లేకున్న నది పూర్వకర్మజన్యం బని యెన్నందగు.
మానిసిజతనం బల్పం బయ్యు నొక్కతఱి నెక్కుడుగ ఫలిం
చెనా యదియు ముందటికర్మంబున నయ్యె నని కొందఱు
నిప్పటిదానన యని కొందఱు నందురు. కొందఱు దివ్వియ
చమురును వత్తియుం గలదియయ్యు పయ్యరవలన రక్షింపని
నుత్సన్నం బగునట్లు ఫలంబు పూర్వకర్మసంచితం బయ్యు

నిప్పటి వ్యాపారంబు లేమి లభియింపద యండ్రు. అదియట్లుండె. తప్పక కాఁగలవానికి మాఱుచేత కలదేని చెఱుగులకు బుద్ధి బలానుసారంబుగఁ బ్రతివిధానం బాచరించుటయ లెస్స.

### రాజుప్రవర్తనము

రాజు స్వానుకూలప్రతికూలఫలంబులచే దైవానుకూల్యాదుల నెఱిఁగి ప్రవర్తించునది. తొల్లి రావణదుర్యోధనులకు వనభంగగోగ్రహంబులయందు హనూమదర్జునులవలన దైవ ప్రాతికూల్యంబును రాఘవార్జునులకు దైవానుకూల్యంబును విస్పష్టంబయ్యెఁ గాదె. దైవం బనుకూలం బగుచు స్వల్ప క్రియయు మహాఫలంబు గావించు; తత్ప్రాతికూల్యంబున బలిహరిశ్చంద్రులకుఁ బోలె సుకర్మంబు ననిష్టఫలదం బగు. ఎట్లును సత్కర్మంబువలన సత్ఫలంబును నసత్కార్యంబు వలన నసత్ఫలంబు నగు నని శాస్త్రంబువలన నెఱుకపడుఁ గాన దుష్కర్మంబు విడిచి సత్కర్మం బాచరించునది. క్షత్రియుండు కాలంబున కెల్లఁ గారణంబు గానఁ దన చరితంబునను దండంబునఁ బ్రజను స్వధర్మమ్మున నిలుపునది.

### రాజ్యాంగస్వరూపము

రాజ్యాంగంబు లేడింటను నృపుండు శిరంబు చక్షువ మాత్యుండు చెలికాఁడు చెవి కోశంబు మొగమ్ము సేన మనంబును హస్తంబులు దుర్గంబు పాదంబులు రాష్ట్రంబు నని చెప్పుదురు.

### రాజు నావశ్యకత

సదాచారంబునఁ బ్రవర్తించు నరపతి చందురుఁడు మున్నీఁటికిఁ బోలె నిజ్జగంబున కభివృద్ధిహేతువు. బాగుగఁ

పాలించు భూపతి లేఁడేని యిజ్జగం బకర్ణధారంబగు కలంబు సంభ్రంబం దవియునట్లు విపన్నంబగు. రాజు లేనినాఁడు జనము స్వధర్మాచరణనిరతంబు గానోపదు; జనసమాజ విహీనుండైన వాఁడును రాజిల్లఁడు; న్యాయప్రవృత్తుఁడైన వాఁడు దన్నుం బ్రజను ద్రివర్గంబుతో ననుసంధించు. యుధిష్ఠిరుండు ధర్మంబునఁ జిరకాలంబు భూమి భుజించె; నహుషుఁ డధర్మంబున స్వర్గపదభ్రష్టుండై రసాతలంబునఁ బడియె; వేనుఁ డన్యాయంబున నుత్తమపదచ్యుతుండై మేనుతొలంగె; పృథు వుత్తమకర్మంబున బహుకాలంబు రాజ్యంబు సేసి తన పేరు లోకవిదితంబు గావించి యెన్నఁటికిం జెడని పదవి నొందె; కావునఁ బార్థివుండు ధర్మంబు పురస్కరించుకొని పరిపాలనంబునకుఁ దొడంగునది.

### రాజనిర్మాణహేతువు, నతనియందలి దేవాంశములును

మున్నొకప్పుఁడు నాయకుండు లేమిని జను లన్యోన్య పీడితు లగుడుఁ జతుర్ముఖుండు లోకపాలురయుఁ జంద్రార్కులయు నంశంబులచేఁ దపస్సామర్థ్యంబునఁ జరాచరాత్మకంబగు నిజ్జగంబున కొడయని నిర్మించెం గావున భూవిభుఁ డింద్రుండునుం బోలె రక్షణదక్షుండును భాగభాక్కునై గంధంబునకు వాయువువోలె కర్మంబులకుఁ బ్రేరకుండై ధర్మ ప్రవర్తన తమోనిరసనంబుల రవిం బోలి దుష్కర్ములయెడ దండంబున న్యమవర్తిత్వంబునం జము ననుకరించి శౌచంబున నగ్నిసదృశుండై రసంబున వరుణుండువోలె స్వధనంబుల లోకంబుఁ గాపాడుచుఁ జంద్రుండు స్వకరంబుల జగదాహ్లా

దంబు సేయునట్లు స్వచరితంబుల నెల్లర సంతసిల్లఁజేయుచుఁ గుబేరుఁడు నిధులకుం బోలెఁ గోశంబులకుఁ గాపరియై యెల్ల యంశంబులకంటెఁ జంద్రాంశంబు గారవించునది. మఱియు జనకుఁడట్లు సద్గుణం బలవర్చుచుఁ దల్లియుఁబోలె నపరాధంబు సైఁచి పుష్టి గావించుచు గురువువలె హితం బుపదేశించుచు సోదరుండువోలె శాస్త్రానుసారంబుగ భాగంబు హరియించుచు బంధుమిత్రులుంబలె స్త్రీధనాదుల నరయుచు వైశ్రవణుండుఁబోలె ధనంబుల నొసఁగుచు దండధరుండువలె సుదండంబుఁ గావించుచు నీగుణసప్తకంబు నేమఱకుండవలయు. ఈ గుణములు మంచిరాజునం దుండును.

ఎవ్వాఁడు శిక్షింప సమర్థుం డయ్యు నపరాధంబు క్షమియించు నాతఁడు క్షమి యనఁబడును; సర్వగుణసంపన్నుఁ డయ్యు భూపతి యోరిమి లేనివాఁ డయ్యెనా భాసిల్లఁడు; దుర్గుణంబులఁ బరిత్యజించి యతివాదంబుల కోర్చి దానమానంబుల లోకరంజకుండై దాంతిశౌర్యంబులు గలిగి యరినిషూదనుం డై యస్వతంత్రుఁ డై శస్త్రాస్త్రకౌశలంబు వడసి జ్ఞానవిజ్ఞానయుక్తుం డై నీచమైత్రి వర్జించి దీర్ఘదర్శనవృద్ధసేవనంబుల నెడపక గుణవత్సంగంబు గావించుచుఁ బాలించు రాజు దేవాంశకుండును విపరీతవర్తనుండు పూర్వదేవాంశకుండును నరకభాజనుండు నని నీతికోవిదులు పలుకుదురు.

### రాజునకుఁ బ్రజకు నన్యోన్యానురాగ మావశ్యకము

రాజసచివాదులును "యథా రాజా తథా ప్రజా" యని యున్నందున వాని యంశంబునకుఁ దగినవారల యగు

దురు. అట్టి సచివాదులు చేయు కార్యంబులకు నియతిబలం
బున రా జనుమోదించుచుండు. జన్మాంతరకర్మఫలం బవ
శ్యానుభావ్యం బైనను బ్రతివిధానంబు గావించినఁ జికిత్సిత
గదుండు బాధం బాయునట్లు తత్కర్మోపభోగంబు వాయు.
సర్వజనంబు మనంబున సుఖంబ కోరుఁ గావున ననిష్టంబు
గురూపదేశంబున విదితంబైన నేవాఁడును జెడు కర్జంబునకుఁ
దొడరమి సద్బోధంబు నొందియే రా జేకార్యంబున కైనఁ
దొడరునది. నయంబున కడంకువయు దానికి శాస్త్రజ్ఞానం
బును దాని కింద్రియజయంబును నిదానం బై వెలయు.
భూపతి దన్ను మున్ను వినయవంతుం గావించుకొని పదం
పడి పుత్రులన్ మిత్రుల న్మంత్రుల న్భృత్యుల న్లోకులం
గ్రమంబున వినయవంతులం జేయునది. రాజు పరోపదేశ
మాత్రంబునఁ గుశలుండుగాఁజనదు గానఁ దానును సత్క
ర్మరతుం డగునది. రాజు సద్గుణుఁ డయ్యు నొకపు డధికార
హీనుఁడు గావచ్చును. ఇంద్రాణి యవిధవమైనట్లు ప్రజదుర్గుణ
యయ్యు నెప్పుడు రాజవిహీన గానోపదు. సంపన్నాశం
బొదవెనేని రాజునకుఁ గాని మంత్రికిఁ గాదు. పుత్త్రులను
దాయాదులం దన్ను న్సన్మార్గంబున నడుపుచు రాజు ప్రజా
పాలనతత్పరుండు ననురక్తప్రకృతియునై శ్రీసమృద్ధి నొందు.

ఇంద్రియ నిగ్రహము

దుష్టభోగారణ్యంబునం బ్రధావించు నింద్రియగజంబు
జ్ఞానాంకుశంబున వశపఱుచునది. విషయామిషలోభంబున
నింద్రియంబులఁ బ్రేరించు మనంబు నిరోధించిన నెల్లయింద్రి
యంబులు జితంబుల యగు. ఒకటియగు మనంబు జయింపఁ

నశక్తుం డైనవాఁడు ససాగరవనద్వీప యగు వసుమతి నెట్లు జయింపనోపు? అవసానంబున విరసంబులైన భోగంబులచే నాకృష్టుండు కరికరణి బంధంబు నొందును. శబ్దస్పర్శరూప రసగంధంబుల నొక్కటొక్కటియ నాశంబు నొందించు; విషసన్నిభంబు లగు విషయంబు లన్నియుం గూడినఁ జెప్ప నేల? శుచియు దర్భాంకురాహారంబు సుదూరలంఘనజంఘా లంబు నగు మృగంబు లుబ్ధకగానమోహంబున వధంబు నొందుఁ గాదె. గుంటి శిఖరంబుఁ బోలు నాకారంబు గలిగి నగంబుల నున్మూలింపఁజాలు వారణంబు కరిణీస్పర్శంబున బంధంబు నొందు; దివ్వెసెగఁ జూచి చంచలదృష్టియై పతం గంబు మోహంబున మిత్తివాతఁ జొచ్చు; అగాధజలంబుల నున్న మీను సామిషంబైన గాలంబు గ్రసించి కాలధర్మంబు నొందు; ఉత్కర్తనంబున సమర్థంబయ్యు నుద్గమనంబునకుం దగినది యయ్యు భ్రమరంబు గంధలోభంబునఁ గమలంబునఁ జిక్కుపడును.

కామజంబు లగు వ్యసనంబుల నింద

ధనపుత్రమతిప్రదంబు లయ్యు ద్యూతస్త్రీమద్యం బులు మహానర్థమూలంబులు. నలధర్మప్రభృతిభూపాలురు జూదంబున నాశంబునొందిరి. కామినీస్మరణంబును మనో వికారంబు కావించు; దర్శనవిలాసభాషణంబులు సెప్పనేల? మృదుగద్గదభాషిణియైన యువతి రక్తాంతలోచనయై యెవ్వాని వశుం గావింపనోపదు? జితేంద్రియు లగు మునులను సైతము లోఁబఱుచు నన, నజితేంద్రియుల వార్త చెప్పనేల? ఇంద్రదండకనహుషరావణాదులు పలువురు స్త్రీ మూలం

బునఁ గీడువొందిరి; మద్యంబునం దగులు వెల్లయిన నది బుద్ధి
నాశకం బగు; ఇవియె తజ్ఞులకుఁ బ్రభూతధనంబును సుఖం
బును బుద్ధినైర్మల్యంబును గలిగించు.

### కామాదు లెక్కుడ మంచివి, యెచటఁ గావు

విజిగీషుం డగు రాజు ప్రజాపాలనంబునఁ గామంబును
శత్రువులయెడఁ గ్రోధంబును, సేనాపరిగ్రహంబున లోభం
బును వినియోగించి యొండుచోఁ జొరనీకుండునది. పరస్త్రీ
లయందుఁ గామంబును నన్యధనంబుల లోభంబును స్వ
ప్రజలయందుఁ గ్రోధంబు నుత్తముఁ డైనవానికి వలవదు.
పెఱయింతివలనఁ గుటుంబియనియు నన్యధనంబువలన ధనికుఁ
డనియు స్వజనదండంబున శూరుండనియుఁ బ్రతిష్ఠ యేవానికిఁ
గలుగదు. బాగుగం బ్రజ నరయని రాజును నతపస్వి యైన
బ్రాహ్మణుని దాతగాని ధనికుని దేవతలు హింసించి యధో
లోక నివాసిఁ గావింతురు.

### తపః పాప ఫలములు

ప్రాభవంబు నీఁగియు ధనిత్వంబును దపఃఫలంబులు.
యాచనయు నిర్ధనత్వంబు దాస్యంబుఁ బాపఫలంబులు.

### రాజు గుణదోషములు

ప్రభు వైహికాముష్మికసుఖంబులకొఱకు శాస్త్రంబు
లన్నియుం బరిశీలించి యాత్మజయంబు నొంది స్వవృత్తంబు
నిర్మలంబు గావించునది. దుష్టుల శిక్షించుటయు దానంబును
బ్రజాపరిపాలనంబును రాజసూయాదియజనంబు న్యాయం
బునఁ గోశార్జనంబు రాజుల నరిగాఁపులఁ గావించుటయు శత్రు

సత్కార్యంబు చేయ నిశ్చయించు. నీతిశాస్త్రానుసారియై జితేంద్రియుండైనవాని భాగ్యంబును గీర్తియు మిన్నుముట్టు.

### ఆన్వీక్షిక్యాదుల స్వరూపము

ఆన్వీక్షికి, త్రయి, వార్త, దండనీతి యను విద్యలను రాజవశ్య మభ్యసింపవలయు. ఇం దాన్వీక్షికి తర్కవేదాంతముల వెల్లడించు. త్రయి ధర్మార్థకామంబుల వివరించు. అర్థానర్థంబుల వార్తయు నయానయంబుల దండనీతియు బోధించు. వీనివలన వర్ణాశ్రమంబుల తెఱంగుం దేటపడు; అంగంబులు వేదములు మీమాంసయు న్యాయంబు నర్థశాస్త్రంబు పురాణంబులుం ద్రయి యనంబడు. కుసీదకృషి వాణిజ్య గోరక్షణంబులు వార్తచేఁ జెప్పఁబడు. వార్తాజ్ఞానంబు గల సాధువు వర్తనంబునకు వెఱవఁడు. దమంబు దండంబు నాఁబడు. దండంబునకు రాజు హేతువు గాన నతండు దండుఁడనఁబడు. తన్నీతి దండనీతి. సర్వాభీష్టప్రాపణంబున నీతిశబ్దం బన్వర్థసంజ్ఞ నొందు. ఆన్వీక్షికి యాత్మవిజ్ఞానంబు గావించి శోకహర్షంబుల నపనయించు. యథావిధి త్రయి నధిగమించినవాఁ డుభయలోకసౌఖ్యంబుల నొందు. ఎల్లవారియెడ నానృశంస్యంబు పరమధర్మంబు గాన రాజు దానితోడన కృపణంబగు జనమును బాలించునది. రాజు స్వసుఖాభిలాషం బరపీడనంబు గావింపఁజనదు.

### రాజు కర్తవ్యాకర్తవ్యములు

కృపణం బైన జనంబు పీడ్యమానం బై స్వమృత్యుభయంబునఁ బార్థివు బాధింపనోపు. సుజనసేవితుం డైన రాజు మిగుల శోభిల్లుఁ గాన సుజనసంగంబు కర్తవ్యంబు.

దాన ధర్మసుఖాభివృద్ధియు నగు. చందురుండు నవోత్ఫుల్లో త్పలం బైన సరసిం బోలె సుజనవేష్టితుం డైన భూపాలుండు జనంబుల మనంబు తనియంజేయు. సూర్యకిరణతప్తం బై నిరాశ్రయం బై యుద్వేజనకరంబైన మరుస్థలంబుఁ బోలె దుర్జనసంగంబు నుజ్జగించునది. నిశ్వాసనిష్ఠ్యూతానలధూమ ధూమ్రముఖం బైన పాఁపకులంబు తోడి చెలిమి దుర్జనసం గతికంటె వరంబు. ఎడఁద హితంబుఁ గోరువాఁడు సాధువు నకుఁ గావించు వందనంబుకంటె సాధుతరంబుగ నసాధువు నకు నది గావించునది. దాత యయ్యు రాజు వాక్పారుష్యం బున జనుల కుద్వేజకుం డగుఁ గాన మృదువచనంబున లోకా హ్లాదంబు గావించునది. మేధావి పీడితుఁ డయ్యు జనంబునకు హృదయతాపకరం బగునుడి నుడిగి మిత్రులయందే నమిత్రు లయందే శిఖికేకనుంబోలె మధురోక్తిఁ బచరించునది. విప శ్చితుల వాక్యంబులు ప్రాలె శిఖహంసకలకంఠంబుల పలుకు లేని మనంబు హరియింపనేరవండ్రు. ప్రియంబుభాషించుచు సత్కారం బభిలషించు ననవద్యచరితు లైన శ్రీమంతులు నరవిగ్రహధారులైన దేవత లనఁబడుదురు. నెయ్యంబునకు భూతదయకు దానంబునకు మధురవాక్యంబునకు సాటియగు సంవననంబు ముల్లోకంబుల నెందు లేదు. ఆస్తిక్యసంపన్నుఁ డై దేవతాపూజఁ గావించుచు సుహృదుల నాత్మంబోలెఁ జూచుచుఁ బ్రణిపాతంబున నోజ్జను సదాచారంబున సత్పురుషు లను భక్తిచే దేవతలను సద్భావంబున బంధుమిత్రులనుఁ బ్రేమ మానంబుల స్త్రీ భృత్యులను దాక్షిణ్యంబున నితరజనంబును స్వాభిముఖులఁ గావించునది. బలబుద్ధిసంపన్నుం డై యుక్త

పరాక్రముఁ డగు రాజు వసుపూర్ణం బైన వసుమతినెల్ల నేలఁగలవాఁ డై సద్భూపుఁడు నాఁ బ్రసిద్ధి వడయు. బుద్ధి బలశౌర్యపరాక్రమంబులు రాజున కుత్తమగుణంబులు; అన్య సుగుణసంపన్నుఁ డయ్యు ధనికుఁ డయ్యు నీగుణంబులు లేని వాఁడు స్వల్పం బేని నేల నేలఁదగఁడు. పార్థివుండు స్వల్ప దేశంబున కధిపతి యయ్యు బుద్ధ్యాదిగుణంబులను ధనంబు ననుఁ దేజస్వియు నవ్యాహతాజ్ఞుండు నగు; సాధారణగుణం బుల భూప్రసాధనంబున నశక్తుం డగు; దేవదానవవిమర్దిని యగుభూమి యెల్లధనంబులకు గని యగుటం జేసి పుడమి ఱేండ్లు తదర్థం బాత్మవినాశంబే నిచ్చయింత్రు. ఆత్మభోగ నిమిత్తంబు ధనజీవితంబులు రక్షించుచుఁ బ్రజారక్షణంబుఁ గావింపనిరాజుల ధనజీవితంబులు వ్యర్థంబులు. సదాయస హాయంబు నొందక యిచ్చవచ్చినట్లు వెచ్చింప సంచితధనంబు నిధీశ నిధిసదృశం బయ్యు నలంభావంబు నొందమి న్యాయమార్గమున ధనం బార్జించుచు వెచ్చింపవలయు. ప్రభువు బలశౌర్యాదులచే గారవింపఁబడిన ట్లుత్తమకులజననంబున శోభిల్లఁడు. కావున నెట్టిఱేని కేని బలశౌర్యాదు లావశ్యకం బులై యుండు.

### రాజమండలేశ్వరాదుల భేదము

లక్ష రాజతకర్షంబులకుం దక్కువ కాకుండ లక్ష త్రయంబుకంటె నధికంబు గాకుండ నేఁటేఁటఁ బ్రజవలనఁ బీడ గావింపక నరిగొనురాజు సామంతుం డనఁబడు. నాలుగు లక్షలు మొదలు పదింటిదనుకఁ బలుచంబు గొనువాఁడు మండలేశ్వరుఁ డనియు' దానికంటె నధికముగ నిరువదిలక్ష

లకు మించని యులుపా (కప్పము) గొనువాఁడు రాజనియుఁ బిమ్మట నేఁబదిలక్షుంబులదాఁకఁ గరంబుగొనువాఁడు మహారాజనియుఁ దరువాతఁ గోటిపర్యంతంబు పన్ను గొనువాఁడు స్వరాట్టనియుఁ బదంపడి దశకోటి పరిమితభాగధేయంబు నొందువాఁడు సమ్రాట్టనియుఁ దదధికబలి నార్జించువాఁడు విరాట్టనియుఁ జెప్పఁబడుదురు. పంచాశత్కోట్యధికభాగధేయము గొనుచు సప్తద్వీప యగు సర్వంసహ వశపఱిచి కొన్నవాఁడు సార్వభౌముండు. రాజు బ్రహ్మచే స్వభాగభృతిని బ్రజకుఁ బాలనార్థంబు స్వామి యనుపేర దాస్యంబున నియుక్తుం డయ్యె. సామంతాదులకు సములగు భృత్యులు రాజుచే నధికృతులై రాజభాగంబు గొనుచు సామంతాది నామంబులు వడయుదురు. సామంతాదిపదమునుండి భ్రష్టులై తత్తుల్యవేతనమున మహారాజాదులచేఁ బోషితు లగు వారు హీనసామంతులు నాఁబడుదురు. నూఱు గ్రామంబుల స్వతంత్రాధికారంబు గలవాఁడు సామంతుఁడు. శతగ్రామాధిపాలనమున రాజుచే నియుక్తుఁడు నృసామంతుఁడు. దశగ్రామసంరక్షణ నియమితుఁడు నాయకుఁ డనియు నయుతగ్రామంబుల భాగంబు ననుభవించువాఁ డాశాపాలుఁ డనియు స్వరాట్టనియు నెన్నంబడు.

### భూపరిమాణనిరూపణము

క్రోశమాత్రపరిమితం బై సహస్రరూప్యకర్షంబులు రాజభాగ మొసంగునది గ్రామంబనియు గ్రామార్థంబు పల్లి యనియుఁ బల్ల్యర్థంబు కుంభం బనియు వ్యవహరింతురు. కరసహస్రపంచకంబునం బ్రాజాపత్యం బైన క్రోశమును జతు

స్రహస్రహస్త పరిమాణమున మానవక్రోశమును నగు. బ్రహ్మమానంబునఁ గ్రోశక్షేత్రంబు (Area) సార్థద్వికోటి హస్తంబులే నిరువదేనుదండంబులే నగు. మధ్యమామధ్యమ పర్వంబున నేని యవాష్టకంబున నే నొక్కయంగులము. దానిస్థాల్యమైదు యవలంతయగు. అంగులములు చతుర్వింశతి యైన నొక బ్రాహ్మం బగుకరము. భూమి మానంబునం బ్రాహ్మం బుత్తమంబు. మిగిలినవి యధమంబులు. చతుఃక రాత్మకంబు ప్రాజాపత్యదండంబును, బంచకరాత్మకంబు లఘువు (మానవంబగు దండంబు) నగును. మానవం బగు నంగులంబు పంచయవ పరిమాణంబు. ప్రాజాపత్యం బగు దండంబునకు వసుమణ్మని యవపరిమాణంబును, మానవ దండంబునకు షట్ఛతయవ పరిమాణంబు నుండును. ఇరువది యైదు దండంబులు నివర్తనమను నిది యుభయ సమ్మతంబు. మూఁడువేల యంగులంబుల పరిమాణంబున నేని, పదియు నైదువేల యవల పరిమాణంబున నేని, నూఱు నిరువదియైదు హస్తంబుల పరిమాణంబున నేని మానవం బగు నివర్తనం బగును. ఏకోనవింశతి సహస్రద్విశతయవ పరిమాణంబున నేని, చతుర్వింశతి శతాంగులంబుల పరిమాణంబున నేని, శత కర పరిమాణంబున నేని ప్రాజాపత్యం బగు నివర్తనం బగు. పంచవింశత్యుత్తర షట్ఛతదండంబు లుభయ మతంబునను, నివర్తనక్షేత్రం బగు. దాని రెండుపార్శ్వంబులు ప్రత్యేకం బిరువదైదు దండంబు లుండుఁ గాన నట్లయ్యె. డెబ్బదియైదు వేల యంగులంబుల మానవ పరివర్తనంబు, నఱువదివేల యంగులంబులఁ బ్రాజాపత్య పరివర్తనంబునగును. పంచవింశ

-త్యధికంబు లగు నేక త్రింశచ్ఛత హస్తంబుల మానవ పరి వర్తనంబును, నిరువదియైదువందల హస్తంబుల ప్రాజాపత్య పరివర్తనంబును బ్రఖ్యాతంబులు. మఱియుఁ బాదోన చతుర్లక్షంబులగు యవలపరిమాణంబున మానవపరివర్తనంబును, నాల్గులక్షలు నెనుబదివేల యవలపరిమాణంబునఁ బ్రాజాపత్య పరివర్తనంబు నగును. మఱియు నాల్గువేల హస్తంబులు, గాని యెనిమిదివందల దండంబులు గాని ముప్పదిరెండు నివర్తనంబులు మానవమానంబున నగును. పరివర్తనముభుజ (ప్రక్క) పరిమాణంబున నిరువదియైదు దండంబులు. నాఁటఁ బదివేలకరంబులు పరివర్తన క్షేత్రంబు. కరగ్రహణంబు ప్రాజాపత్యమానమున నన కావించునది. రాజు స్వాపత్కాలంబున మనుమానమున నేని గ్రహింపఁదగు. లోభంబునఁ బ్రజలఁ బీడించురాజు ప్రజతోఁడ క్షయించు. రాజు ద్వ్యంగులం బేని భూమి స్వత్త్వనివర్తనపురస్సరంబుగ నీఁ దగదు.

రాజు భూమి నెట్లీవలెను

వృత్త్యర్థం బేని కేని గ్రహీతృజీవితావధికముగ భూమి నీఁదగు. బుద్ధిమంతుఁ డగు రాజు దేవళోత్సవాదులకు భూదానము గావించునది. మఱియుం గుటుంబింబరికించి గృహార్థం బారామార్థంబుం దగునంతనేల నీఁజను.

పత్తననిర్మాణము - రాజగృహనిర్మాణము

నానావృక్షలతాకీర్ణం బై పశుపక్షిగణావృతం బై సుబహూదకధాన్యం బై తృణకాష్ఠసమృద్ధం బై నాతిదూరమహీధరం బై నౌకామార్గంబున వారాశికిం జనఁ బోవు నదీతీర సురమ్య సమభూతలంబున వలయాకారంబున నే

నర్ధచంద్రాకారంబుననేఁ జతురశ్రాకారంబుననే వాపీకూప తటాకాదియుతంబు చతుర్ద్వారంబు సుమార్గారామవీథికంబు దేవాలయ సంయుతంబు సపరిఖప్రాకారంబు మఠపాంథ శాలావిరాజితంబు నగు రాజధానిం గల్పించి రాజు సుగు ప్తుండై ప్రజతో నట వసియించునది. రాచగీము నడుమఁ గొలువుకూటంబును గోష్ఠంబు, సాహిణంబు, నేనికసాలయు, మంచినీటి డిగ్గియలు, నంథువులు, నీటియంత్రంబులుం గలది యై యన్ని దెసల సరికొలఁదియై దక్కినంపుఁగడ నున్నతంబై యుదగ్భాగంబున నవనతంబై విషమబాహుకంబు నై తనర్ప వలయు. బహుభుజపరిణాహ మైన శాల చతుశ్శాల యైనఁ గాని రాజిల్లదు. అయ్యాది శస్త్రాస్త్రకుశల సంయుతం బై ప్రాకారయంత్ర సురక్షితంబై సత్రికక్షుంబై నాల్గుదెసల ద్వారంబులు గలిగి దివారాత్రం బాయుధధారులై పరివర్తకు లైన యామికులచే నెల్లకక్షుల సుగుప్తంబు నానాగృహాపాప కార్యాట్ట సంయుతమునై వెలయవలయు. స్నాన పాక భోజన యజన వస్త్ర మార్జనగృహంబులు తూర్పుదెసఁ బానని[ద్రా] విహార రోదన ధాన్య ఘరట్టాది నిలయంబులు నుత్సర్గదాస నిశాంతములు జమునిదిక్కున గో మృగోష్ట్ర గజాలయంబులు పడమటికడను వాజి రథ ద్రవ్య శస్త్ర వస్త్ర వ్యాయామ విద్యాభ్యాసనిలయంబు లుత్తరాశాముఖంబునను సుమనో జ్ఞంబుగ సుగుప్తముగ నొనరించునది. ముందటి యేర్పా టుల నతిక్రమించి యేనియు రాజు లిండ్ల సుఖదాయకము లుగా నొనర్పవచ్చు. ధర్మాధికరణశిల్పశాలలు స్వనివాసము నుత్తరమున నిర్మింపఁదగు. గృహవిస్తారమునకుం బంచమాం

శోచ్ఛ్రాయంబు భిత్తిప్రమాణం బగు. దాని స్థౌల్యంబు కోష్ఠవిస్తార షష్ఠాంశము. మీఁదటి పరిమాణం బేక భూమి కంబున కుక్తంబు. అనేక భూమికంబులకు దీనిం బట్టి పరిమాణాధిక్యంబు గావలయు. కంబంబుల నయినఁ గుడ్యములనైనఁ గోష్ఠముల వేఱుపఱుచునది. త్రికోష్ఠం బేని పంచకోష్ఠం బేని సప్తకోష్ఠం బేని యెనిమిదిద్వారములు గల యది గృహము. గృహమధ్యభాగము ద్వారాంశము గాన నటఁ దక్క నన్యస్థలమున ద్వారము నిలుపఁదగదు. అపవరకములం దెల్ల వేర్వేఱ సుఖదంబు లగు వాతాయనము లుండవలయు. ద్వారమునకు నన్యగృహద్వారవేధయు కోణకూపమార్గవృక్షస్తంభాదివేధయు నుండఁజనదు. ప్రాసాదమండప ద్వారముల మార్గవేధాది దోషంబు లేదు. గృహపీఠం బౌన్నత్య చతుర్థాంశము. అది ప్రాసాద మండపంబుల కర్థాంశ మని కొందఱ మతంబు. ఇతరజాలకవిద్ధంబైన గవాక్షం బప్రశస్తంబు. కప్పు దానఁ గురిసిన జలంబు చుల్కన జాఱఁదగినదిగ విస్తరార్థాంశ మధ్యోచ్చంబు ఖర్పరసంభవము నుండవలయుఁ గాని నిమ్నంబు గాఁ జనదు. లోఁగిటికి సరికొలఁదినే నెచ్చు కొలఁదినే నర్ధపరిమాణంబుననే మూలంబు గల్గునట్లు పచ్చి కాండ్ర లాఁగున కశక్యం బగునట్లును నిచ్చలు గావలి లెంకలచే సురక్షితంబును నాళీకాస్త్రయుతంబును బహుదృఢ గుల్మంబును సుగవాక్షప్రణాళికమును నగు ప్రాకారము పొడవున కర్ధవిస్తరమున నిర్మించి దానికిం జుట్టును నాతిసమీపంబుగ నగాధసలిల యగు పరిఖను లోఁతుకంటె ద్విగుణ విశాలముగఁ ద్రవ్వింపవలయు. సుసాధన యోధవర్జితం బైన

దుర్గనివాసంబు రాజునకు మేలొదవింపక బంధనకారి యగు. అపవరకంబుల మూటనే నైదింటనే నేడింట నేని యథా కామంబుగ విస్తృతం బైన యినసభంబు శిరోగృహ యుక్త ముగ నిర్మించి యెల్లగదుల సోరణగండ్లు నిలిపి ప్రక్కగదుల కంటె ద్విగుణ వైశాల్యంబు మధ్య భవనంబుల కేర్పఱుచు నది. మధ్యమకోష్ఠంబు నౌన్నత్యము విస్తరముకంటెఁ బంచ మాంశాధికముగను పార్శ్వగతంబులకు విస్తారసమంబుగనే మీఁదటియఱ్ఱె నొనర్పవలయు. వానిపై మిద్దెయేఁ గప్పె నొనర్చి మధ్యమము నేకభూమికమును పార్శ్వగతంబుల ద్విభూమికములఁగనుఁ గావింపవలయు. అయ్యది స్తంభము లచే నేర్పడి చతుర్మార్గంబై జలయంత్రయుతంబై సుస్వర యంత్రంబుల వాతప్రేరక యంత్రంబులఁ గాలప్రబోధక యంత్రముల స్వాదర్శంబులఁ బ్రతిమలఁ గలిగి కార్యాలోచ నంబునకుం దగినదిగ నుండవలయు. అట్లమాత్యులకు లేఖ కులకు నితర యుద్యోగులకుఁ గార్యస్థానంబులు వేర్వేఱ రాణివాసంబునకు శతహస్తదూరంబు వదలి తూర్పున నే నుత్తరదిశ నేని కల్పింపవలయు. రాజనివాసంబునకు ద్విశత కర దూరంబున బలిష్ఠం బైన శాలలను సేనానివేశంబునకుఁ గట్టించి శ్రేష్ఠజాతిక్రమంబునఁ బ్రజానిలయంబులు స్వనివా సంబునకు నాల్గు దిక్కులం గట్టించునది. పురంబునం బ్రకృ తులకు నధికృతులకు సేనాధిపతులకుఁ బదాతులకు సాదు లకు మావటీలకు బృహన్నళిక యంత్రంబులకు స్వగాల్మిక బలమ్ములకుఁ బిమ్మట నారణ్యకసేనకుఁ గ్రమముగ నిండ్లు గట్టింపవలయు; మఱియు సజాతీయగృహంబుల వరుసఁగఁగట్టిం

చునది. సుజలాశయములై సుగుప్తమ్ములైన పాంథశాలల నట
నట నిర్మింపఁదగు. పురమందైన గ్రామమందైన నివేశనంబు
తూర్పు కేని యుత్తరమునకే నభిముఖంబుగ నుండవలయు.
బజారున రాచతెరువున కిరుప్రక్కల ధనికగృహంబుల నిలిపి
యొక్కొక్క తెగ యంగళ్ళ నొక్కొక్క నెలవున నిలుప
వలయు. ఇట్లు పురంబేని గ్రామంబేని సృజియించి రాజ
మందిరంబు నలువలఁకుల రాజమార్గంబుల నుంపవలయు.
ముప్పదిచేతుల వైశాల్యంబు గల రాజమార్గం బుత్తమంబు.
వింశతికరమితంబు మధ్యమంబు. పంచదశశయమానం బధ
మంబు. త్రికరాత్మికపద్య యనియుఁ బంచకరప్రమాణవీథి
యనియు, దశకరవిస్తీర్ణము మార్గమనియుఁ జెప్పఁబడు. పుర
మధ్యంబునుండి ప్రాక్పశ్చిమగాములు నుదగ్దక్షిణాభిముఖం
బులు నగు మార్గంబుల దాని కొలఁదికిం దగినన్నిటి నృపుఁ
డేర్పఱుపవలయు. పద్యయు వీథియు నగరియందుఁ గూడవు.
ఆఱుయోజనముల యరణ్యంబున నుత్తమ రాజమార్గంబును
సాధారణముగ దాని నడుమ మధ్యమమార్గంబును దన్మధ్యం
బున నధమపుఁ ద్రోవయు నుండవలయు. గ్రామంబులం దెల్ల
దశకరాత్మకంబు లైన మార్గంబులు ప్రశస్తంబులు. మార్గ
భూమిన్ గ్రామసేవకులచేఁ గూర్మపృష్ఠ సదృశంబుగ సేతువు
గావించి దాని యిరుఁగెలఁకుల జలనిర్గమార్గంబు కాల్వలఁ
ద్రవ్వించి యుభయపార్శ్వ గేహంబులను మార్గాభిముఖం
బుగ ద్వారంబుల నేర్పఱిచి గృహంబులకు వెనుకటిదెస నొక
వీథియు దానికి సమీపంబున మలనిర్మోచనస్థానంబులు నేర్ప
ఱిచి మార్గభూమి కేఁటేఁట సుధాశర్కరల సంఘటించుచు

ననుదినంబు తన్మార్జనంబునకు నూరి కొలువుడుకాండ్రనేని బందులనేని రాజు నియోగింపవలయు.

### పాంథశాల

స్వదేశమం దెల్ల రెండు గ్రామంబులకు మధ్యంబునఁ బాంథశాలలు వేయించి దానిని గ్రామాధికారులు శుభ్ర పఱిచి రక్షించునట్లు చేసి యచటి యధికారి వచ్చు తెరువరులనెల్ల నెక్కారణంబున నెకడనుండి యెక్కడకుఁ బోయెదరు, సత్యంబు చెప్పుఁ డని వారి జాతినామంబులఁ బరికించి శస్త్రవాహనంబులు శోధించి యభిజననివాసంబుల నెఱిఁగి వ్రాయుచు సాయంసమయంబున వారిశస్త్రంబులఁ బుచ్చుకొని సావధానులరై నిద్రింపుఁ డని యాజ్ఞయిచ్చి వారి లెక్కించి శాలలోనికిం బంచి ద్వారంబు మూసి ప్రతీహారుల వలన దాని రక్షించుచు వేకువ న్మేల్కొలిపి యాయుధంబుల నిచ్చి సీమాంతంబుదనుక గ్రామ్యజనసహాయంబు నొసఁగి వారి ననుపుచుండు నట్లేర్పఱచునది.

### రాజుదినచర్య

రాజు రాజధాని న్వసియించుచుఁ బశ్చిమయామంబున నిద్రనుండి లేచి ముహూర్తద్వితయంబున నియతాయవ్యయంబులనుఁ గోశభూతద్రవ్యంబున వెచ్చింపఁబడినదానిని బ్రత్యక్షంబునను లేఖలవలనను దెలిసికొని నాఁటివెచ్చంబునకుం దగినద్రవ్యంబు గోశంబునుండి పుచ్చుకొని తక్కటిదానిం బదిలంబుచేసి యొక్క ముహూర్తంబున వేగ నిర్మోక్షంబును, స్నానంబును గావించి సంధ్యాదాన పురాణశ్రవణంబులకు రెండు ముహూర్తంబుల కాలంబు నినియోగించి గజాశ్వాదియాన

వ్యాయామంబున రెండుగడియలు గడపి యొక్కముహూర్తం బునఁ బారితోషికంబుల నిచ్చి వస్త్ర ధాన్య స్వర్ణ రత్న సేనల యాయవ్యయ లేఖన పరీక్షణమునఁ బ్రహారంబుగడిపి సుహృద్బంధు సమేతుఁడయి ఘటికాద్వయము సుఖము భుజియించి బాల వృద్ధ నవీన సందర్శనంబున నొక్క ముహూర్తంబు పుచ్చి రెండుముహూర్తంబులఁ బ్రాడ్వివాకాదిబోధిత వ్యవహారుండై ముహూర్తద్వయమున మృగయాక్రీడనంబుగావించి ముహూర్తమాత్రంబు వ్యూహాభ్యాసంబుచేసి పిమ్మట నొక్కముహూర్తంబు సంధ్యోపాసన తత్పరుండై భోజనమున కొక్కముహూర్తంబు వెచ్చించి వేగులవారివార్తల రెండుముహూర్తముల వినుచుఁ ద్రియామ నెన్మిదిముహూర్తంబుల నిద్రించుచుండ వలెను. ఇట్లహోరాత్రములు ముప్పదిముహూర్తములచే విభజించి విహరించుతేనికి సుఖము మిక్కుటముగఁ గలుగు. వ్యర్థంబుగఁ గాలక్షేపము సేయఁ జనదు. మఱియు; స్త్రీమద్యపానాదుల గాలంబుపుచ్చక యెక్కాలమున నెద్ది కర్తవ్యం బక్కాలమున నది యశంకితుఁడై శీఘ్రంబునఁ జేయవలయు.

కాలవృష్టి సస్యాభివృద్ధికి నకాలవృష్టి తన్నాశంబునకుం గారణం బగునట్లు సమయోచితకార్యాచరణంబు రాజాభివృద్ధికిఁ దదనుచితకార్యాచరణంబు నృపవినాశంబునకుం గారణంబగు.

రాజాలెకులకుఁ జేయు నేర్పాటు

ఎల్ల కార్యస్థానంబుల నాయుధపాణులైన యాలెకులచే రాత్రియంతయు సురక్షితంబులం గావించుచు వానియందనుదినంబు జరుగుకార్యంబులు లేఖకాధిపముఖంబున విను

చు యామికులం బ్రతిదినంబుం బరివర్తించునది. యామిక స్థానంబు గృహపఙ్క్తి కభిముఖంబుగ నొనరించి యాయిండ్ల యందలి భృతిమంతులచే గేస్తులచేఁ దద్వృత్తాంతంబు నర యుచుండవలయు. రాజధానిం గ్రొత్తవారు ప్రవేశించునపుడు పౌరులు గ్రామాంతరము పోవునపుడునుఁ బ్రఖ్యాతవృత్తశీలురం దక్కఁ బ్రతిభువులఁ బుచ్చికొనక విడువవలదు. ఎల్ల నిశలఁ బ్రతియామంబుఁ గొంద ఱారక్షకు లన్నివీథుల జార చోరనివృత్తికొఱకుఁ బర్యటించుచుండున ట్లాజ్ఞయీవలయు.

రాజవశ్యము చేయవలసిన శాసనములు

మఱియు సకలప్రజలను, నూడిగపువానియం దేని కొలువుకానియం దేని పెండ్లమునం దేని కొమరునం దేని నా నేల నున్నవారు వాగ్దండపారుష్యములు సేయఁజన దనియుఁ దుల యందు మానపాత్రములయందు నాణకములయందు నిర్యాస ములయందు ధాతుపదార్థములయందు మధుదుగ్ధఘృతాదుల యందుఁ గూటంబు సేయవలదనియు నుత్కోచగ్రహణం బును స్వామికార్యవిలోభనంబును దగదనియు దుష్కర్ముని జోరుని జారుని మద్ద్వేషిని నప్రకాశంబుగ రక్షింపవలదని యును బితృపూజ్యవిద్వత్సద్వృత్తశాలులకు నవమానం బొండె నుపహాసంబు నొండె గావించిన శిక్షింతు ననియు దంపతులకు స్వామిభృత్యులకు భ్రాతలకు గురుశిష్యులకుఁ బితృపుత్రులకుఁ బైశున్యంబున భేదంబు పుట్టింపఁజనదనియు మార్గంబుల వాపీ కూపా రామ ధర్మశాలా దేవాలయంబుల నిరోధంబు వలదనియు హీనాంగుల నుపహసింపవలదనియు ద్యూతమద్య సంధాన మృగయా శస్త్ర సంధారణంబులును

గో గ జాశ్వ మహిషీ నృ స్థావర రజత స్వర్ణ మాదక ద్రవ్యం
బుల క్రయ విక్రయంబులును క్రయ దాన ఋణ నిర్ణయ
పత్రంబులును వెజ్జటికంబు మహాపాపాభిశమనంబును నిధి
గ్రహణంబును నవీన సమాజ నిర్ణయంబును జాతిదూషణం
బును బ్రహ్మణగ్రహణంబును రాజాజ్ఞనొందక కావింప
రాదనియు రాజుల దుర్గుణంబుల దాఁపకుండునది యనియు
స్వధర్మ పరిత్యాగంబు ననృతంబు పరదారాభిమర్శనంబు
కూటసాక్ష్యంబుఁ గూటలేఖ్యంబు నిర్ధారితకరాధిక్యంబు
స్తేయసాహసంబు మనంబుననేని చింతింపవలదనియు శాసింప
వలయు. భృతియందు శుల్కంబునందు నరియందు దర్పబల
చ్ఛలంబుల నాధర్షణం బేరికేని కావింపవలదనియు నెల్ల
జనుల గుణసంపన్నులరై మనుండనియు నాతతాయిని గ్రహించి
సాహసాధిపతి కొప్పగింపుఁడనియు నాజ్ఞాపింపవలయు. రాజ
న్మానంబుల నెల్ల స్వముద్రా ముద్రితంబులఁ జేయుచు వృషో
త్సర్జనంబు నేరేని గావించిన నా వృషంబుల సుమంత్రితం
బులఁ జేసి వార రక్షింప వలయుననియు, నా శాసనంబు విని
పాటింపని పాపకారుల మహాదండంబున శిక్షింతు ననియు
నప్పుడప్పుడు శాసన డిండిమంబులం బ్రజల బోధించుచు శాస
నంబులు వ్రాయించి చదుకంబునం గట్టించునది. శత్రులందు
దుష్టులందు నెల్లకాలంబు నుద్యతదండుం డై నీతిపురస్సరం
బుగ నెల్లవారిం బాలించుచుఁ బాంథ బాధకుల శిక్షిం
చుచుఁ గార్పటిక సుఖంబుకొఱకు మార్గ సంరక్షణంబు తప్పక
చేయుచుండవలయు.

### రాజు లాదాయము నెట్లు వ్యయము చేయవలయు

పుడమిచేఁ డేఁటేఁటఁ దనయాయంబు పండ్రెండు పాళ్లు చేసి యందు మూఁట దండును గాపాడుచు నొక్కయఱపాలు చాగంబున వెచ్చించుచు సాఁబాలిచేఁ బౌరుల నరయుచు సంగో రున నధికారుల జీతంబు లిచ్చుచు సాము నాత్మసుఖోప భోగంబుల వినియోగించుచు నొక్కపాల గ్రామాధికారుల జీతంబు లిచ్చుచు మిగిలిన యాఱుపాళ్లఁ గోశంబు పెంచు చుండవలయు. మీఁదిధర్మంబు లన్నియు సామంతాదు లకుఁ గాని తక్కువరాజులకుఁ గావు. అట్టిరాజు రాజ్యకీర్తి ధనగుణంబులయందుఁ బ్రాప్తంబుల రక్షించుచు నప్రాప్తంబు లకు సుప్రయత్నుఁడు గావలయు. పాండిత్యంబు శౌర్యంబు వక్తృత్వంబు దాతృత్వంబు బలపరాక్రమోత్థానంబులు నొకప్పుడేని యేమఱ కుండవలయు. పరాక్రమోత్సాహ సంపన్నుండై స్వకార్యమున నేని స్వామికార్యమున నేని యనీ కంబునఁ బ్రాణభయంబుఁ దొలఁగి మార్తుర మార్కొను వాఁడు శూరుండు. పక్షపాతంబు విడిచి బాలుండు పలికినను సుభాషితంబు గ్రహించి ధర్మతత్త్వంబు విమర్శించు రాజు పండితుఁడు. దోషంబులు గుణతుల్యంబు లని స్తుతియింపక సమక్షంబున నవిశంకితుఁడై వక్కాణించువాఁడు వక్త. పాత్రుల కీరాని పదార్థం బొక్కండు లేదని యెద్దియే నీ సాహసించువాఁడు దాత. దేనఁ గార్యం బవి శంకితుఁ డయి చేయంజాలునది బలంబు. ఎద్దాన విమతనృపతులు కింకరు లగుదు రది పరాక్రమంబు. యుద్ధానుకూల వ్యాపారం బుత్థానంబు. భోజనవేళ విషదోషభయంబున నన్నంబు కపి

కుక్కుటాదులచేఁ బరీక్షించునది. హంసలు విషాన్న దర్శనంబునఁ దడఁబడు. భృంగంబులు కూజితంబు సేయు. మయూరంబులు నృత్యమాడు. క్రౌంచంబు మత్తిల్లు. కుక్కుటంబు విరావంబు గావించు. కపి రేచనంబు గావించు. బభ్రువు పులకోద్గమంబు గావించు. శారిక యుద్వమించు. ఇట్టి వికారంబులు సూచుచు షడ్రసంబు నహీనంబు ననతిరిక్తంబు నగు భోజనంబు గావింపవలయుఁ గాని యేకద్విత్రి రససంకులంబు భుజియింపఁ జనదు. అతి కటు మధుర క్షార సంకులంబును వలదు. ఎవ్వఁ డేకార్యము మనవి యొనర్చిన నమాత్యాదులతోఁ గలిసి యప్రమత్తుండై వినవలయు.

ప్రకృతి నటగాయకమాగధైంద్రజాలికులతోడను స్త్రీలతోడను నొక్కొక్కయవసరంబున నారామాదుల వాహ్యాళి సలుపవచ్చు. గజాశ్వరథారోహణాభ్యాసంబు ప్రాతస్సాయంసమయంబుల ననుకూలంబై యుండు. సైనికులకు వ్యూహంబులఁ దా నేర్చుచు నేర్పించుచుండవలయు. దుష్టసత్త్వనిపాతనంబు సేయుచు వ్యాఘ్రాదిమృగంబుల మయూరాద్యండజంబులఁ గ్రీడింపించుచు నాఖేటనంబు గావింపవలయు. మృగవ్యంబున శౌర్యాభివృద్ధియు లక్ష్యసంధానంబు నకాతరత్వంబును శస్త్రాస్త్ర శీఘ్రపాతనంబును నను గుణంబులును మహాత్తరంబైన హింసాదోషంబును గలవు.

### రాజచారసంభావనాదికము

ప్రజలయు నధికృతులయుఁ బ్రకృతులయుఁ శత్రు సైనిక సదస్య బాంధవ శుద్ధాంతంబులయు నింగితచేష్టల జతనంబున నెఱుఁగుచు గూఢచారులవలన నిశీథంబున సావ

ధానచిత్తుఁ డయి యవధరించుచు నాత్యాయిక విషయంబుల సిద్ధశస్త్రాస్త్రుండై లిఖియించునది. అసత్యవాదియైన ప్రణిధిని శిక్షింపనిరాజు జనప్రాణ ధనాపహులుం డైన మ్లేచ్ఛుఁ డనఁ బడు. వర్ణియుఁ దపసియు సన్న్యాసియు సిద్ధస్వరూపియు నగు చరుని ఛలంబునం బ్రత్యక్షంబునం బరికింపవలయు. వానిని శోధింపక నిజంబు తెలియఁజాలఁడు. అపరిశోధకుఁడైన రాజువలన స్పశుఁ డనృతవాదంబున భయపడఁడు. చారునిఁ బ్రకృతులవలన నుద్యోగులవలన రక్షించుచుండవలయు.

రాజ్యం బెట్టిదిగావలయు – రాజు దాయాదులపట్ల నెట్లుండవలయు

రాష్ట్రం బేకనాయకంబు గావలయుఁ గాని బహు నాయకంబు ననాయకంబు గా వలవదు. రాచకొలంబునఁ బురుషులు పెక్కం డ్రున్న జ్యేష్ఠుఁడు రాజును దక్కినవారలు తత్కార్య సాధకులుం గావలయు. వా రితర సహాయులకంటె గరీయసులు. వరిష్ఠుం డాంధ్య కుష్ఠ బాధిర్యాది బాధితుం డయ్యేనేనియు షండుఁడు మూఁకుఁడు నయ్యేనేనియు నతఁడు రాజ్యార్హుండు గాఁడు. వానిపుత్రు డొండె రాజు సోదరుఁ డొండె నన్నకొడు కొండె రాజు చిన్నకొడు కొండె దానికిం దగు. ఇట్లగ్రజుఁడు లేనపుడు కనిష్ఠులు రాజ్యార్హులు. దాయాదైకమత్యంబు రాజునకు మిగుల శ్రేయస్కరంబు; తత్పార్థక్యంబు రాజ్యమ్మునకుం గులంబునకు వినాశకంబు. కావున నేలిక జ్ఞాతుల స్వసదృశభోగులం జేయవలయు. విభాగంబున రాజ్యం బల్పిష్ఠం బయ్యేనేని శత్రువులు గ్రహింప నిచ్ఛయింతురు గాన నద్దాని విభజింపం జనదు. దాయల రాజ్యచతుర్థాంశ దానంబున నేని మహోద్యోగంబున నేని

నల్లడల నుండం బనుపవలయు. గో గ జాశ్వ ఖరోష్ట్రకోశం బుల యాధిపత్యంబున నేని వారి నియోగించునది. బానసం బునఁ దల్లినైన నట్టి సాధ్వి నితరనైన నియోగించి బంధువగు శ్యాలుని సేనాధికారంబున నిలిపి సుహృదుల న్గురుల నాత్మ దోషంబుల నెఱిఁగి తెల్పుఁ డని వేఁడుచు వస్త్రాలఙ్కార పాత్రరక్షణంబున స్త్రీల నియమించి యన్నింటిం గ్రమం బునఁ దాన పరిశీలించికొను చుండవలయు.

రాజు కార్యముల నెపుడాలోచింపవలయు నేరితోఁ జేయవలయు

కార్యాలోచనంబు నడికిరే యంతర్గృహంబున నేని దివాభాగంబున శోధితనిర్జనారణ్యంబున నేని మంత్రులతోఁ గూడి కావింపవలయు. ఱేఁడు నెయ్యురతోడను దమ్ముల తోడను గొమరులతోడం జుట్టమ్ములతోడ దళవాయులతోడ సభ్యులతోడం గూడి రాచకర్జంబు కొలువుకూటంబున విచా రింపవలయు. సభామధ్యంబున సింగంబుగద్దియ నమర్చి దానఁ దాను గూర్చుండి తక్కటివారల న్నలుదెసల నిలుపవలయు. కొమరులు, మనుమలు, సోదరులు, భాగినేయులు, వెనుకటి దెసను గూఁతురు కొడుకులు దక్కినంపుదెసను, దండ్రితోఁ బుట్టువులు శ్రేష్ఠులైనస్వవంశ్యులు సభ్యులు సేనానులు దన మొదుటను నెడమప్రక్కను మామలు మఱఁదులు, మాతా మహుని వంశంబువారు, మంత్రులు, బాంధవులు, నధికారులు నుండవలయు. తనకు సరియైన చెలికాఁడు దగ్గఱ నైనఁ దన యాసనార్ధభాగంబున నైన నుండవలయును. జామాతను భగినీ పతిని వామదక్షిణ పార్శ్వంబుల నిల్పునది. శ్రేష్ఠాసనంబున నున్నయార్యుండు దండ్రియొజఁ బూజ్యుండు. లేఖరు లెల్లరు

మంత్రికిం బృష్ఠపార్శ్వాగ్రభాగంబుల నుండవలయు. పరిచారకులందఱకు న్వెనుకటిదిక్కున నిలుచునది. ప్రవేశనతిబోధకులైన స్వర్ణవేత్రహస్తులు పార్శ్వంబున నిలువవలయు.

రాజు ముకుటము ధరియించి వస్త్రమాల్యసుభూషణభూషితుండై మైమఱువుదొడిగి విశిష్టచిహ్నయుతుండై, సావధానుండు, సిద్ధాస్త్రుండు నగ్నశస్త్రుండు నై సభకు రావలయు. "సర్వస్మాదధికో దాతా శూర స్త్వం ధార్మికో హ్యసి" యను వంచకు లగు స్తుతిపాఠకుల వాక్యముల ననాదరుండు గావలెను. ఎద్దియే నొక్కకార్యంబు గావింప రా జభిలషించిన మంత్రులు రాగలోభభయముల మూఁగలువ్రాలె దాని గుణదోషంబులు వక్కాణింపక యూరకుందురు. తావన్మాత్రమున నది వారికి సమ్మతం బని తలంపక వేర్వేఱ వారియభిమతము హేతుయుక్తముగ వ్రాయించి బహుసమ్మతం బైనకార్యము గావించుచు నితరము పరిత్యజించుచుండవలయు. ప్రతిదినము భృత్యదాసరథాశ్వగజములయందుఁ గార్యక్షమముల నరయుచుఁ గడుజీర్ణంబులఁ దొలఁగించుచుండవలయు. రాజు నూఱుక్రోసులదూరమునఁ బుట్టిన వార్తనేని యొక్కదినమునఁ దెప్పించుచుఁ గొందఱకు జీవితం బొసఁగి విద్యలం గళలు నేర్పించుచు నేర్చిన వారిం దగిన యుద్యోగముల నిల్పుచు విద్వాంసులం గళాభిజ్ఞుల నేఁటేఁట సత్కరించుచుఁ దనదేశంబున విద్యాభివృద్ధియుఁ గలాభివృద్ధియు నగునట్లు ప్రయత్నించుచుండవలయు. మఱియుఁ దాను గజారూఢుండై ముందును వెనుకను మిక్కిలి నీతివిశారదులును క్రూరవేషధారులును నగ్నశస్త్రులు నగుభటుల న్నాతిదూరమున నిలిపి

ప్రజారంజకుండై యుత్తము లగు ప్రధానులతోడను దనకుం దుల్యులగు బంధుమిత్రులతోడను బురమున సంచరించు చుండవలయు. రాజయానారూఢుం డెట్టివాఁడేని సంభావనార్హుండ కావున నొకప్పుడేని నీచజనులతో నేగఁజనదు. నీచులగువారు సాధువులకంటె మార్దవంబునఁ గాన్పింత్రు గాని నీచుల సాధువుల మిథ్యోపచారంబుల సత్యోపచారంబుల నెఱుఁగవలయు.

రాజు లేఁటేఁట స్వదేశమునఁ జరించి చేయవలసిన పని

గ్రామంబులం బురముల దేశములఁ బ్రతివత్సరంబు సంచరించుచు నధికారులవలన రంజితులుఁ బీడితులు నగు ప్రజల వ్యవహారంబుల సత్యంబు పరికించి సేవకపక్షపాతంబు విడిచి జనులపక్షం బవలంబించి పెక్కండ్రు జనులతో విరోధించిన యుద్యోగిం దొలఁగించుచు మంత్రి నేనొక్కమా అన్యాయ గామిని రాజు రహస్యంబున దండించుచుఁ బెక్కుమాఱు లట్లయినఁ బరిత్యజింపవలయును. అన్యాయవర్తు లయినవారి రాజ్యంబును సర్వస్వంబు నపహరించుచుఁ బరాజితుల దేశంబున ధర్మాధికరణంబు నిలిపి నిర్జితులకు వారిచరితంబు ననుసరించి భృతి నొసఁగుచుండవలయు. సురూపయు సుసంశుద్ధయుఁ బ్రియవాదినియు సుభాషయు స్వానురక్తయు నగు పత్నిం బరిగ్రహింపవలయును. రెండుజాములు నిద్రించువానికి సుఖాధిక్యంబు గలుగుఁగాన నట్లొనరింపవలయును. రాజులుఁ గేశంబులు నఖంబులు దంతంబులు స్థానభ్రంశంబున శోభింపమిని స్త్రీలుఁ బండితులుఁ బ్రభువులు స్థలతలు నిరాశ్రయంబునఁ గార్యసాఫల్యంబు నొందమిని రాజు స్వర్గ

నివాసంబు పరిత్యజింపకయే నీతిచే శత్రుల జయించుచు నాపత్కాలంబున గిరిదుర్గంబు లాశ్రయించి తదాశ్రయంబున దస్యువృత్తిచేనైన స్వరాజ్యంబు మరల హరియింపవలయు. ఎవ్వండు కులకన్యాదూషణంబు గావింపక పరదారవై ముఖ్యంబు నొంది యసజ్జనుల ధనంబుల హరియించుచు నెల్లప్పు డొక్కచో వసియింపక యెట్టివారినేని నమ్మక ప్రాణ నాశమ్ము గణియింపక సర్వకాలంబు సావధానుండై స్వకర్మంబున నిర్ఘృణుండై సదోద్యుక్తుం డగు వాండు దస్యువు నాంబడు. పుత్రులుం బోలెం బాలితు లగుభృత్యులు పగవారైనను మహాప్రయత్నంబునం జేసిన కర్జంబు నిష్ఫలం బైనను దనప్రయత్నలోపం బని యెంచక భాగధేయం బంతియ యని నిశ్చయించి తపంబున కేగవలయు.

సంక్షేపంబున రాజకృత్యం బిందుం జెప్పంబడియె. మిశ్రంబున నింకను జెప్పంబడు. ఇది శుక్రనీతిసారంబున రాజకృత్య ప్రకరణం బను ప్రథమాధ్యాయము

—

శ్రీ ర స్తు

# శుక్రనీతిసారము

## ద్వితీయాధ్యాయము

రాజు సేవకుల నవశ్యము గ్రహింపవలెను

శ్రీకరం బగు కార్యం బల్పంబైన నేకాకిచే సుసాధంబు గాదన మహత్తరంబైన రాజ్యం బసహాయునిచే దుష్కరంబని చెప్పనేల? ప్రభువు సద్విద్యాకుశలుఁ డయ్యు మంత్రవిదుఁడయ్యుఁ బ్రధానుల విడిచి యొక్కఁడు నర్థచింత సేయందగదు. స్వతంత్రుఁడైన ప్రభువున కనర్థంబు లవశ్యంబు గలుగుఁగాన ప్రాజ్ఞుఁడైన రాజు సభ్యాధికారి ప్రకృతులతో నాలోచించి వారికి సమ్మతంబైన కార్యంబు సేయఁజనుఁగాని యొకప్పుడేని స్వాభిప్రాయానుసారంబుగఁ బ్రవర్తింపఁ జనదు. అట్లయిన రాష్ట్రజనులు నమాత్యాదులు ననురక్తులగుదురు. ప్రతిపురుషంబును బుద్ధివైభవంబు భిన్నంబుగఁ గాన్పించుటను నాప్తవాక్యంబున ననుమానంబున నాగమంబున సాదృశ్యంబునఁ బ్రత్యక్షంబున ఛలంబున బలంబున వ్యవహారనిర్వాహంబు భిన్నంబగుటను నివి యన్నియు నొక్కమానిసిచేఁ దెలియ నశక్యం బగుటను గులీనులు సుశీలురు శూరులు హితోపదేశకులుఁ గ్లేశసహులు ధర్మాసక్తులు కామక్రోధాదివర్జితులు ననలసులు ననసూయులునుఁ గుమార్గగా

మిదైనఁ దన్నును సన్మార్గంబునకుం ద్రిప్పందగినవారు శుచు
లునయిన సహాయుల రా జవశ్యంబు వరియింపవలయు.
కుకర్మంబునను గుసహాయంబునను రాజు తప్పక రాజ్యభ్రష్టుం
డగు. మున్ను బలాధికు లయ్యు దైత్యులు కుకర్మంబునను
దుర్యోధనాదులు గుసహాయంబున న్నాశంబు నొందిరి.
కావునఁ బార్థివుండు సుసహాయుండు సుచారిత్రుండుఁ గావ
లయు. యువరాజునమాత్యగణంబును భూపతికి దక్షిణవామ
భుజంబులు నయనంబులుఁ గర్ణంబులు గాన వారిసహాయంబు
నొందని రాజు భుజాద్యవయవంబులు లేనివాఁడు వోలె నిరర్థ
కుం డగు.

### యువరాజు గాఁదగినవారు

ఔరసుఁడగు రాజన్యుఁడు, కనిష్ఠసోదరుఁడు, పితృ
వ్యుఁడు, భ్రాతృపుత్త్రుఁడుఁ, దత్తుఁడు, దౌహిత్త్రుఁడు, మేన
ల్లుఁడుఁ గ్రమమ్మున యౌవరాజ్యార్హులు. ఇం దెవ్వని నేని
యువరాజు నేర్పఱిచి ముద్రాధికారంబునఁ గాక తక్కిన రాజ
కార్యంబులం దెల్ల నియోగించునది. స్వహితం బపేక్షించి
యెన్నఁడు న్వారి బాధింపఁ జనదు.

### యువరాజును రక్షించు విధము

మఱియు వారి స్వధర్మనిరతుల శూరుల భక్తుల
నీతిమంతులఁ గావించి సుఖంబులఁ దనుపుచు సుయత్నంబున
రక్షింపవలయు. వా రరక్షితులైన నర్థలోభంబున హిం
సింతురు. మదోద్వృత్తులైన రాజపుత్త్రులు రక్ష్య
మాణు లయ్యు ఛిద్రంబుల సింగంపుఁగొదమలు ద్వీపంబుం
బోలె జనకునేని సోదరు నేని హింసింతురు. మోఱకును

బాలుండును గూడ స్వామ్యం బభిలషింతురు; యువం జెప్ప నేల? రాజు నిపుణు లగు భృత్యులచేతనుఁ దానును గైతవంబున వారి యభిప్రాయంబును దెలియుచుఁ దన సన్నిధిన వారి నెప్పుడు రక్షించుచు నమాత్యులు మొదలగు వారిచే నీతికు శలులను ధనుర్వేదవిదులను శూరులఁ యుద్ధరతులన్ సుశిక్షి తులఁ జేయుచు వస్త్రభూషణాదుల నలంకరించుచుఁ గ్రీడనం బుల లాలించుచు నాసనాదుల నర్చించుచు సుభోజనా దులఁ బాలించుచు నర్హకాలంబున యౌవరాజ్యంబున నభిషే కింపవలయు. అవినీతకుమారంబైన కులంబు నశించుఁ గాన క్రమంబునఁ గుమారుల శిక్షించుచుండవలయు. సుదుర్వృత్తుం డైన రాచకొమరుఁడు క్లిశ్యమానుండగుచుఁ బరాశ్రయంబున రాజునకు హాని గావింపనోపుఁ గానఁ బరిత్యాగార్హుండు గాఁడు. కుమారుండు దుర్వ్యసనాసక్తుం డగునేని నొప్పించుచు నుద్వృత్తుండైన దుష్టగజంబుంబోలె సుఖబద్ధుం గావించుచు మిగులఁ జెడునడతగల దాయల నెక్కుడు జతనంబున వేఁగులచేఁ బగఱచే ఛలంబున హింసించుచుఁ బ్రజకుఁ దనకు నభివృద్ధి యగునట్లు నృపుఁడు జాగరూకుఁడై మెలఁగవలయు. వేఱొక లాగున నయ్యేనేని వారు ప్రజకు రాజునకు బాధకులగుదురు. జ్ఞాతులు స్వసద్గుణంబుల రాజునకు నిచ్చలు ముదంబు గావింపనినాఁడు తను భాగంబునకు జీవితంబునకు దూరు లగుదురు. స్వకులంబున జన్మింపని దత్తాదులు ధనాపేక్షఁ దన్నుఁ బ్రేమింత్రు గాన మనంబున నేని వారిని బంధులని యెన్నఁదగదు. పిండదానంబునఁ బుత్త్ర దౌహిత్త్రులకు విశే షంబు లేమిని గన్యక పుత్త్రుండుబోలె స్వోత్పన్న యగు

టను బుత్రికాపుత్రుండు దత్తాదులకంటె నధికుఁడు. సధనుఁ డయ్యేనేని రాజు దత్తునిఁ గేవల ప్రజాపాలనార్థంబు రక్షింప వలయు. మనుజుఁ డన్యోత్పన్నునియందుఁ బుత్రత్వంబుఁ గల్పించుకొని ధ్యాన యోగాదులకు వెచ్చింపక సుఖోప భోగంబులకు వినియోగింపక సర్వస్వంబు వాని కొప్ప గించుటకంటె నచ్చెరువు గలదే?

### యువరాజు చేయవలయుపనులు

యువరాజభిషేకంబు నొంది స్వసంపన్మదంబున వికారంబు చెంది తల్లిదండ్రులకు భ్రాతలకు భగినికి రాజపురుషులకు గురువులకు రాష్ట్రంబు నందలి మహాజనులకు నవమానం బొండెఁ బీడనం బొండెఁ గావింపకుండునది. జాతిబాహ్యులు రాజదర్శనం బపేక్షించిన మహాజనులు సమ్మతింపరు గావున వారికది సంఘటింప కుండునది. కొమరులకుఁ బిత్రాజ్ఞాపాలనంబు భూషణంబు గావున మహాసమృద్ధి నందియు వారి మాట జవదాఁటక వర్తింపవలయు. తొల్లి భార్గవరాముండు శాపానుగ్రహసమర్థుం డైన జనకు నాన జననిహింసించె ననియు శ్రీరాముఁడు రాజ్యత్యాగంబుఁ జేసి వనంబునకుఁ జనియె ననియు వారు పితృతప స్సామర్థ్యంబునఁ దల్లిని రాజ్యంబును మరల సంపాదించి రనియు నెల్లరకుం దెల్లంబ. మున్ను దుర్యోధనుండు భాగార్హభ్రాతల నవమానించి పాలిసెఁ గాన రాజపుత్రుఁ డెన్నఁడును సోదరులయెడఁ దన యాధిక్యంబుఁ బ్రకటింపఁదగదు. తండ్రిచే నుత్తమపదంబున నభిషిక్తులయ్యుఁ దదాజ్ఞోల్లంఘనంబున రాజన్యులు విశ్వామిత్రపుత్రులుంబోలె యయాతిసుతులుంబోలెఁ బదభ్రష్టులై

దాసతుల్యు లగుదురు. యువరాజు వాక్యాయమానసంబులం దండ్రికిం బ్రియంబుసేయుచు నప్రియంబు విడుచుచుం బితృవిద్వేషిని ద్వేషించుచుం దత్సఖునితో మైత్రి సలుపుచు నతనికి సమ్మతంబు నవిరుద్ధంబు నగు కార్యంబు సేయుచు సూచకచారదోషంబునం దనయం దన్యాభిప్రాయంబు జనకునకుం గలిగిన మంత్రులయనుమతిని మంతనంబున నతనికి యథార్థంబు విన్నవించుచుం గపటంబునం బ్రకృతుల యభిప్రాయం బెఱుంగుచు వేగుఁబోకం దల్లికిం దండ్రికిం గురువునకు న్వందనంబు గావించి పూర్వదినంబునం గావించిన కార్యంబు రాజునకు మనవిచేయుచు విద్యచేతం, గర్మంబుచేత, శీలంబుచేతం బ్రజల రంజించుచు స్వజనావిరోధంబుగం బ్రవర్తించుచుం జాగంబున సత్యంబున నెల్లరం దనవశంబున నిల్పుచుండవలయు. ఇట్టి వృత్తంబు గల రాజపుత్త్రుండు శుక్లపక్షసుధాంశుండువోలె వర్ధిల్లి క్రమంబుగ నకంటకం బైన రాజ్యంబు నొంది యమాత్యులతో సుఖంబుగం జిరకాలంబు వసుంధర భుజియించు నని యువరాజలక్షణంబు సమాసంబునం జెప్పి శుక్రుం డమాత్యాదుల లక్షణంబు సెప్పందొడంగె.

### సుసేవకులయు దుస్సేవకులయు గుణములు

పరీక్షకులు మార్దవంబునను గౌరవంబునను వర్ణంబునను శబ్దాదులను సువర్ణంబు గరఁగి పరీక్షించునట్లు రాజు భృత్యునిం గర్మంబున సహవాసంబున గుణంబున శీలంబునం గులంబునం బరీక్షించి విశ్వాస్యుని విశ్వసింపవలయు. కర్మశీలగుణంబులు పూజ్యంబు లగునట్లు కేవల జాతికులంబు లేనాఁడును బూజ్యంబులు గావు. జాతికులంబుల వలన శ్రై

ష్యంబు రామి వివాహంబుల భోజనంబులం దక్క నుద్యో గంబులఁ గులజాతిపరీక్షణం బనావశ్యకంబు. సత్యవాదులు నభిజనవంతులు ధనికులు సద్వంశ్యులు సుశీలురు సత్కర్మనిర తులు స్వకార్యంబునందలి యత్నంబు కంటె రాజకార్యంబునఁ బెక్కుమడుఁగులు యత్నాధిక్యము గలవారు భృతిచే తన సంతసించువారును బరోపకారదక్షులు నపకారపరాఙ్ముఖులు రాజున కపరాధంబు గావించు పుత్త్రునేని తండ్రినేని రాజున కర్పించువారును సత్కార్యంబున నచిరక్రియులు ననలసులు నస త్కార్యంబునఁ జిరక్రియులు ప్రభు వన్యాయగామియైన దామట్టి వారు గాక ప్రబోధించువారు రాజునందు రాణివాసంబునందు రాజపుత్త్రునందు మిత్త్రులందు దోషంబులు దడవనివారు వారిని శ్లాఘింపనివారు నిందింపనివారు రాజదత్తం బైన వస్త్రమా ల్యాదులు నతనియెదుట ధరియించువారు నన్యాధికారంబుఁ గోరనివారు నాయంబునకుం దగిన వ్యయంబు గలవారు దయా ళురు శూరులు రాజు నకార్యంబు రహస్యంబున బోధించువారు నగు భృత్యులు ప్రశస్యులు. దండంబునం బీడితులు జీవి తంబు లేనివారు శఠులు కాతరులు నిచ్చకములాడువారు వ్యస నులు లంచంబునం దిచ్ఛగలవారు క్షూదరులు నాస్తికులు దాంభికులు ననృతవాదులు తోలుతఁ దమచే నవమానితులు పగఱకు న్మిత్త్రులు పూర్వవైరులు ధర్మహీనులు నైనవారు సుసేవకులు గా రని సంగ్రహంబున సదసద్భృత్యలక్షణంబు సెప్పి పురోహితాదుల లక్షణంబు సెప్పుచున్నాఁడు.

### పురోహితాదుల కుండవలసిన గుణములు

పురోధసుఁడు ప్రతినిధి ప్రధానుఁడు సచివుండు

మంత్రియుఁ బ్రాడ్వివాకుఁడు పండితుఁడు సుమంత్రుఁడు నమాత్యుఁడు దూతుండు నను పదుండ్రు రాజునకుం బ్రకృతులు. పూర్వాపూర్వం బుత్తరోత్తరున కధికుండు; కొందఱి మతంబునఁ బురోధసుని దూతను వదలి యెనమండ్ర ప్రకృతులని చెప్పంబడియె. ప్రకృతు లెనమండ్రకుం భృతియందుఁ దాల్యంబు వలయు. మంత్రానుష్ఠానసంపన్నుండు సాంగవేదవిదుఁడు ధనుర్వేదాధ్యాపకుఁడు జితేంద్రియుఁడు క్రోధలోభ మోహ వర్జితుఁడు నీతివిదుఁడు శస్త్రాస్త్రంబుల నేర్చినవాఁడు వ్యూహాభ్యాసకుశలుండు తనకోపంబున రాజునేని భీతుఁజేయ సమర్థుఁడు శాపానుగ్రహశక్తుండు నగువాఁడు పురోధసుఁడు (Family priest) గావలయు.

ఎవ్వరి నిరోధంబున రాజు వెఱచు నట్టివారు సత్ప్రకృతులు. రాజునకు వెఱపు పుట్టింపలేక ప్రజలను గోశంబును రాజన్యుని సుచరితంబును రాజ్యంబును వృద్ధినొందఁ జేయలేని ప్రకృతులవలనం బ్రయోజనంబు లేదు. కార్యాకార్యంబుల నెఱుఁగువాఁడు ప్రతినిధి. సర్వదర్శి ప్రధానుఁడు. సేనావిజ్ఞానంబు గలవాఁడు సచివుఁడు. నీతివిద్యాకుశలుండు మంత్రి. ధర్మతత్త్వజ్ఞుండు పండితుండు. లోకశాస్త్రనయజ్ఞుండు ప్రాడ్వివాకుండు. దేశగణనంబు నెఱిఁగినవాఁ డమాత్యుండు. ఆయవ్యయప్రవిజ్ఞాత సుమంత్రుఁడు. ఇంగితాకారంబులు దేశకాలంబులు నెఱిఁగి స్మృతిమంతుండై షాడ్గుణ్యంబు నధిగమించి వాగ్మియు వీతభయుండు నగువాఁడు దూత (Ambassador). రాజునకు నహితంబైన సమయోచితంబుగఁ గావింపనుహితంబైన నొకప్పుడు మాసను సమయాసమ

యంబుల నెఱిఁగి బోధించి కార్యంబులు చేయింపను మాన్పిఁ పను స్వాతంత్ర్యంబున నొకప్పుడు చేయను మానను సమర్థుఁ డగువాఁడు ప్రతినిధి (Vice-regent). రాచకర్జంబుల నెల్ల సత్యాసత్యంబుల నిరూపించి యందఱకుం గర్తవ్యాకర్తవ్యం బుల నిశ్చయించి చెప్పువాఁడు ప్రధానుఁడు. (Chief secretary) ఏనుఁగులలో గుఱ్ఱంబులలో రథంబులలో నొంటెలలో నెద్దు లలో నివి కార్యక్షమంబులు నివి కార్యాక్షమంబులు ననియు నివిమున్నిటివి యివి మనము గడించినవనియుఁ గాలరులలో, వాయిదంబుల గురుతులు బాసలసంకేతంబులు నొడ్డనంబులు నెఱిఁగినవారిలో, నూఁడిగపువారిలోఁ గార్యసమర్థు లిందఱు గలరనియు మఱెందఱు గావలయుననియు శస్త్రగోళకాగ్ని చూర్ణయుక్తంబైన సాంగ్రామికసంభారం బింత గలదనియు మఱింతకావలయుననియుఁ దెలిసి రాజునకుఁ దెలియఁజేయుచు సంఘటించుచుండువాఁడు సచివుఁడు (War-minister.) సామ దానభేదదండంబుల నెప్పు డెట్లెట్టివారియెడ నుపయో గింపవలయు నెట్లుపయోగింప నుత్తమాది ఫలంబులు గల్గునది నిశ్చయించి భూపతికి నివేదించువాఁడు మంత్రి. (Diplomatist.)

సాక్షులచే భోగంబులచేఁ బత్రంబులచే ఛలంబులచే మునుపటివ్యాపారంబులచే సంప్రాప్తంబులైన వ్యవహారంబుల విమర్శించుచు నేతగవుల మానుషంబులైన ప్రమాణంబు లుపయోగించు వేనియందు దివ్యసాధనంబులు గావలయు నది యుక్తులచేతను శాస్త్రజ్ఞానంబునను బ్రత్యక్షాదులను నిశ్చయించి బహుప్రమాణ సమ్మతం బైన దాని రాజు

నకు విన్నవించు న్యాయాధికారి ప్రాడ్వివాకుం డగు. (Chief-justice.)

సనాతనధర్మంబు లివియనియు వర్తమానాచారంబు లివియనియు శాస్త్రోపదిష్టంబు లివియనియు లోకవ్యవహార సిద్ధంబు లివియనియు నీధర్మంబు లిప్పటివారికి విరుద్ధంబు లనియు నీయాచరణంబులు లోకశాస్త్రవిరుద్ధంబు లనియు విచారించి యిహలోకంబున బరలోకంబున సుఖప్రదంబు లగువాని రాజునకు విజ్ఞాపించువాఁడు పండితుండు. (Learned adviser.) ఈవత్సరంబున నింతసొమ్ము సమకూడె నింతయధమర్ణులవలన రావలయు నింతవ్యయంబయ్యె నింతమిగిలినది దీన నింతస్థావరం బింత జంగమంబు నని యెఱిఁగి రాజునకు విదితంబు చేయు నుద్యోగి సుమంత్రుండు (Finance minister.) నాఁబడు.

మనరాష్ట్రంబునఁ బురంబులు గ్రామంబులు నరణ్యంబులు నిన్నికలవనియు నీయేఁ డింతభూమి దున్నఁబడెననియు నింతయరి వీఁ డిచ్చెననియు నింతకరం బింకనువీఁ డీవలయు ననియు నకృష్టభూమి యింత యనియు భూమివలన భాగం బింతయనియు శుల్కద్రవ్యం బింతయనియు దండజంబైన ద్రవ్యం బింతవచ్చెననియుఁ గొలఁకులపంట యింతయనియు నారణ్యకద్రవ్యంబులిన్నియు ఖనిజంబులిన్నియు నస్వామిక ద్రవ్యం బింతయుఁ దస్కరాహృతం బింతయు సంఘటిల్లె ననియు రాజునకు నివేదించు సేవకుఁ డమాత్యుఁ (Ordinary Minister)డగు. సంక్షేపంబునఁ బ్రకృతిదశలక్షణంబుఁ గృత్యం బిట్లు చెప్పంబడె.

## తక్కిన చిన్నయుద్యోగుల నేర్పఱుచు విధము

మఱియు రాజు వారు లిఖించుదాని సర్వంబు నప్రమత్తుండై పరీక్షించుచు వీరిఁబరస్పరోద్యోగంబుల కప్పుడప్పుడు మార్చుచుఁ దనకంటె నధికబలసంపన్నుల కుద్యోగంబు లీయక యన్యోన్యానురక్తుల సమబలులఁ గార్యంబుల నియోగించుచు నొక్కకార్యంబున మువ్వుర నియమించుచు నం దొక్క ప్రాజ్ఞతముని ముఖ్యుని నితరుల నప్రధానులఁ గావించుచు వారికార్యప్రావీణ్యంబు పరిశీలింపనిఁక నిద్దఱ నియమించుచుఁ బరిశీలకుల నేఁటేఁట మార్చుచు మూఁడు నైదు నేడు పది సంవత్సరంబులు వారికార్యకౌశలంబు పరీక్షించి నివర్తింపఁ దగువారి నివర్తించి తక్కినవారిం దప్పక యుద్యోగాంతరంబునకుఁ బరివర్తించుచుండవలయును. అధికారమదంబున మత్తిల్లనివాఁడు దుర్లభుండుగాన నెట్టిగుణ్యు నేని చిరకాల మొక్కయుద్యోగంబున నుండనీక యా యధికారంబునకు దక్షుం డగువాని వాని క్రిందికొలువరినేని తగువాఁడయ్యె నేని పరివర్త్యుని పుత్రు నేని నియమించుచుఁ గ్రమంబుగ శ్రేష్ఠపదంబు నొందినవానిఁ బ్రకృతిపదంబున రాజు నియోగించుచుఁ గార్యానుసారంబుగ దర్శకులఁ బెక్కండ్ర నే నొక్కమీఁదియధికారి నే నియోగించుచుఁ గర్మసచివులను గజాశ్వ రథపాదాత పశూష్ట్ర మృగపక్షులకు సువర్ణ రత్న రజతాదులకు విత్తంబులకు ధాన్యాదులకుఁ బాకంబులకు నారామంబులకు సౌధగేహంబులకు సంభారంబులకు దేవోత్సవంబులకు దానంబులకు వేర్వేఱ నధిపతుల నియమించుచు నెల్లపురంబులందు గ్రామంబులయందు

* సాహసాధిపతిని § గ్రామణిని × భాగహారుని ♦ లేఖకుని
\+ శుల్కగ్రాహునిఁ బ్రతిహారుని నేర్పఱచి తపస్వులను దాన
శీలుర శ్రుతిస్మృతిపురాణాదుల నెఱింగినవారి శాస్త్రజ్ఞుల
దైవజ్ఞుల మాంత్రికులఁ దాంత్రికుల వెజ్జులఁ గర్మకాండజ్ఞుల
బుద్ధిమంతులుఁ బూజ్యులు జితేంద్రియులు గుణవంతులు నగు
నితరజనంబుల దానమానంబుల వేతనంబులఁ బోషించుచుండ
వలయు. అట్లు చేయనినాఁడు రాజకీర్తిఁ బొందుటయే కాక
హానియుం బొందు.

కార్యంబులు బహుజనసాధ్యంబులు కావున నాయా
యికార్యంబులఁ గుశలు లగువారి నెఱింగి నియోగించునది.
అమంత్రంబగునక్షరంబును ననౌషధం బగు మూలంబును
నప్రయోజనం బగుజనంబును లేదు. దాని యుపయోగం
బెఱింగ నియోగించువాఁడు దుర్లభుఁడు. గజంబులలో భద్రా
దిజాతిభేదంబులును జికిత్సితంబును శిక్షయు వ్యాధియుఁ బోష
ణంబు నారోహణనైపుణియు గమనవిశేషంబును దాలుజిహ్వా
నఖంబులచేఁ దద్గుణంబులను దెలిసినవాఁడు గజాధ్యక్షుఁడు
గావలయును. అట్టి హస్తిపకుండ కరిహృదయహారకుండగు.
అశ్వహృదయంబును వాని జాతివర్ణ భ్రమంబులచే గుణాబు
లను, గమనంబును, శిక్షయు, వెజ్జఱికంబును, రోగంబును,
సత్త్వంబును, వాని హితాహితంబులు పోషణంబును, దంతం

---

* సాహసాధిపతి=Magistrate. ♦ లేఖకుఁడు=కరణము. × భాగహారుఁడు=పన్నువసూలుచేయువాఁడు. + శుల్కగ్రాహుఁడు=దేశాంతరమునుండి వచ్చిన సరకులకుఁ బన్ను పుచ్చుకొనువాఁడు. § గ్రామణి=గ్రామాధిపతి.

బులు వయసు నెఱిఁగిన శూరు నశ్వపాలనంబున నియో
గింపవలయు. మీఁదటి గుణంబులు గలిగి ధుర్యంబుల,
రథ్యంబుల, యుగ్యంబులఁ దెలిసి రథసారగమన భ్రమణ పరి
వర్తనంబుల నేర్చి యొడ్డనంబుల నెఱిఁగి పగవారు సమీపిం
చునపుడు వారిశస్త్రాస్త్రలక్ష్యసంధానంబు వితథం బగునట్లు
రథంబు నడుపఁ గలవాఁడు రథాధ్యక్షుండు గావలయు.
శూరులు, దృఢాంగులు, శస్త్రాస్త్రయుద్ధకోవిదులు, ప్రాజ్ఞులు,
వ్యూహవిశారదులు, హయగతిజ్ఞులు, నగువారిని రాజుసా
దులఁ జేయునది. మఱియు నశ్వబలానుసారంబుగ శిక్షింప
నేర్చువారు, చక్రితము, రేచితము, వల్గితకము, ధౌరితము,
నాప్లుతము, తురము, మందము, కుటిలము, సర్పణము, పరి
వర్తనము, నాస్కందితమునను నశ్వగతుల నెఱింగినవారు
హయ శిక్షణంబునకును దృఢాంగులు శూరులుం బల్యాణాది
నియోగకుశలులు, నశ్వసేవనంబునకును నర్హులు. నీతిశాస్త్ర
నిపుణులు బల్లిదులు శస్త్రాస్త్రవిదులు జితేంద్రియులు స్వధర్మ
నిరతులు స్వామిభక్తులు రిపువిద్వేషులునగు శూద్రులనేని బా
లురు వృద్ధులు గానివారు దృఢాంగులు నగువారి క్షత్రియులనేని
మ్లేచ్ఛులనేని సేనాధిపతులను సైనికులను జేసి జయార్థియగు
రాజు సంధరించునది. పదగాముల కయిదార్గురకు నొక్కయధి
పతిని నియమింపవలయు. ఆయధిపతిం బత్తిపాలుఁ డందురు.
తర్వాత ముప్పదుండ్రు సైనికుల కొకయధికారి గావలయు.
ఆతని గౌల్మికుం డందురు. నూఱుగురుయోధుల కధ్యక్షుండు
శతానీకుండు. వానిమీఁది యధికారియనుశతికుండు. వాని కధి
కుండు సేనాని. సేనానికొక్క లేఖకు నేర్పరుపవలయు. వీరు

శత సైనికులక యధికారు లగుదురు. వేగురు భటుల కధికారి సాహస్రికుండును దశసహస్రాధ్యక్షుఁ డాయుతికుఁడు నని వ్యవహరింపఁబడుదురు.

అనుదినంబు ప్రాతఃకాలంబునను సాయంసమయంబునను జోదులకు వ్యూహంబుల నేర్పుచు యుద్ధకౌశలంబు నలవరించు నధికారి శతానీకుఁడు. శతానీకునకుఁ గరంబు పోరి తెఱంగు నేర్పు సాధకుఁ డనుశతికుఁడు. యుద్ధసంభారంబుఁ దెలిసి కార్యయోగ్యులగు సైనికులను యామికులను దగిన కార్యంబుల నియోగించువాఁడు సేనాని. యామికులఁ బరివర్తించు నధికారంబు పత్తిపాలునిది. గాల్మికుఁడు యామికుల జాగ్రత్తం బరిశీలింపవలయు. సైనికు లిందఱనియు నితని కింత వేతనంబనియు వీరు క్రొత్తవారు వీరు ప్రాఁతవారు నని యెఱిఁగి యుందఱు గ్రామాంతరంబునన్నవా రింద ఱిచటఁ గలరని లేఖకుండు వ్రాయుచుండవలయు. ఇరువదిగుఱ్ఱంబుల కేని గజంబుల కేనధికారి నాయకుం డనంబడు, పైయుద్యోగులనం దఱ వారికిఁ దగినచిహ్నంబులతో లాంఛితు లయియుండ రాజు నియమించునది. మఱియు నుష్ట్రమేషమృగాదిజంతు పోషణంబునం దగినవారి నియోగించుచు శ్యేనాదులకుఁ బాతంబును శుకాదులకు సంభాషణంబును దద్హృదయజ్ఞులచే రాజు నేర్పించుచుండవలయు. యుద్ధప్రవృత్తికుశలురఁది త్తిర్యాదిపక్షి పోషణంమున నియోగించునది. మానంబునను వర్ణంబునను జాతిని రత్నంబులమూల్యంబు లెఱిఁగినవాఁడును సౌవర్ణరాజతనాణకంబులఁ బరిశీలింప నేర్చినవాఁడును ధనికుఁడు దాంతుఁడు వ్యవహారవిదుఁడు ధనప్రాణుండు నగుకృప

ణుని భూపతి కోశంబులకురత్నంబులకు నధ్యక్షునిఁ గావింపవలయు. దేశభేదంబులచే జాతిభేదంబులచేఁ గౌశేయాదుల మూల్యంబులునుస్థూలసూక్ష్మవస్త్రంబుల క్రయద్రవ్యంబును నెఱిఁగినవాని వస్త్రాధిపత్యంబున నియోగించి రంజనాదుల నేర్చి కంచుకనిర్మాణంబు నెఱిఁగి దూష్యరచనఁ దెలిసి శయ్యామండపాలంకారంబు నుపధానాదిసంధానంబును వితాననియోజనంబును నెఱిఁగినవాని వితానాధిపత్యంబున ఱేఁడు నియోగించునది.

ధాన్యంబుల జాతులు వాని గుణంబులు శోధనంబును గొలఁతయుఁ దూనికయు నెఱిఁగినవానిఁ గొల్చున కధిపతిం జేసి పదార్థంబుల శుద్ధియుఁ బాకంబును రసంబును నేర్చి పదార్థగుణంబుల నెఱిఁగి నాతనిం బాకనాయకుఁ జేయవలయు. పుష్పఫలాదివృద్ధిహేతు వగు దోహదంబు నేర్చి కాలానుకూలంబుగఁ బాదపంబుల నాటుటయు, జలాదులచే వాని పోషణంబును భేషజంబును దెలిసినవాని నారామపాలుం జేయవలయు. ప్రాసాదంబుల నగడ్తల దుర్గంబులఁ బ్రాకారంబులఁ బ్రతిమల యంత్రంబుల వాపీ కూప తటాకంబుల జలోర్ధ్వగతిక్రియల శిల్పశాస్త్రానుసారంబుగ నిర్వర్తింప సమర్థుం డగువాని గృహాధిపత్యంబునఁ బ్రభువు నియమించి, రాజకార్యంబులకుఁ దగిన వస్తువుల నెఱిఁగి కాలానుసారంబుగ వాని సమకూర్చువాని సంభారాధిపుం జేసి స్వధర్మాచరణమున దక్షుని నిస్పృహుని దేవతారాధనాసక్తుని దేవతోత్సవాధికారమున నియోగించునది. యాచకున కాశాభంగంబు గావింపనివాఁడు నర్థుల సంగ్రహింపనివాఁ

డును దానశీలుఁడు నిర్లోభుండు దయాళువు మృదువచనుండు దానపాత్రజ్ఞుఁడు నగు వినయవంతుని దానాధికారంబున నియోగింపవలయు. వ్యవహారవిదులు ప్రాజ్ఞులు వృత్తశీల గుణాన్వితులు నిరాలసులు శత్రులందు మిత్రులందు సదృశులు జితక్రోధులు నకాములు ప్రియంవదులు నగు నెల్ల జాతుల వారి వయోవృద్ధుల సభ్యుల (Members of council) నియమించునది. సర్వభూతదయాపరుఁడు నిస్స్పృహుఁడు నతిథిపూజకుఁడు దానశీలుఁడు నగువాని సత్రాధికారంబున రాజు నిలుపవలయు. పరోపకారనిరతుని నిర్మత్సరుని గుణగ్రాహిని బరమార్మప్రకాశకుని విద్వాంసుని బరీక్షాధికారంబున నియమించునది. ప్రజల కతిభీతి గల్గకుండ నపరాధానుసారంబుగ దండించువాని నతిమార్దవంబు నతిక్రౌర్యంబు లేనివాని సాహసాధిపతి నూరూర నియమించి తల్లిదండ్రులువలెఁ బ్రజారక్షణ దక్షునిఁ జోరులవలన నాధర్షకులవలన నధికారిగణంబు వలనను గావఁ దగినవాని గ్రామాధిపత్యంబున నేర్పఱచి, మాలకరి వృక్షంబులఁ బెనిచి పుష్పంబులు ఫలంబులు గొనునట్లును మధుకరంబు మరందంబు గొనునట్లును జనులకు మనసు నొవకుండ నుపకారంబుల గావించుచుఁ గరంబు గొనువాని భాగహారణంబున నియోగించి స్పష్టంబుగ నగూఢార్థంబుగను లిఖింప నేర్చిన వాని వేత్త్వేఱు దేశభాషలఁజక్కఁగ నెఱింగిన వాని గణనాకుశలుని లేఖకు నేర్పఱిచి శస్త్రాస్త్రకుశలుండు నిరాలసుఁడు వినయవంతుఁడు నగు దృఢాంగునిఁ బ్రతీహారకుఁ జేసి బేహారుల మూలధనంబునకు హానిగలుగకుండ శుల్కంబు నాకర్షించువాని సుంకంబు గ్రహింప నేలిక నియమించునది.

మంత్రపారాయణంబునందు నాహారనియమంబునందు నాసక్తుండు నిస్పృహుండు క్షమియు నగువాఁడు తపోనిష్ఠుండగు. ఎద్దియేనియు సంగ్రహింప నపేక్షింపక నిరంతరంబు యాచకులకు నిచ్చువాఁడు దానశీలుం డగు. శ్రుతి స్మృతి పురాణాధ్యయనాధ్యాపన సమర్థుఁడు నభ్యాసశీలుండు శ్రుతజ్ఞుఁ డగు. సాహిత్యశాస్త్ర నిపుణుండును సంగీతజ్ఞుఁడు సుస్వరుండు సర్గాది పంచకజ్ఞాతయు నగువాఁడు పౌరాణికుఁడు. మీమాంసా తర్క వేదాంత శబ్ద శాసన తత్పరుండును వాని బోధింప సమర్థుండు నగువాఁడు శాస్త్రజ్ఞుఁ డనంబడు. సంహితయు హోరయు నెఱిఁగి గణితతత్త్వంబు దెలిసి త్రికాలజ్ఞుఁడగువాఁడు జ్యోతిష్కుఁడగు. బీజానుసారంబుగ మంత్రంబుల గుణదోషంబుల గ్రహించి మంత్రానుష్ఠాన నిరతుండును సిద్ధదైవతుండును నగు మహానుభావుండు మాంత్రికుండు.

రోగోత్పత్తి కారణంబునను దాని చిన్నెలను వ్యాధిస్వరూపంబును దన్నివారణసాధనంబులు నెఱిఁగి సాధ్యాసాధ్యంబుల నిశ్చయించి చికిత్సోపక్రమంబు సేయువాఁడు సద్వైద్యుండు. శ్రుతి స్మృతీతర మంత్రానుష్ఠానంబుల దేవతార్చనంబు గావించుచు రాజునకు హితతమం బగు కార్యంబు సేయ యత్నించువాఁడు తాంత్రికుఁడు. సత్యవచనులు ప్రియంవదులు సత్కులులు సురూపులు నగు నపుంసకుల రాజు రాణివాసంబు సంరక్షణంబున నియోగించునది. స్వామిభక్తులు, ధర్మాసక్తులు, దృఢాంగులు, మధ్యమవయస్కులు, సేవాకుశలులు, రాజుచే నియుక్తంబులయిన కార్యంబుల నీచంబుల నే నిరాకరింపక చేయువారు ఱేని యానతి నతిక్రమింపనివారు నగు పరిచారకు

లేలికచే నియుక్తులు గావలయు. విభుండు దాయలయుఁ బ్రజలయు సేవకులయు వృత్తంబుల రహస్యంబున నెఱుఁగ నిపుణులును యథార్థబోధకులు నగు వారిగూఢచారుల నేర్ప ఱుపవలయు. రాజు తన్ను సమీపించువారికి నతియును స్థానంబును బోధించు కుశలుల వేత్రధరులఁ గావించి సప్త స్వరంబుల స్థానంబు లెఱిఁగి నృత్యంబు దెలిసి కంఠంబున స్వీణను నిపుణంబుగ గానంబు సేయ సమర్థుం డగు పురుషు నేని యట్టివిధము గలదియు సుందరాంగియు శృంగారరస తన్త్రజ్ఞ యు నిర్లజ్జయు ననురాగవతియు సుస్మితాననయు నగు వేశ్య నేని గాయనాధికారంబున నియోగించి చిత్తరంజకు లగు వైతాళికుల దండధరుల శిల్పజ్ఞులఁ గలావిదుల భాణజ్ఞుల నర్త కుల వేషధారుల నైంద్రజాలికుల దుర్గనిర్మాతల మహానాళిక యంత్రగంబులయిన గోళంబులచే లక్ష్యభేదనంబు సేయువార ల లఘుయంత్రకారుల నాగ్నేయచూర్ణబాణాసిగోళకారుల నానావిధశస్త్రధనుస్తూణాదికారుల స్వర్ణరత్నాద్యలంకారఘ టకుల రథకారులఁ బాషాణలోహాదిక్రియాకుశలుల ధాతువి లేపకుల గుంభకారులఁ దక్షుల మార్గకరుల నాపితుల రజకుల వాంశికుల మలహారకుల వాసికుల (అంపమునం గట్టిలఁ గోయు వారల) వార్తాహరుల సూచికుల రాజచిహ్నంబు లగుఘన ఛత్రా దుల ధరించువారల నావికుల ఖనకుల వ్యూహముల నిర్మింపఁగల వారల భేర్యాదులయు వేణుశంఖాదులయుధ్వనులచే యాన వ్యపయానంబుల బోధించువారల వ్యాధుల భారవహుల శస్త్రో త్తేజనకరుల నాపణికుల గణికల వాద్యజాయాజీవులఁ దంతు వాయుల శాకునికులఁ జిత్రకరులఁ జర్మకరుల గృహపాత్రాది

సమ్మార్జనకరుల శయ్యావితానాస్తరణంబులు రచియించువారల స్వేదంబుపుట్టింపని పరిమళవిశిష్టధూపంబుల రచియించువారలఁ దాంబూలికుల మఱియు హీనకర్మకరుల నల్పకర్మకరులఁ దత్తత్కార్యానుసారంబుగ నియమించి వారికార్యంబులు పరికించుచు నాత్మహితంబుకొఱకుఁ బోషింపవలయు. సత్యంబును బరోపకరణంబును బుణ్యాతమంబులు గాన వానియందాసక్తులగు భృత్యుల రాజు ప్రేమించునది. హింసయు ననృతభాషణంబును మిగులఁ బాపకార్యంబు లౌటఁ జేసి తదాసక్తులయిన భృత్యుల నెకప్పుడేనియు రాజు సంధరింపఁ జనదు. ఎక్కాలంబున నెయ్యది కర్తవ్యం బెయ్యది వక్తవ్యం బద్దానిఁ దప్పక రాజునకు బోధించి చేయించువాఁడు సద్భృత్యుండు. సద్భృత్యుండు పశ్చిమయామంబున నిద్రనుండి లేచి కాల్యకరణీయంబులఁ దీర్చి గృహకృత్యంబు విచారించుకొని దేవతాప్రార్థనంబు గావించి కార్యశాలకుం బోయి కార్యాకార్యంబుల నిశ్చయింప వలయును. ద్వారికుఁడు రాజాజ్ఞనొందక దుర్గంబుఁ బ్రవేశించువారి నిరోధించి వారి వచ్చిన కార్యంబు దెలిసి యిట్టివారు దేవరదర్శనంబున కిట్టి పనికై వచ్చిరని రాజునకు నివేదించి యాజ్ఞవుత్తుండై విడుచుచుండవలయు.

## సేవకధర్మములు

దండధరుండు సభామధ్యంబునకు వచ్చినవారిం జూచి రాజునకు మున్ను నివేదించి పిమ్మట వారి నమస్కారంబు విన్నవించి వారికిం దగిన స్థలంబుల సంజ్ఞచేఁ దెలియఁజేయ వలయు. కార్యాలయంబు ప్రవేశించి కొలువుకాఁడు రాజుచే

నాజ్ఞప్తుండైనఁ బ్రాంజలియై తత్సన్నిధిం బడసి రెండవవిష్ణుం
బోని ప్రభువునకు యథాన్యాయంబుగ వినమ్రుఁడై యతని
యందదృష్టి నిల్పి చిత్తజ్ఞుఁడగునతనికి సమ్మతుండై దీప్తాగ్నిం
బోలె వినీతుండై సమీపించి యలిగిన నాశీవిషం బని యెన్ని
కొని ప్రాణధనేశ్వరుండగు ప్రభువు నవధానంబున సేవించుచు
నెందునకేని నేఁ గాననక ప్రసంగంబున రాజుపక్షంబు సమ
ర్థించుభాషితంబు సెప్పుచుఁ దదనుయోగంబున సునిశ్చితం
బైనయర్థంబు వాక్రుచ్చుచు సుఖగోష్ఠిని వివాదను వాదుల
యభిప్రాయంబెఱింగియు నవద్యంబైన వచనంబుడుగుచు నను
ద్ధతవేషుండై నతిపూర్వకంబుగా రాజువచనంబు విని ముందు
వారియాజ్ఞ నౌదల ధరియించి పదపడి వస్త్రాంతరితముఖుండై
తనకార్యంబు విన్నవించునది.

మఱియు రాజుమ్రోల నాసీనుండు గాక వినమ్రుఁడై
యభిముఖమ్ముగఁ బార్శ్వంబున నిలువవలయు. కాసప్రహ
సననిష్ఠీవన కుత్సనజృంభణగాత్రభంగపర్వ స్ఫోటంబులు
రాజుసమ్ముఖంబునఁ బరిహరించి రాజాజ్ఞప్తంబైన స్థలంబున
నామోదంబునఁ గూర్చుండి ప్రవీణోచిత మేధాసంపన్నుం
డయి యభిమానంబు వర్జించి యాపత్కాలంబున నున్మార్గ
గమనంబునఁ గార్యకాలాత్యయంబున నననుయుక్తుండయ్యు
సేవకుండు రాజహితార్థియై ప్రియంబుఁ బథ్యంబు ధర్మార్థ
సహితంబు సప్రమాణంబు నగు వాఙ్నిచయంబున నీతిఫలం
బైన రాజన్యుల కీర్తి నతనియొద్ద నుగ్గడించి హితంబుం
బోధింపవలయు. "ఓ రాజా! నీవుదాతవు శూరుండవు ధార్మి
కుఁడవు నీమనంబున దుర్నీతి యెన్నండును లేదు" అని స్తుతి

యుంచుచుఁ జెడునడతలచేఁ బదభ్రష్టులయినరాజుల నతని యెదుట సేవకుఁడు నిరూపించుచుండవలయుఁ గాని యందఱు రాజులకంటె నధికుఁడవని విశేషించి యెన్నఁదగదు.

మఱియు భృత్యుండు దేశకాలజ్ఞుఁడై పరార్థంబు సాధించుచు నొకప్పుడేనియుఁ బరకార్యభంగం బగునట్లు సంభాషింపక పరోపకార మిషంబున నెల్లపుడు రాజుల బాధింపకయుఁ జరింపవలయు. పండితుఁడు క్షుధాపరిగతుండై కృశించియు స్థాణువుంబోలి యుండఁదగుఁ గాని యనర్థసంపన్నం బయిన వృత్తి నేనాఁడు నపేక్షింపఁ దగదు. ఎవఁడెక్కార్యంబున నియుక్తుం డయ్యె నతఁడు దానఁ దత్పరుండు గావలయుం గాని యన్యాధికారంబు నిచ్ఛగించి యితరులయం దసూయాపరుండు గాఁజనదు.

ఇతరులకు మేలుసేఁతకంటె మిత్రసంపాదనసాధనం బొండు లేదు గావున సేవకుఁ డితరుల ఛిద్రంబు లన్వేషింపక స్వశక్త్యనుసారంబున వానిం బూరించుచుండవలయు. రాజానుచరుఁడు సమర్థుఁ డయ్యేనేని యర్థికార్యంబు సరగఁ జేయవలయుఁ గాని కార్యంబు కావింతుఁ గావింతు నని చిరకాలం బాశాబద్ధుఁ జేయఁదగదు. భృత్యుండు రాజు రహస్యంబును మంతనంబును బ్రకటింపక యతని విద్వేషంబును నాశంబును మనంబుననేని చింతింపక రాజు నాకుం బరమమిత్రుం డని యిచ్ఛానుసారంబుగఁ జరియింపక యతని నభిలషించు స్త్రీలతోడను బాపులతోడను జేనిదాయలతోడను దన్నిరాకృతులతోడను నేకకార్యాచరణంబును సాహిత్యసంసర్గంబులును వర్జించి వేషభాషల రాజు ననుక

రింపక సంపన్నుండయ్యు బుద్ధిమంతుండై రాజుగొనంబుల నీసుఁ జెందక కుశలుండయి రాజు రాగాపరాగంబు లెఱుఁగుచు నింగితాకార చేష్టలఁ దదభిప్రాయంబు దెలిసి తనయందనురక్తుండగు రాజు సేవించుచు విరక్తుండగువాని వర్జింప వలయు. విపత్త్యాభ్యుదయంబు సేయుచుఁ దనకు నాశ గల్పించియు ఫలనాశంబు గావించుచుఁ గ్రోధంబు లేనివాఁడయ్యు నున్నట్లు నటియించుచుఁ బ్రసన్నుండయ్యు నిష్ఫలుండయి సగర్వంబుగ మాటాడుచు వృత్తిచ్ఛేదంబు సేయుచు స్వగుణకీర్తనంబున విముఖుండగు రాజు విరక్తుండనియుఁ దన్నుఁ జూచి ప్రసన్నుండై మనవిసేయునర్చు దాని నాదరంబున వినుచుఁ గుశలప్రశ్నపూర్వకంబుగ నాసనాదు లిప్పించుచు వివిక్తంబుగ దర్శనం బిచ్చుచు రహస్యంబుననేని తనయెడ శంకింపక హృష్టవదనుండై తాఁ జెప్పుదాని నప్రియంబేని మన్నించుచు స్వల్పంబేని తా నిచ్చు నుపాయనంబు గ్రహియించుచుఁ గథాంతరంబులయందుఁ దన్ను స్మరించు రాజనురక్తుఁడనియు సేవకుఁ డెఱుంగునది. కొలువరి రాజదత్తంబు లయిన వస్త్రభూషణచిహ్నంబుల ధరియించుచు నిచ్చలు స్వాధికారంబునందలి న్యూనాధికభావంబుల నివేదించుచుఁ బ్రణిధి సూచక దోషంబున రా జెద్దియేని తాఁ జెప్పినదానికిం బ్రతికూలంబుగఁ జెప్పిన మౌనావలంబియై దాని విని నిజంబని యనుమోదింప కుండునది. ఒక్కమా అయినఁ బ్రేమదత్తంబయిన యెవ్వని యన్నంబు భుజియించు వానికి మేలుసేఁత సల్లక్షణంబు నాఁ జిరపాలకుండగు రాజునకు మేలాలోచించుట చెప్ప నేల? కావున సున్నపతి యా

పద్గతుండయిన విడువందగదు. అత్యంతసేవనంబున నప్రధా
నుండు ప్రధానుండును సేవాలస్యంబునఁ బ్రధానుఁ డప్ర
ధానుండును నిత్యసంసేవనరతుండగు భృత్యుండు రాజునకుఁ
బ్రియుండును నగుంగావున భృత్యుండు తనకు నియుక్తంగుబ
కార్యంబు సత్వరంబుగ నిర్వర్తించుచుండునది. నీచకార్యం
బులు సాహసంబున రా జాజ్ఞాపింపను నుత్తమసేవకుండు
చేయను దగదు. అయ్యును దత్కార్యంబు సేయ సర్థుఁడగు
సేవకుఁడు లేనితఱి నుత్తముఁడయిన రాజున కావశ్యకంబగు
నీచకార్యంబును జేయన తగు. భృతికుఁడు రాజు సంతసిల్లు
కార్యంబున ననిష్టంబును స్వాధికారగౌరవంబును జూపఁదగదు.
రాజును నియుక్తులగువారు తమయధికారంబు రక్షించుకొనటకుఁ
బరస్పరాసూయఁ జెందకుండవలయు. రాజు నధికారిగణంబు
నెచట సద్వృత్తంబుననుండు నచట లక్ష్మి సుస్థిరమై
యుండు. అధికృతుం డన్యాధికారివృత్తంబు విన్నను రాజునకు
విన్నవింపను నన్యముఖంబున నన్యాధికారివృత్తంబు రాజు
వినను సమ్మతింపంజనదు. రాజునకు హితాహితంబులు
బోధింపని యధికారులు భృత్యరూపచ్ఛన్నులయిన వైరులు.
మంత్రిముఖంబున హితాహితంబులు వినని రాజు ప్రజాధనంబు
రాజరూపంబున హరియించుదస్యువు. రాచకొమరులచే వ్యవ
హారంబులఁ బ్రష్టులయి వారితో విరోధించు మంత్రులు
తస్కరులు. రాజపుత్రులు బాలురయ్యు మంత్రులచే మిగుల
సన్మానింపఁబడఁ దగినవారు. మంత్రులు బహుమానపూర్వక
వాక్యంబుల వారి బోధింపవలయు. స్త్రీపుత్రమోహంబు బల-
వంతంబు గావున వారి యసచ్చరితంబు నెన్నఁడు రాజునకు

నివేదింపం దగదు. మఱియు వారి నిందించుటయు శ్రేయంబు గాదు. రాజునకవశ్యంబగు కార్యంబు దనకుఁ బ్రాణసంశయ కారి యయ్యు నన్నాజ్ఞాపింపుఁడు నేఁజేయఁగలనని యనుజ్ఞ నొంది కర్మోపజీవి శక్తికొలఁదిఁ దత్కార్యంబునకు యత్నించుచు మహాకార్యంబు తటస్థించునపుడు కుటుంబపోషణార్థంబు ప్రాణంబు నేని యొసఁగునది. కాని వ్యర్థంబుగఁ బ్రాణత్యాగంబు దగదు. రాజులు యుద్ధాదిమహాకార్యంబులయందు యుక్తిపూర్వకంబుగ భృతిచే భటులప్రాణంబులు గొందురు. భటులు భృతిచే ధనమాత్రంబు గొందురు. భృతికంటె వేఱుగ రాజధనంబుగొను భృత్యుండును నిష్కారణంబుగ భృత్యప్రాణంబులు గొను రాజు నాత్మనాశకు లగుదురు. రాజును యువరాజును నమాత్యాదులచే మిగుల మాన్యులును వారికంటె నమాత్యాదులు న్యూనులు నగుదురు. అమాత్యాదులకంటెఁ దక్కిన యధికారిగణంబు న్యూనంబు. ఆయుతికుండు మంత్రితుల్యుండు; అతనికంటె సాహస్రికుండు న్యూనుండు. రాజుతో సమంబుగ నమాత్యాదులు క్రీడింపందగదు; క్రీడించిన రాజును విశేషింపఁజేయవలయు. మంత్రులచే రాజునవరోధంబును, బంధులును, మిత్రులును, మిగులఁ బూజనీయులు. సేవకుఁడు రాజుచే నాహూతుండగుడుఁ గార్యశతంబేని త్యజియించి సత్వరంబుగఁ బోవుచు వారిచే సుమంత్రితంబయిన కార్యంబు మిత్రునకే నెఱిఁగింపక భృతిందక్క నదత్తంబయిన రాజద్రవ్యంబు నభిలషింపక రాజునానతి నొందక కార్యమాధ్యస్థికభృతి నపేక్షింపక యాపత్కాలంబునఁ బుత్రధనప్రాణాదుల నేని రాజు

రక్షించుచు నుత్కోచం బెన్నండేని గ్రహియింపక, ద్రవ్య లోభంబున సత్కార్యంబుఁ జెఱుపక రాజునకు దుర్బోధంబు సేయక శాస్త్రవ్యతిరేకంబుగను దీక్ష్ణంబుగను దండించు భూపుని రాజ్యగుప్తికై యేకాంతంబున నిగ్రహించి బోధించు చుండవలయు. నవీనకరశుల్కాదులచే లోకంబు పీడ నొందుఁ గాన రాజునకు హితంబును లోకంబునకు నహితంబును నగు కార్యంబు సేయింపన్వలదు. రాజు గుణనీతిబలద్వేషియు సత్కులజుండయ్యు నధార్మికుండు నయ్యెనా రాష్ట్రనాశకుం డగు నతనిఁ ద్యజియించి తత్పదంబున గుణయుక్తుండగు తద్వంశ్యునిఁ బ్రకృత్యనుమతంబు నొంది రాజ్యరక్షణార్థంబు పురోధసుం డభిషేకించునది. సాస్త్రుం డగువాఁడు రాజునకు నస్త్ర పాతంబునకుఁ దగనిదూరంబునను సశస్త్రుండు పదిహస్తంబుల దూరంబునను బ్రియు లాజ్ఞానుసారంబుగను మంత్రులు లేఖకులు నయిదుహస్తంబుల దూరంబునను బేరోలగంబున నుండ వలయు.

సేనాధికృతులు గానివారు శస్త్రాస్త్రంబులతో సభం జొరరాదు. రాజసేవకులలో సేనాని శ్రేష్ఠుఁడు; పురోహితుఁడు శ్రేష్ఠతరుఁడు; సుహృదుండును బంధుండును సములు; మంత్రులెల్లనుత్తములు; తక్కిన యధికారిగణంబు మధ్యమంబు; దర్శక లేఖకగణం బధమంబు; పరిచారకగణం బధమతమంబు; నీచకార్యసాధకు లంతకంటె న్యూనులు. రాజు పురోహితాదులకుఁ బురోగమనోత్థానస్వాసన సన్నివేశకుశల ప్రశ్న స్మితదర్శనాదులఁ గ్రమంబుగఁ గావించుచుండవలయు. రాజు మఱియు నితరు లగు నధికారులకు సభాస్థలంబునఁ

ప్రేమపూర్వకంబుగ దర్శనంబిచ్చుచు విద్వాంసులయెడ శర
చ్చంద్రుని విద్వేషులయెడ నిదాఘార్కునిఁ బ్రజలయెడ వసంత
భానునిఁ బోలి త్రివిధుండయి యుండవలయు. ప్రభువు ద్విజే
తరులయెడ మార్దవంబుఁ బొందెనేని వారు హస్తిపకులు గజం
బుం బోలె నెకిమీనిఁ బరిభవించి యెల్లవారు స్వార్థపరుల కా
వునఁ దమ కర్జంబు సిద్ధించుకొఱకు వేర్వేఱఁ దమ కార్యంబు
గుణవంతం బని బహువిధంబుల బోధించుచు తేనివచనంబు
వికల్పించి యవమానించి స్వపదంబునఁ దుష్టివొందక తేని
యానతి నొందక రాజభోగ్యంబు లనుభవించుచు నతని
లోపంబును మంత్రంబును వెలివుచ్చుచు నిర్లజ్జు లయి
యతఁడు కోపించినఁ బరిహసించి భాషించుచు నాజ్ఞోల్లంఘ
నంబునకు వెఱవక యకార్యంబునకు జడియక మోసంబు
సేయుచుందురు. మీఁది దోషంబు లన్నియు రాజునకు సేవ
కులతోడి పరిహాసక్రీడన క్షమలవలనం బుట్టు. కాఁబట్టి రాజు
భృత్యులు మొదలగువారితోఁ బరిహాసక్రీడనంబులఁ గావింపఁ
జనదు. ప్రమాదంబు పురుషధర్మంబు గావునను లేఖ్యంబు
నిర్ణాయకంబు గావునను సేవకుఁడు నృపునిలేఖం బొందక
యొక్కపుడేని రాచకర్జంబు గావింపను గార్యం బల్పం బైన
నధికం బయినను లేఖం బంపక రాజాజ్ఞాపింపను దగదు.
లిఖితరూపమునఁ గాక వాఙ్మాత్రమునఁ గార్యంబుసేయ
నాజ్ఞాపించు రాజును నట్టి యానతి న్మన్నించి కార్యము నావ
టించు సేవకుఁడును బరస్పర వంచకు లగుదురు. నృప
ముద్రాముద్రితంబయిన లేఖ్యంబ నృపుఁడు గాని రాజు
స్వరూపంబున నృపుఁడు గాఁడు. రాజలిఖితం బయిత

న్ముద్రాముద్రితంబైన లేఖ్యం బుత్తమోత్తమంబు. రాజ లిఖితం బుత్తమంబు. మంత్రి లోనగువారిచే లిఖితంబయినది మధ్యమంబు. పౌరులచే వ్రాయఁబడినది యధమంబు. అన్ని యుఁ గార్యసాధకంబుల యగు. రాజుచే నాయాయి కార్యములయందు నియుక్తు లగు యువరాజాదులు తత్తత్కార్యంబుల లేఖ్యంబులు దినంబునను మాసంబునను వర్షంబునను బహువర్షంబులను రాజునకు నివేదించుచుండవలయు.

పలువిధము లగు (దస్తావేజులు) లిఖితములు

కాలం బతిక్రమింప మనుజులకు భ్రాంతి వొడముట సహజం బగుటను విస్మరణంబు సంభవించుటను ననుభూత వ్యవహార స్మృత్యర్థంబు బ్రహ్మ లిఖితంబు నిర్మించుటను, రాజు మొదలగువారిచే లిఖితం బయి తన్ముద్రాంకితం బయిన లేఖ (Order) కు స్మృతిపత్రంబు (నకలు) వ్రాసి యత్నంబున రక్షింపవలయు. ప్రాచీనులచే లేఖ్యంబు నృత్తలేఖ్యం బనియు నాయవ్యయలేఖ్యం బనియు ద్వివిధంబుగ విభజింపఁ బడె. వ్యవహారభేదంబుచే నవిరెండును బహుప్రకారంబుల భిన్నంబు లయ్యె. లోకవ్యవహారసంబంధి యగు లేఖ్యంబు వృత్తలేఖ్యంబు. అందు వాదిప్రతివాదులచే సకారణముగఁ జెప్పఁబడిన సాధ్యార్థంబుతోఁ గూడినదియు సిద్ధాన్తయుక్తంబును నగునది జయపత్రం బగు (Decree). భృత్య సామంతాదులకు రాజు కార్యానుసారంబుగ నాజ్ఞాపించి వ్రాయు లేఖ యాజ్ఞాపత్రం బనంబడు.

పూజ్యు లగు ఋత్విక్పురోహితాచార్యాదులకుఁ గార్యంబు విన్నవించుచు వ్రాసినది జ్ఞాపనపత్రంబు. "ఇది

యెల్లవారు నిట్లు మదీయాజ్ఞానుసారంబుగఁ దప్పక చేయునది" యని కాలసంపన్నంబుగ రాజహస్తంబున లిఖితం బయినది శాసనంబగు. రాజు సేవాశౌర్యవైదుష్యాదుల సంతసించి దేశగ్రామాదుల లిఖిత పూర్వకంబుగ నిచ్చి వ్రాయించు పత్రంబు ప్రసాదపత్రం బగు. అదియె పురుషావధికం బొండెఁ గాలావధికం బొండె నయిన యుపాయనం బయ్యెనా భోగ పత్రంబు నాఁబడు. భ్రాత్రాదులు పరస్పరారుచిని విభక్త ధను లయి వ్రాసికొనునది భాగలేఖ్యం బగు. గృహభూమ్యాదులఁ దగినవారి కిచ్చి స్వపుత్రాదులు దాని హరియింపకుండ వ్రాయించి యిచ్చినది దానపత్రంబు నాఁబడు. గృహ క్షేత్రాదులఁ దగిన మూల్యంబునకు విలిచి వ్రాయించుకొనునది క్రయపత్రంబు. స్థావరపదార్థంబునే జంగమపదార్థంబునేఁ గుదువయుంచి రక్షించుటయు ననుభవించుటయు నిర్ణయించి వ్రాయునది సాధిలేఖ్యంబగు. రెండు గ్రామంబులవారు వివాదము లేకుండ నడువ వ్రాసికొన్నది సత్యలేఖ్యంబును నిద్దఱు రాజు లట్లు వ్రాసికొన్నది సంవిత్పత్రంబు నాఁబడు. సొమ్ము వడ్డితో నీయఁ బుచ్చికొని వ్రాసియేని వ్రాయించియేని యిచ్చు సాక్షిమత్కతం బయిన పత్రంబు ఋణపత్రం బని మనీషులు చెప్పుదురు. అభిశప్తునకు విద్వాంసులు ప్రాయశ్చిత్తంబు సేసిన పిదప నిచ్చెడు ససాక్షికం బయిన పత్రంబు శుద్ధిపత్రంబు. సాధకులు వ్యవహరించు నిమిత్తము స్వధనాంశంబులు గలిపి వ్రాసికొన్న పత్రంబు సామయికంబనంబడు. సభ్యాధికార్యాదులచే నకృతంబై వాదులచే నంగీకరింపఁబడిన స్వవ్యవహార జ్ఞాపకపత్రంబు సమ్మతిసంజ్ఞ నొప్పు. భద్రవాచకపదార

ర్థంబై యసందిగ్ధంబు నగూఢార్థంబునై యధికారితారతమ్యం బున స్తుత్యర్థ బహువచనాదులతోఁ గూడి యన్యవ్యావర్త కంబగు నట్లు పిత్రాదినామయుతంబై లిఖిత వత్సర మాస దిన నామజాత్యాదికం బయి కర్తవ్యకార్యబోధకంబగు సేవ్యసేవా ర్థంబైన పత్త్రంబు క్షేమపత్త్రం బని వ్యవహరింత్రు. పై లక్షణంబులు గల్గి యాధర్షకుఁ దెలియఁజేయునది వేదనా (=అభియోగ) పత్రంబు. సంగ్రహంబున వృత్తలేఖ్యస్వరూ పంబు చెప్పి యవశిష్టంబైన యాయవ్యయలేఖ్యంబు చెప్పు చున్నాఁడు. అయ్యది వ్యాప్యవ్యాపకభేదంబులచే, మూల్యా మానాదులచే భిన్నం బగు.

ఆయవ్యయంబుల స్వరూపము

ప్రతిదినంబు ప్రతిమాసంబు ప్రతివత్సరంబు స్వాయ త్తీకృతంబయిన పశుహిరణ్యధాన్యాది రూప ధనం బాయం బనంబడు. అట్లుపరాధీనంబు సేసినధనంబు వ్యయంబనంబడు. సాద్యస్కంబు ప్రాచీనంబు నగు నాయంబు సంచితంబు నాఁ బడు. వ్యయం బుపభుక్తంబు వినిమయాత్మకంబు నని ద్వివి ధంబు. సంచితంబు నిశ్చితాన్యస్వామికంబు ననిశ్చితాన్యస్వా మికంబు నిశ్చితస్వస్వత్వంబు నని త్రివిధంబు. అందు నిశ్చితా న్యస్వామికం బౌపనిధ్యంబు యాచితకంబు నౌత్తమర్ణికంబు నని త్రివిధంబయ్యె. సజ్జనులచే విశ్వాసంబున నిల్లడయిడిన ధనం బౌపనిధ్యంబు. వృద్ధిలేకుండ డాఁపనొప్పికొన్న యన్యుల యలంకారాదికంబు యాచితంబు. వడ్డితో నీయ నొప్పికొని యితరులవలన గ్రహించిన ధనం బౌత్తమర్ణికంబు. అన్యా క్రాంతంబు గాని స్థలంబున సంప్రాప్తంబైన లిబ్బి లోనగునది

యజ్ఞాతస్వామికంబు. స్వస్వత్వ వినిశ్చితంబు సాహజికంబు నధికంబు నని ద్వివిధంబు. అందుఁ గుసీదంబు నను యాజనా దులను బారితోష్యంబున నెక్కువ వెలను విజయంబునను బ్రాప్తంబైన ధనం బధికంబు. తక్కిన పైతృకం బైన ధనంబెల్ల సాహజికంబు. స్వాధీనద్రవ్యంబెల్లను బూర్వవత్సరశేషంబువర్త మానాబ్దసంభవంబునని ద్వివిధంబగు. మఱియుబహుభేదభిన్నం బైన సంచితంబుపార్థివంబునితరంబునని ద్వివిధంబు. భూమిభాగ సముద్భూతంబు పార్థివంబు. అది దేవమాతృకంబులు నదీ మాతృకంబులు బహు మధ్యాల్ప ఫలదంబులు నగు భూభా గంబులచే ననేకప్రకారం బగు. శుల్కంబునను దండంబున నాకరంబులను భాటకంబున నుపాయనాదులను బ్రాప్తంబగు నది యితరంబు. అందుఁ గొన్ని యాయంబులఁ దన్నిమిత్తంబు నకు వ్యయపఱుపందగు. వ్యయంబు పునరావర్తకంబు, స్వత్వ నివర్తకంబు నని ద్వివిధంబు. పెఱలయింట దాఁచినదియు భూ నిహితంబును గుసీదంబున నుపయుక్తంబును వినిమయాత్మ కంబును బునరావర్తకంబు. వడ్డి గలుగునట్లొండె లేనియ ట్లొండె నప్పిడినది కుసీదోపయుక్తంబు. వస్తువులఁ గొని మూల్యంబుగ నిచ్చినది వినిమయంబు.

స్వత్వనివర్తకంబు పారలౌకికంబు నైహికంబు నని ద్వివి ధంబు. ప్రతిదానంబును బసదనంబును వేతనంబు భోగ్యంబు నని యైహికంబు చతుర్విధంబు.

పరలోకసాధనం బయిన వ్యయంబు జపహోమార్చా దానంబులచే బహుప్రకారంబగు. పదార్థంబులఁ గొనియిచ్చు వెల, ప్రతిదానము. సేవాశౌర్యాదులచేఁ దుష్టిచెంది యిచ్చి

నది పసదనంబు. భృతిరూపంబున దత్తంబు వేతనంబు. ధాన్య వస్త్ర గృహారామగోగజాది సంపాదనంబునకు విద్యాభ్యాసంబునకు రాజ్యార్జనంబునకు ధనార్జనంబునకు వాద్య శస్త్రాస్త్ర ధాన్య సంభారగృహంబులకు మంత్రి శిల్ప మృగపాక నాట్య నిష్క వైద్యాదిశాలలకు వెచ్చించిన సొమ్ము భోగ్యంబగు. మీఁదటి యాయవ్యయంబు లన్నియు నాయవ్యయలేఖకుఁడు జాగ్రత్తగఁ బరిశీలించుచు వ్యయంబున ముందు లిఖించియె వెచ్చించుచు నాయంబున ముందు గ్రహియించియె వ్రాయుచు వ్యవహరింప హానివృద్ధు లతనిఁ జెందకుండు.

### మానసంఖ్యాది స్వరూపము - ద్రవ్య ధన స్వరూపము

పదార్థభేదంబునను దేశభేదంబునను మాన సంఖ్యోన్మాన ప్రమాణంబు లెల్లఁ బదార్థంబులకు వ్యవహారవిదులు నిర్ణయించిరి. ఇవి కొన్నింట సమాహారంబుగను గొన్నింటఁ బ్రత్యేకంబుగను నుపయోగింతురు. అంగులపదహస్తాదికంబు మానంబు. తుల యున్మానంబు. ప్రస్థాదిపాత్రంబు పరిమాణంబు. ఏకద్వ్యాదికంబు సంఖ్య. వ్యవహారార్థంబు ముద్రితంబయిన స్వర్ణరజతతామ్రంబులును వరాటంబు మొదలు రత్నంబుదనుక నున్న పదార్థజాతంబును ద్రవ్యంబు నాఁబడును. పశుధాన్యవస్త్రాదికంబు తృణాంతంబయిన పదార్థంబెల్ల ధనంబనం బడు.

ఏద్రవ్యవ్యయంబున జనులకుఁ బదార్థలాభంబుగల్గునది మూల్యంబు. పదార్థంబుల సౌలభ్య దౌర్లభ్యంబులఁ బట్టియు మంచి చెడ్డలం బట్టియు నానియర్ఘంబు హీనంబు నధికంబు నగుచుండు. రతనంబులకు సువర్ణాది ధాతుపదార్థం

బులకుఁ దక్కువ వెల కల్పింపఁదగదు. వానికిఁ దక్కువ వెల రాజదౌష్ట్యంబునన యగు.

## లిఖితముల వ్రాయువిధము

ఎద్దియేని వ్రాయునపుడు పత్త్రంబు దీర్ఘంబుగ నాల్గు మడతలుగ మడిఁచి వ్రాయవలసిన యంశంబు కొలఁదిఁ బరికించి యెడమభాగంబున మూఁట నొక్కపాలేని రెంట నొక్కభాగం బేని నాల్గవయంశం బేని విడిచి కాగితంబున నడ్డంబుగఁ బదావళి వ్రాయవలయు. రాజు లేఖ్యంబుల సొరిదిఁ బరికించి చూచి దానిఁ దాఁ జూచినట్లు గుఱుతుగ వ్రాయు వ్రాలును దన యభిప్రాయంబును నిచ్చవచ్చినట్లు వ్రాయఁ దగు. వ్యవహారవిషయంబు లయిన వ్రాఁతలు మున్మున్న మంత్రియుఁ బ్రాడ్వివాకుండుఁ బండితుఁడు దూతుఁడును బరస్పరవిరోధంబు లేకుండ వ్రాయవలయు. పిమ్మట నమాత్యుఁడు దానిం బరీక్షించి యిది సాధు వనియు ననంతరము సుమంత్రుండు దీనిఁ బరిశీలించితి నిది నిర్దుష్టం బనియుఁ దర్వాతఁ బ్రధానుఁ డిది యథార్థంబనియు ననంతరము ప్రతినిధి యిది యంగీకరింపఁ దగు ననియు యువరా జంగీకరింపవలసిన దనియుఁ బురోహితుఁ డీ లేఖ్యంబు సమ్మతం బనియు దానిపై వ్రాయుచు గడపటఁ దమ ముద్రలచే ముద్రింపవలయు.

పిమ్మట రాజు దాని నంగీకరించితినని వ్రాసి ముద్రింపవలయు. రాజు కార్యాంతరవ్యగ్రుఁడు కావుటం బట్టి లేఖ్యంబు సర్వంబు పరీక్షింప నవకాశంబు చాలమిని మంత్రిగణం బెల్లను

యువరాజును దాని స్వముద్రాముద్రితంబు చేసియె యనుప వలయు. రాజు దానిఁ జక్కఁగఁ బరిశీలింప నెడము లేనియపు డది చూడంబడినది యని యైనదానిపై వ్రాయుచుండవలయు. ఆయవ్యయంబులు వ్రాయునపుడు పత్రంబు వామభాగంబున ముందాయంబు వ్రాసి దక్షిణంపు దెస వ్యయంబును గ్రమంబుగ వ్రాయవలయు. వ్యయంబులలో మూల్యాదులను వేర్వేఱ నా పఙ్క్తియందు వ్రాయుచు వ్యాప్య వ్యాపకంబులు రెండును విశేషించి యున్నపుడు మీఁది బంతుల మొత్తమును గ్రింది వరుసయందు వ్రాయవలయు. బహువృత్తియు నవయవియు వ్యాపకంబును న్యూనవృత్తియు నవయంబులు వ్యాప్యంబును నగు. సజాతీయంబులగు నాయంబులయు వ్యయంబులయు సముదాయ లేఖనంబును మొదట యథాప్రాప్తంబుగ సముదాయ లేఖనంబును గావింపవలయు. ఈ లేఖ్యంబు స్థానవివరణంబును దక్షిణది సంఘవివరణంబు ననంబడు. ఆయంబులివి వ్యయంబులివి మిగిలిన దింతయని విభాగజ్ఞానంబు దీన స్పష్టంబుగఁ గలుగఁదగు. ముందు యథాప్రాప్తంబుగ నాయవ్యయపదార్థంబుల లిఖియించి పిమ్మట వాని వివరణంబు లిఖియింపవలయు. లేఖ్యంబులయందుఁ దిథులు వ్యాప్యంబు లయ్యు గ్రహింపఁగఁదగినవి. ఈ లేఖ్యంబుల నిశ్చితాన్యస్వామికంబులు నితర గతాయంబులుఁ బునరానర్తకంబులు నన్ని విధంబులయిన వ్యయంబులు వాని మొత్తంబులు వ్రాసి వ్రాసినవారి చిహ్నంబులంతోడను బైయధికారుల ముద్రలతోడను ముద్రింపవలయు. ఇ ట్లెల్లవారికి స్మృతిసాధనం బయిన లేఖ్యంబు సెప్పె.

విశ్వేలు మానంబులయుఁ గాలంబులయు స్వరూపము

గుంజామాషకర్షపదార్థప్రస్థంబు లను పరిమాణంబుల నొకదానికంటె నొకటి క్రమంబుగ దశగుణాధికం బగు. అయిదుప్రస్థంబు లొక్క యాఢకంబు (కుంచము). ఎనిమిది యాఢకంబు లొక్కయర్మణంబు నిరువది యర్మణంబు లొక్క ఖారియు నగు. ఇప్పరిమాణంబు దేశభేదంబున భేదిల్లు. ఆయి దంగుళంబుల లోఁతును నాలుగంగుళంబుల వైశాల్యంబును గల పాత్రంబు ప్రస్థంబునఁ జతుర్థభాగం బగు. సంఖ్య యొకటి మొదలు పరార్థంబు దనుక నుండు. అంతకంటె నధికంబు లేదు గావుననే బ్రహ్మాయాయువు రెండుపరార్థంబు లందురు. అంకంబులయందు దక్షిణపుగడనుండి వామభాగంబునకు లెక్కింప నొకదానికంటె నొకటి దశగుణాధికం బగు. అది యేకంబు దశంబు శతంబు సహస్రంబు నయుతంబు నియుతంబు ప్రయుతంబు కోటి యర్బుదంబు నబ్జంబు ఖర్వంబు నిఖర్వంబు పద్మంబు శంఖంబు నబ్ధి మధ్యమంబు నంతంబు పరార్థంబు నని చెప్పఁబడు.

కాలమానంబు చాంద్రంబు సౌరంబు సావనంబు నని ముత్తెఱంగుల నుండు. సేవకులకు జీవితంబు లిచ్చునెడ సౌరమానంబును ధనధాన్యాది వృద్ధులయందుఁ జాంద్రమానంబును 'రోజుకూలి' యందు నవధియందును సావనమానంబును గ్రాహ్యంబు లగు.

భృతివిభాగము మొదలగునవి

కార్యమానయుఁ గాలమానయుఁ గార్యకాలమితియు నని భృతి ముప్విధంబుల నుండు నని తజ్జ్ఞులు చెప్పుదురు. ఎట్టి

భృతియైనఁ జెప్పిన ప్రకారము రాజు తప్పక యిచ్చునది. ఈ భారం బిచటనుండి యచటికిఁ జేర్చునది, యీ కార్యంబు సేఁత కింత సొమ్ము నీకిచ్చెదనని నియమించి కార్యసమాప్తి యయిన తరువాత నిచ్చునది కార్యమానభృతియని విజ్ఞులు వక్కాణింతురు. భృత్యులఁ గార్యంబుల నియోగించి వత్సరాంతంబుననే మాసాంతంబుననే దినాంతంబుననే నింత వేతనం బిచ్చెదనని చెప్పి యట్లిచ్చునది కాలమానభృతి యనియు నిక్కార్యం బింతకాలంబునఁ జేయునది యనియు దీని కింత ద్రవ్యంబు నీకిచ్చెదననియు నేర్పఱచి సాంగం బయినపిదప నిచ్చునది కార్యకాలమితంబయిన జీతం బనియుఁ జెప్పుదురు.

రాజు వేతనంబునకు లోపవిలంబంబు లొకప్పుడేనియుఁ గావింపక నియతకాలంబున నిచ్చుచుండునది. పనిచేయునొక్కనిపోషణంబునకుఁ దగిన భృతి యధమం బనియు నతఁడవశ్యము పోషింపఁదగినవారికి నతనికిని వస్త్రాదులకుఁ బోషణంబునకుఁ జాలిన భృతి మధ్యమం బనియు నతని నతనిపోష్యులను సేవకులను నేకొఱంత లేకుండ రక్షింపఁదగిన భృతి యుత్తమం బనియుఁ జెప్పంబడు. రాజు భృతకుని కార్యకౌశలంబు సద్గుణసంపత్తియుఁ బరీక్షించి యతని జీవితంబు నాత్మహితార్థంబు జతనంబున నెచ్చించుచుండవలయు. కొలువుకాని యనుజీవివర్గం బెల్ల నతని వలనన సుఖంబుగ జీవింపవలయుఁ గాన సద్భృత్యునకు భృతి రాజల్లేర్పఱుచునది. తక్కువ జీతముగల సేవకులు రాజునకు స్వయంకృతశత్రులు గాన వారు ఛిద్రంబులయందుఁ బరకార్యసాధకు లయి కోశాదుల హరియింత్రు; ప్రజలబాధింతురును. మాంసభోజను లయిన నీచ

సేవకులకు సన్నవస్త్రంబులకుఁ దగినసొమ్ముకంటె నధికం బొసఁగినఁ బాపం బగుంగావున వారిజీవితంబు తావన్మాత్రంబ యగునట్లు జేఁసు నిర్ణయింపఁదగు. బ్రాహ్మణుఁ డపహరించిన ధనంబును లోకాంతరోపకారియు, శూద్రున కిచ్చినధనం బేని యు నరకకారియు నగు నని యెఱుంగునది.

## సేవకభేద భృతిభేదములును సేవకులు పనిచేయవలసిన కాలము

కొలువరు లెల్లను మందమధ్యశీఘ్రభేదంబునఁ ద్రివిధులు. వారిభృతియు నధమంబు, మధ్యమంబు, శ్రేష్ఠంబు నయి యుండవలయు. జేఁసు భృత్యుల నెల్లరఁ బగటికాలంబున నొక్కజాము స్వగృహకృత్యంబు నిర్వర్తింపను రేయి మూఁడుజాములు నిద్రింపను విడిచి తక్కిన కాలంబున వారిచేఁ బని గొనవలయు. దినభృత్యునిఁ బగట నాల్గుగడియలు వదలి పని గొనునది. మఱియు నుత్సవదివసంబులయందును బితృదినంబుల యందును వారికి సెలవొసంగు చుండవలయు. అయిదేండ్లు తప్పక కొలువుచేసిన సేవకుఁడు రోగార్తుఁడయ్యెనా నాల్గింట మూఁడుభాగంబులు జీతమిచ్చుచు మూఁడుమాసంబుల దనుక ననుజ్ఞ యీఁదగు. మఱియు నతఁడు దీర్ఘవ్యాధియుతుం డయిన నాఱుమాసంబు లట్లు సెలవీయవచ్చు. సంవత్సరంబు దాఁక నయినఁ బ్రతినిధిని గ్రహింపక సెలవీఁదగదు.

## రాజు సేవకుల కీవలయు సెలవులు

మఱియు వర్షపంచకంబుకంటెఁ దక్కువకాలంబు నెక్కువకాలంబు సేవసేసినవారికి సేవాతారతమ్యంబున ననుజ్ఞ యీవలయు. ఆఱుమాసములకంటె నెక్కువకాలంబు సేవ

కునకు భృతియిచ్చుచు నెల పీ నసర్థాంబు. రోగపీడితున కొక్కవార మైన మొదలఁ బూర్ణముగ వేతనం బిచ్చుచు సెలవిచ్చునది. మిగుల సద్గుణసంపన్నుం డయిన భృత్యుఁడు రుగ్ణుఁడయిన నతనికి భృతియం దర్ధంబు నీవలయు. భృత్యునకు వత్సరంబున కొకసారి యొక్కపక్షంబు జీవితం బొసఁగుచు ననుజ్ఞయీావచ్చు. నలువది యేండ్లుకొలువుచేసినవానికి నృపుఁడు సేవ సేయకుండ యావజ్జీవంబు నతని బ్రదిమికి వేతనంబునం దర్ధంబు నీవలయు. అతనికిఁ గార్యాక్షముండు బాలుఁడు నగు పుత్త్రుఁ డున్నను సుశీల యగు భార్య యయిన నట్టి కన్యయైన నున్న నతని భృతియందు జతుర్థాంశంబు వారిజీవనార్థం బిచ్చు చుండవలయు. రాజుకొలువుకాండ్ర కెల్లఁ బ్రతివత్సరంబు వారి వారి భృతి నెనిమిదవ యంశంబు పారితోషికంబుగ నిచ్చుచు నెక్కువ కార్యంబు సేసిన సరగఁ బారితోషికం బిచ్చుచు స్వామి కార్యంబున హతప్రాణుండైన వానిపుత్త్రునకు బాల్యంబు వదలు నంతవఱకు వానితండ్రి భృతి యిచ్చి రక్షించుచుం బిమ్మట వాని గుణంబులఁ బరిశీలించి తండ్రి వేతనంబున నాల్గవయంశం బేని యాఱవ యంశం బేని యీాఁదగిన సేవను నియోగించి రక్షిం చుచు రెండు మూఁడేండ్లయిన వెనుకఁ దగినయెడఁ దండ్రి జీతంబంతయు నేని సగం బే నీఁదగు.

రాజు భటులకు విరోధము ననురాగముం గల్గించు విధము

రాజు వాక్పారుష్యంబునను, నల్పభృతిని, బ్రబల దం డంబున నపమానంబునను సేవకులకు శత్రుత్వంబు నేర్పు. భృతిచే సంతుష్టులును మానంబున నభివర్ధితులును మృదు వాక్యంబుల సాంత్వితులు నగుభృత్యులు రాజును విడువ

నోపరు. అధములు ధనంబును మధ్యములు ధన మానంబు లును నుత్తములు మానంబుం గోరుదురు; వారికి మానంబ ధనంబు గాదె. రాజు గుణసంపన్ను లయిన సేవకులలోను బ్రజలలోనుఁ గొందఱ వారి కభీష్టంబు లయిన ధనాది దానంబులను మృదుమధుర వచనంబులను, మఱికొందఱ హాస్యవచనంబులను గొందఱ నపాంగవీక్షణంబునను, గొందఱ భోజనంబుల నింకఁ గొందఱఁ దాంబూల వసనాదులఁ గొం దఱ వాహనాది దానంబులను గొందఱ నాభరణాది దానం బులను, గొందఱ నుపకార కీర్తనంబునను, గొందఱ నపరాధ సహానంబునను, గొందఱ ఛత్త్రాతపత్త్ర చామర దీపికాది దానంబునను, గొందఱ భక్తిని, గొందర జ్ఞానంబునను, గొందఱ సన్మానంబునను, గొందఱఁ బ్రేమంబునను, గొందఱ నర్ధాసన దానంబునను, గొందఱ సమీపోప వేశనంబునను, గుణ తారతమ్యంబున రంజించు చుండవలయును.

### రాజు సేవకుల కెట్టివస్తువు లీవలయుు

రాజు స్వకార్యంబుల నియుక్తులయినవారి కెల్ల జనులు దూరంబునన చూచి వీ రిట్టి యధికారులని యెఱుఁగ సువర్ణం బున నేని, రత్నంబుల నేని, రజతంబున నేని, రీతినేఁ దామ్రం బున నేని, లోహంబున నేని, యధికారతారతమ్యంబున రచి యింపఁబడిన గుఱుతు లగు వస్తువులను, వస్త్రంబులను, శిర స్త్రాణంబులను, స్వలాంఛనలాంఛితంబులఁ గావించి బహు మానపూర్వకంబుగ నీయఁదగు. మఱియు సేవకుల కెల్ల వాహనంబుల వాద్యంబుల వస్త్రంబులఁ బరస్పరవిలక్షణంబు

లయినవాని వేర్వేఱ నొసఁగవలయు. కాని విశిష్టంబగునె స్వచిహ్నంబు (బిరుదంబు) నేరికి నీఁదగదు.

### పురోహితాదులయు గ్రామాధికారులయు జాతినిరూపణము

మున్ను సెప్పిన పురోధ మొదలగు ప్రకృతులు పదుండ్రును బ్రాహ్మణుల కావలయు. వారు తగినవారు లభింపకున్న క్షత్రియులు వైశ్యులు నా నియోగంబునకుం దగుదురు గాని గుణవంతు లయ్యు నితరు లక్కార్యంబు సేయఁదగరు. గ్రామంబుల భాగహారియు సాహసాధిపతియు క్షత్త్రియుండ కావలయు. గ్రామణిత్వంబునకు విప్రుండ తగు. కాయస్థుండ లేఖకుండు గావలయు. సుంకంబు గొనువాఁడు వైశ్యుండును బ్రతిహారుఁడు శూద్రుండు నుండవలయు. సేనాధిపతి బాహుజుండ కావలయుఁగాని సంభవింపనినాఁడు బ్రాహ్మణుండును గాఁదగు. ఈ యధికారంబునకు వైశ్యాదులు భీరువులు నెప్పుడుం దగరు. మఱియు నీ కొలువునకు నే కొలంబువా రయినను శూరుల తగుదురు. రాజు లేకొలపువా రగుదు రాజాతివారు సుఖియింతురు.

ఉపకారంబు స్మరియింపక నుసేవనంబునఁ దుష్టినొందక కథాంతరంబులఁ దలంపక, కోపించి నెఱకుల నాటనాడుచు సర్వదా శంకించు రాజును భృత్యుండు విడువవలయు.

ఇది శుక్రనీతిసారంబున నాంధ్రీకృతంబున యువరాజాది లక్షణకథనం బనునది ద్వితీయాధ్యాయము.

శ్రీరస్తు

# శుక్రనీతిసారము

## తృతీయాధ్యాయము

### మనుజుఁడు లోకుల సంతసిల్లఁజేయు విధము

పూర్వాధ్యాయంబున రాజుయొక్కయుఁ దత్సేవకుల యొక్కయుఁ బ్రవర్తనం బుపదేశించి యీ యధ్యాయంబున సర్వసాధారణమైన నీతిఁ జెప్పుచున్నాఁడు.

ఎల్ల జంతువులకుఁ బ్రవృత్తులు సుఖార్థంబ కావునను, సుఖంబు ధర్మంబు వదలిన నొదవమిని నరుండు ధర్మపరుండు గావలయు. వేదప్రతిపాద్యంబై ప్రయోజనవంతంబగు నర్థంబు ధర్మంబు నాఁబడు. ఏవాఁడునుఁ ద్రివర్గశూన్యంబైన కార్యం బాచరింపఁజనదు. త్రివర్గంబునందును బరస్పర బాధనంబు చేయందగదు. మనుజుండు మలాయనుండు గావునఁ బ్రాత స్స్నానశీలుండును సుసురభిగంధుండు సువేషుండు ననుల్బణో జ్జ్వలవేషుండును నీచరోమన ఖశ్మశ్రువునై యెల్లధర్మంబుల ననుమోదించి యాచరించుచు నాత్మరక్షణార్థంబు సతతంబు సిద్ధమణి మంత్రౌషధంబుల ధరియించుచు సంచరించునపుడెల్ల నాతపత్రంబు పదత్రాణంబులు ధరియించి యుగమాత్ర దర్శనుండై చరించుచుండ వలయును. రేల సంచారంబు దగదుగాని

యాత్యయికంబైన కార్యంబు తటస్థించిన దండంబును శిరస్త్రా
ణంబును గూడ ధరియించి చరించునది. వేగితుండై యన్య
కార్యంబునకుఁ బోవవలదు. బలంబువలన వేగంబుల నిర్బంధిం
పనురాదు. ఇతరజనంబులకుఁ బరాఙ్ముఖుండై తనకు మేలు
సేయు మిత్రుల సేవింపవలయు. హింసయు, స్తేయంబు, పై
శున్యంబు, అన్యథాకామంబు, పారుష్యంబు, నన్ఋతంబు, సంభి
న్నాలాపంబు, నవినయంబు, దుస్సంకల్పంబు, మిథ్యాదృ
ష్టియు ననుపదియుం బాపకర్మంబులు గాన వాని నరుండు
మనోవాక్కాయంబులఁ ద్యజించునది. శక్తికొలఁదిఁ బుణ్య
కార్యంబులకు యత్నించువాఁడుఁ బాపకార్యంబులకు య
త్నించువాఁడు నొకప్పుడు సాధన సామగ్రి చాలమి సిద్ధిం
బడయ లేకున్ననుఁ దత్ఫలంబుఁ దప్పక పొందుదు రని ధర్మ
విదులు వక్కాణింతురు గాన మనుజుండు సత్సంకల్పుఁడు
గావలయు. దీనులకు రోగులకు శోకార్తులకును బలాను
సారంబుగ నుపకరించుచుఁ గీటపిపీలికంబు సైతము
తన్నుంబోలెఁ జూచుచు నపకారపరు లైన పరుల కేని యుప
కారంబు కావింపన కోరుచు మానవుండు సంపదయందు
నాపదయందు నేకమనస్కుండై ఫలంబునం గాక హేతువు
నందు నూరసంబుఁ జెందుచు నుచితకాలంబున హితంబు
మితంబు నవిరుద్ధంబు పేశలంబు నగుపల్కు పలుకుచుఁ
బూర్వభాషియై సుముఖుండు సుశీలుండు సకరుణుండు నై
వర్తింపవలయు. సుఖియై యొక్కఁడు నొక్కచో నుంటయు
నెల్లరయందు విశ్వాసంబును నన్నిచోట్ల ననర్థశంకయుఁ దన
పగఁ బ్రకటించుటయు దా నిట్టివారికి దాయ ననుటయుఁ

బ్రభువునకుఁ దనయందలి నిస్స్నేహత్వంబుఁ దన యువమాన ప్రకాశనంబును మనుజునకుఁ దగవు. జనుండు పరారాధన పండితుండై యెవ్వఁడెట్టివితంబున సంతసించు నవ్విధంబు గ్రహియించి యనువర్తింపవలయు. ఇంద్రియంబుల మిగులఁ బీడింపను లాలింపను దగదు. బలవంతంబుగ నవి మనంబును హరియించు. ఏణగజపతంగ భృంగ మీనంబులు శబ్దస్పర్శ రూపగంధరసంబులచే మోహితంబులై హతంబు లగుట చూచుచుంటిమి. శబ్దాదులయందు వరవర్ణినీ స్పర్శనంబు మునులకేని స్వాంతహారి గాన నప్రమత్తుండై సమయోచితంబుగ విషయంబుల సేవించునది. తల్లితోడనేని చెల్లెలితోడనేని కూఁతుతోడనేని యేకాంతంబునఁ దడవు వసించుట పురుషునకుం దగదు. కార్యానుసారంబుగ వారిం బిలిచి తగిన ట్లాదరపూర్వకంబుగ సంభాషించుచు బంధుస్త్రీలనేని యన్యకాంతలనేని సోదరీపర్యాయంబులఁ బిలుచుచుండునది. మఱియు స్త్రీల నెల్లపుడు గృహకృత్యంబుల నియమించుచుఁ బరపురుషులతో సహవాసంబు సేయను, బ్రకాశంబుగ నైన భాషింపను నన్యగృహంబునకుఁ బోవను వారికి స్వాతంత్ర్యంబు క్షణంబైన నెక్కాలంబునను దండ్రియేని మగఁడేని కొమరుఁడేని మామయేని చుట్టములేని ఱేఁడేని యీఁదగదు. దండశీలుఁడు చండుఁడు మండుఁడు నకాముఁడు చిరప్రవాసి సుదరిద్రుఁడు పరస్త్రీరతుఁడు రోగియు నగుపతినిఁజూచి స్త్రీలు విరక్త లగుదురు; వేఱొకనే నాశ్రయింతురు. కాన నిట్టి దుర్గుణంబుల విడిచి పురుషులు సుయత్నంబున స్త్రీల రక్షింపవలయును. మఱియు వస్త్రాన్నభూషణమృదువాక్యంబుల వారి

సన్మానించుచు నెప్పుడు నింతులం బుత్రుల సన్నిధిన రక్షించు చుండవలయు. మనుజుండు చైత్యపూజ్యధ్వజాప్రశస్తచ్ఛాయలను భస్మంబు నుముకయు నశుచిపదార్థంబులను శర్కరాలోష్టంబులను బలిస్నానభూముల నెకప్పుడేనియు నాక్రమింపఁ జనదు. నది నెన్నఁడు బాహులతోఁ దరింపఁ దగదు. స్కన్నం బగునగ్నికే నభిముఖంబుగఁ బోవలదు. శీర్ణతరిని శిథిలవృక్షంబును దుష్టయానంబును నారోహింపఁజనదు. నిష్కారణంబుగ నుంగుటంబున భూలేఖనంబును నిరుగేలం దలగోఁకుటయు నంగంబుల విగుణంబుగఁ గదల్చుటయుఁ జెట్టయగు. శ్రమంబు గలుగుటకు ముందే మనోవాక్కాయచేష్టల నుడుగునది. ఊర్ధ్వజానువై చిరం బాసీనుండుగాఁజనదు. రాత్రుల వృక్షసేవయు ముంగిటం బరుండుటయు, రచ్చకుం జనుకంబునకుం బోవుటయు, గంజాప్రవేశంబును హానికరంబులు. శూన్యాటవీ శూన్యగృహ శ్మశానంబులం బవలును సేవింపఁజనదు. ఎల్లపుడు సూర్యు దర్శించుటయు శిరంబున భారంబు మోచుటయు సూక్ష్మవస్తువులను దీప్తవస్తువులను నమేధ్యాప్రియవస్తువులను జూచుటయు సంజల నభ్యవహార స్త్రీస్వప్నాధ్యయనచింతనంబులును దగవు. మద్య విక్రయ సంధానంబు లొకప్పుడేనియుం దగవు. బుద్ధిమంతులకు లౌకిక కార్యంబులయందు లోకంబ గురువు గాన నెల్లకార్యంబుల యందును బరీక్షకుండు లోకంబు ననుకరించునది. రాజుల యాచారంబును దేశంబు నాచారంబును కులాచారంబును బంధుల యాచారంబును వేదవిహితాచారంబును దూషింపఁ గీడగు. మనుజుండు శక్తుఁడయ్యు లోకాచారంబు నుల్లం

క్షింపఁ జనదు. ప్రమాదంబున నయుక్తం బగుకార్యంబు సేసియు నట్టిపల్కు పల్కియు యుక్తులచే దాని సమర్థింప జతనంబు సేయఁదగదు. ప్రత్యక్షంబున దుర్గుణంబుల వక్కాణించువారు విరళులు గాన ధీమంతుఁడు లోకంబునను శాస్త్రంబువలనను నిషిద్ధంబుల నెఱిఁగి త్యజింపవలయువానిఁ ద్యజించునది.

న్యాయకార్యంబుం బోలిన యన్యాయకార్యంబు మనంబుననేనిఁ జితింపం దగవుకాదు. పెక్కు లపరాధంబుల నేఁ జేసితి స్వల్పాపరాధంబున నా కేమి యగు నని కొంచెపు టపరాధంబును సాహసించి చేయరాదు. బిందువుచేత నైనను ఘటంబు పూరితం బగుఁ గాదె. సేలుంబగళ్లును నే నేమిపని చేయుచుండఁ గడచుచున్నవి యని చింతించుచుఁ వ్యర్థంబుగ గాలక్షేపంబు సేయనివాఁడు దుఃఖభాజనంబు గాఁడు. సమాసాదిభేదంబునను బుద్ధివిశేషంబునను నర్థవిశేషంబుఁ గల్పింపక యర్థవాదంబులు త్యజించి గ్రంథంబుల సారంబు గ్రహించుచు ధర్మతత్త్వంబు గహనంబు గావున నరుండు విచక్షణుండై సత్సేవితంబును శ్రుత్యాదిప్రసిద్ధంబు నగు కర్మంబుఁ గావించునది. రాజవిరుద్ధుం డగుమిత్రు నేని గురునేని సుతు నేని దాఁపఁదగదు. మఱియు నధర్మనిరతుని స్తేనుని నాతతాయిని రక్షింపఁజనదు. అగ్నిదుండు, గరదుండు, శస్త్రోన్మత్తుండు, పారదారికుఁడు, క్షేత్రాపహర్తయు, ధనాపహర్తయు నను నార్వురు నాతతాయులు. బాలుని, రోగంబును, స్త్రీని, దాసుని, పశువును, ధనంబును, విద్యాభ్యాసంబును, సత్సేవనంబును క్షీణంబయిన

నేమఱుం జనదు. ఏదేశంబున రాజును ధనికుండును శ్రోత్రి
యుండును భిషగ్వరుండును దనకు విరుద్ధు లగుదురు మఱియు
నెద్దేశంబునకు బాలమూర్ఖసాహసు లధికారు లగుదు రెచటి
యాచారంబు దన కసమ్మతం బగు నెచటిరాజవివేకియు
సభ్యులు సాక్షికులు విద్వాంసులు త్యక్తసన్మార్గులు సాక్షు
లనృతవాదులు నగుదు రెచట స్త్రీలకు దురాత్ములకు నీచు
లకుఁ బ్రాధాన్యంబు గలుగు నచట ధనమానజీవితంబులను
వాసంబును బ్రాజ్ఞుండు కోరం దగదు. తల్లి బాల్యంబున
రక్షింపకున్నను దండ్రి బాగుగ శిక్షింపకున్నను రాజు
విత్తంబు హరియించినను సుసేవితు లైన మిత్రస్వజనబాంధ
వులు కోపించినను దర్పంబున నాప్తవాక్యంబు నాదరింపమి
విపరీతఫలంబు ప్రాప్తించినను దుఃఖంబు వొందిన నిష్ప్ర
యోజనంబు. మనుజుండు సావధానుండై రాజును దేవతలను
గురువులనుఁ దపస్వులను ధర్మవృద్ధుల జ్ఞానవృద్ధుల నగ్నిని
నిత్యంబు సేవించునది. మాతాపితలతోడను గురులతోడను
స్వామితోడను భ్రాతలతోడను బుత్త్రులతోడను జెలికాండ్ర
తోడను మనంబున నేని విరోధింపం దగదు. మఱియు వారి
కపకరించుట యెన్నండుం దగదు. స్వజనంబుతోడను బలీయు
సునితోడను స్త్రీ బాలమూర్ఖులతోడను వివాదింపఁదగదు.
స్వాదుభోజనంబును, నర్థచింతనంబును, మార్గగమనంబును,
పెక్కండ్రు నిద్రింప మేల్కొని యునికియు నొక్కనికిఁ దగవు.
ఒకప్పు డేని యన్యధర్మంబు సేవించుటయుఁ దెగడుటయుఁ
హీనకర్మగుణ లగు స్త్రీలతో నేకాసనంబున నుండుటయుఁ
గీడులు. శ్రేయస్కాముం డగువాఁడు నిద్రాతంద్రలును క్రోధ

భయంబులు నాలస్యదీర్ఘసూత్రతలు నను నాఱుగుణంబులు కార్యవిఘాతుకంబు లగుట విడువవలయు. మనుజుఁ డుపాయజ్ఞుఁడునుఁ దత్త్వజ్ఞుఁడు యోగజ్ఞుఁడు స్వధర్మనిరతుఁడుఁ బరస్త్రీపరాఙ్ముఖుండు వక్తయు నూహాపోహావిచక్షణుఁడును నప్రతిహతవచనుండును జిత్రకథాజ్ఞుఁడు నై చిరకాలంబు విని శీఘ్రంబు గ్రహియించి యెల్లకార్యంబులఁ బ్రవర్తించునది గాని యిచ్ఛానుకూలంబుగ నొకప్పుడేనియుఁ గార్యంబు సేయంజనదు. క్రయవిక్రయంబులం దతిలిప్సయు స్వదైన్యంబు నెన్నఁడు ప్రకటింపఁదగదు. కార్యంబు లేనపు డననుజ్ఞాతుఁడై యన్యగృహంబులకుం బోవలదు. అననుయుక్తుండై యెవ్వనికిని గృహకృత్యం బుపదేశింపఁ దగదు. బహ్వర్థంబు నల్పాక్షరంబు కార్య సాధకంబునగుపల్కు పల్కునది. లోకానుభవంబునకు విరుద్ధంబుగ స్వాభిమతంబు పగటంజనదు. పరాభిప్రాయంబు బాగుగ నెఱిఁగి యనుజ్ఞాతుఁ డయి యుత్తరం బుపక్రమించునది. దంపతుల కలహంబునందును బితృపుత్త్రుల కలహంబునందును సాక్ష్యం బసంగీకార్యంబు.

మనుజుండు సుగుప్తుండుఁ గృతమంత్రుండు నై శరణాగతు విడువక శక్తికొలఁది గార్యంబు సేయఁదలఁచుచు నెవ్వని నెఱుఁకులు నొనాడక యాపదల మోహంబునొందక యమంగలంబులు వ్రీడాకరంబులు నిరర్థకంబులు నగు వాక్యంబుల నుడుగుచు, లోకవిద్విష్టంబు ధర్మ్యంబైనను వదలుచు నెట్టివాని వాక్యంబేని తన హేతువులచే ఖండింపక యెవ్వఁడేమి యడిగిన సాహసింపక విచారించి యుత్తరం బిచ్చుచు శత్రువులవేనియు సుగుణంబుల గ్రహించుచు గురువులవేనియు

దుర్గుణంబుల విడుచుచు నుత్కర్షాపకర్షంబులును గలిమిలేము లును బ్రాక్కర్మవశంబునఁ బ్రాప్తంబు లగుఁ గావున నితరుల నిందింపక, సర్వభూతంబులతోడ మైత్రి నెడపకుండునది.

మనుజుఁడు దూరదృష్టి కలవాఁడు గావలయు

ఎల్లపుడు దీర్ఘదర్శియై యొకప్పుడు ప్రత్యుత్పన్న మతియు సాహసియు నగుచు దీర్ఘసూత్రుం డెన్నండునుం గాక చరియించిన సుఖియించు. మహాఫలంబైన కార్యంబు సేయ యత్నించువాఁడు దీర్ఘదర్శియైనఁ జిరకాలంబు సుఖి యించు. ప్రత్యుత్పన్నమతి కాలానుసారంబుగఁ గార్యంబు నిర్వర్తించుఁ గాని చాంచల్యంబునను గార్యగౌరవంబునను సిద్ధి సంశయగ్రస్త యగు. కాలంబున యత్నింపక దీర్ఘసూత్రుం డయ్యెనా నశియించు. క్రియాఫలంబు నెఱుఁగక మహాకాలం బున నల్పకర్మంబు గావించుసాహసి పశ్చాత్తాపంబు నొందుఁ గావున నెల్లవాఁడు దీర్ఘదర్శి గావలయు. ఒకప్పుడు సువిచారి తంబైన కార్యంబున నల్పఫలంబును నవిచారితంబైన కార్యం బున మహాఫలంబు నైనను సాహసించి చేసినకార్యం బనర్థ కారియె యగు. సత్కార్యంబున ననిష్టఫలంబును నసత్కా ర్యంబున నిష్టఫలంబు నొకప్పుడైనను నవియు నసత్కార్యం బునకుఁ బ్రేరకంబులు గావు.

మిత్రప్రశంస

భృత్యుఁడు, పత్నియు, భ్రాతయుఁ, బుత్త్రుండును నెకార్యంబునకు సమ్మతింప రద్దాని నవిశంకితుండై మిత్త్రుండు సేయు. ఎవఁడైనను మందప్రజ్ఞుఁడై సత్యం బెఱుఁగక పరుని

మిత్రుఁడని నమ్మి స్వకార్యంబున నియోగించువాని కార్యంబు నశియించు. మానసికంబైన మైత్రి దుర్లభంబు గావున నది సిద్ధింప మహాప్రయత్నంబు సేయునది. ఎల్లవారికి ధనస్త్రీ రాజ్యలోభంబు బలవంతంబు గావున నమ్మఁదగిన పుత్రునేని భార్యనేని సోదరునేని యమాత్యాద్యధికారులనేని యత్యంతంబు విశ్వసింపఁదగదు.

ప్రామాణికుని ననుభవంబున నెఱిఁగిన యాప్తునిఁ దన్నుంబోలె నమ్మి గూఢంబుగ వాని కార్యంబులఁ బరిశీలించుచు నట్టివారి వాక్యంబున ననర్థంబు చింతింపక స్వధర్మపరులతోడను నీతిబలసంపన్నులతోడను మైత్రి సేయుచుండవలయు.

విద్యాదులవలని గర్వము

పూజ్యుల దానమానసత్కారంబుల నెపుడుం బూజించుచు దండాధిక్యంబునను బరుషవచనంబునను నాలుబిడ్డలుం బీడనొందుదురు గావునను బశువులును దానమృదుభాషణంబుల వశంబు లగుం గావునను బరుషవచనాదుల నుడుగుచు విద్యాశౌర్యధనాభిజనంబులచేతను బలంబుచేతను మత్తుండు నభిమానియుఁ గాక ప్రవర్తించునది. విద్యామత్తుఁ డాప్తోపదేశంబు యుక్తులచే నిరసించి విననొల్లక మహాజనుల మార్గం బుల్లంఘించి స్వాభిమతం బనర్థంబయ్యు మహార్థంబ కాఁ దలఁచు. శౌర్యమత్తుండు వ్యూహాది యుద్ధకౌశలంబు త్యజియించి సాహసంబున యుద్ధంబు సేసి యసువుల విడుచు. శ్రీమత్తుం డజంబు స్వమూత్రగంధంబుంబోలెఁ దన దుష్కీర్తి నెఱుంగఁడు. అభిజనమత్తుం డెల్లవారి నవమానిం

చుచు నకార్యంబున బుద్ధి నిలుపు. బలమత్తుఁ డెల్లవారి బాధించు. మానమత్తుఁడు జగంబు తృణంబుగఁ దలఁచుచు ననర్హుం డయ్యు నెల్లవారలకంటె నుత్తమాసనం బపేక్షించు. విద్యాధనులు సజ్జనులకు దమహేతువులును గర్వితులకు మద హేతువులు నగు.

### విద్యాదిఫలము

విద్యకు జ్ఞానవినయంబులును శ్రీకి యజ్ఞదానంబులును బలంబునకు సద్రక్షణంబును శౌర్యంబునకు శత్రుశమనం బును నభిజనంబునకు శమదమార్జవంబులును మానంబునకు నెల్లవారియెడ నాత్మసమభావంబును ఫలంబు లగు. సువిద్య యు మంత్రంబును భైషజ్యంబును స్త్రీరత్నంబును సాధకుండు మానంబు వర్జించి దుష్కులుని వలననైనను గ్రహింపందగు.

### మనుజుఁడు చేయవలసినవి – విడువవలసినవి

ఏవాఁడును బోయిన దానికి వగవక ప్రాప్తంబునకు సంతసించుచు స్త్రీలను బాలురను మిగుల లాలింపక బాధిం పక స్త్రీలను గృహకృత్యములందునుఁ బుత్రుల విద్యాభ్యా సంబునను గ్రమంబున నియోగించునది. పరద్రవ్యం బదత్తం బల్పంబైనను గ్రహింప మహాఘంబగు. ఇతరుల పాపకార్యంబు నుచ్చరించుటయు స్త్రీల దూషించుటయు నకృత్యంబులు. సాక్ష్యంబున ననృతంబు వలుకుట నరకహేతువు. మహా కార్యంబు సాధించునప్పుడును బ్రాణాత్యయంబునను ననృతంబు వల్కుట దూషణీయంబు గాదు.

కన్యాదాతకు నిర్ధనుని, జోరునకు సధనుని, జిఘాంసు నకు గుప్తుని, నెఱిఁగియు వెలువరింపఁ దగదు. భార్యాభర్తల

కును సోదరులకును మిత్రులకును గురుశిష్యులకును స్వామిభృత్యులకును వైరంబు పుట్టింపం జనదు. మాట్లాడువారి నడుమ నుండి యేగుట పాతకంబు. సుహృన్మునకు బంధునకు సోదరునకు యథాశక్తి యుపకరింపవలయు. గృహాగతుండు క్షుద్రుండయ్యు శక్త్యనుసారంబుగఁ గుశలప్రశ్నంబునను బాద్యాదులను సత్కార్యుండగు. సపుత్రకుం డగువాఁడు పుత్రవతి యగుపుత్రికను జీవద్భర్తృకయగు సోదరినిఁ దనయింటఁ జిరకాలం బుండ నీఁదగదు. వారనద లైనఁ దప్పక రక్షించునది. సర్పంబు క్రూరంబగుటను నగ్ని తీక్ష్ణంబగుటను రోగంబు వృద్ధిఁ జెందుటను నల్పంబు లయ్యు ననుపేక్ష్యంబులు.

నరుండు రాజును జామాతను శత్రులను భాగినేయుని బాలురయ్యు దణ్డభయంబునను బుత్రికాభయంబునను వృద్ధిభయంబునను బితృపిండలోపభయంబునను నాదరంబున నుపచరింపవలయు. ఋణశేషంబును రోగశేషంబును శత్రుశేషంబును మిగుల్పకుండునది. అర్థులచే నర్థితుండయినవాఁడు వారికార్యంబు సమర్థుండయినఁ జేయను జేయింపను దగుం గాని వాఁడియైన యుత్తరంబు పల్కం దగదు. మనుజుండు శూరులయు దాతలయు ధార్మికులయుఁ జరితంబులు జతనంబున వినవలయుఁ గాని వారి ఛిద్రంబుల నన్వేషింపఁదగదు.

మఱియు నియతకాలంబున హితమితాశనుండు విఘసాశనుండు నదీనాత్ముండు సుస్వప్నుండు శుచియు నెల్లపుడు వ్యవసాయియు సుఖవ్యాయామాభ్యాసియు నగునది. నరుండు స్వస్థుఁడై యన్నంబు నిందింపక విజనంబున నాహారవిహారంబులు నిర్వహారంబు సల్పుచు షడ్రసంబు మధురోత్తరంబు

నగు నాహారంబు ప్రశస్తంబు గావున నట్టిద గ్రహించుచు స్వదారలతోడన విహారంబు గావించుచు వేశ్యాదుల దెస ననాదరుండై నియుద్ధకుశలులతో వ్యాయామంబు సల్పుచుఁ బ్రాక్పశ్చిమయామంబులు వదలి మధ్యమ యామంబుల నిద్రించుచు దీ నాంధ పంగు బధిరుల నొకప్పుడే నుపహాసింపక దుష్కార్యంబు సేయఁ దలఁపక మానంబు విడిచి బుద్ధి బల ధైర్య పరాక్రమోద్యోగార్జవ సాహసంబుల నెద్దాననేని శీఘ్రంబుగ స్వకార్యంబు సాధించుకొనుచుండవలయు.

దేనఁ గార్యంబు సిద్ధించునట్టి కలహంబు వరంబ కాని నిరర్థకకలహంబు సుఖంబును నాయువు ధనంబు యశంబును హరియించు. బుద్ధిమంతుఁ డేవానికే ననిష్టంబు పల్కను లోపంబెన్నను వృత్తిలోపంబు సేయను దగదు. మఱియు నసత్కార్యంబున నియోగించు గురునేని నిరసించునది.

ఆేని యానతిని మహాత్ముల యాజ్ఞను నొకప్పుడే నుల్లంఘింపఁ జనదు. సత్కార్యబోధకుఁడు లఘీయసుఁ డయి నను మన్నించునది. స్త్రీ లనర్థంబునకుఁ గుదురు గానఁ దరుణియైన స్త్రీకి గృహంబున స్వాతంత్ర్యం బిచ్చి దేశాంతరంబునకుఁ బోవఁజనదు. మదద్రవ్యంబులయందును గుసంతతి యందును బ్రమాదంబును మోహంబును జెందక జాగరూకుండు గావలయు.

గౌరవార్హులు.

మనుజుఁడు సాధ్వియగు భార్యను దల్లిని దల్లిసవతులను బాలను దండ్రిని గోడలిని గతభర్తృకయు ననపత్యయు నగు కూఁతును నట్టి స్వసను మాతులానిని బ్రజావతిని బితృ

మాతృష్వసలను ననపత్యుం డయిన మాతామహుని నట్టి గురుశ్వశురమాతులులను బాలుం డగు తండ్రి లేని దాహిత్రుని నట్టిభగినీసుతుని సోదరులను నవశ్యంబు శక్తికొలది రక్షించునది.

మఱియు వైభవ మున్నను లేకున్నను సుహృన్మునిఁ బితృకులమువారిని మాతృకులమువారిని భార్యకులమువారిని దాసీదాసభృత్యవర్గమును నెట్లయిన శ్రమంపడి తప్పక రక్షించుచు వికలాంగులను బరివ్రాజకులను దీనానాథులను యథాశక్తి పాలించునది. సర్వగుణసంపన్నుం డయ్యు నెవ్వఁడు మహాయత్నంబు కుటుంబభరణార్థము సేయకుండు నతఁడు జీవన్మృతుం డగు. ఏవాఁడు కుటుంబము పోషింపక శత్రుల సాధింపక ప్రాప్తము రక్షింపక యాత్మంభరి యగునట్టివాని జీవితంబునఁ బ్రయోజనం బొకండు లేదు. స్త్రీజితుండును ఋణియు సుదరిద్రుండును యాచకుండును గుణహీనుండును బగఱకు లోఁగినవాఁడును జీవించియు మృతుల యగుదురు.

దాఁపవలసినది

ఆయువును విత్తంబును గృహచ్ఛిద్రంబును దానమానాపమానంబులును మంత్రంబు నౌషధంబును నింతులపొత్తు నను తొమ్మిదియు మనీషులచే గోప్యంబులు.

దేశసంచారాదులవలని ఫలము

దేశాటనమును రాజసభాప్రవేశమును శాస్త్రచింతనమును వేశ్యాదిదర్శనంబును విద్వన్మైత్రియు మనుజున కవశ్యకర్తవ్యములు. దేశాటనమున ననేకధర్మంబులను బదార్థము

లను బెక్కువితములగు పశువులను బర్వతములను నరులను
నెఱుఁగవచ్చు. రాజసభాప్రవేశమున రాజపురుషప్రవర్తన
మును న్యాయాన్యాయములును సత్యవాదులయు మిథ్యావా
దులయు స్వరూపమును లోకశాస్త్రసమ్మతం బయిన వ్యవ
హారప్రవృత్తియు నరుచేఁ దెలియఁబడు. శాస్త్రముల తత్త్వ
చింతచే నరుఁ డహంకారమును ధర్మాధ్యమును విడుచు.
వ్యవహారము మిగుల గొప్పది గావునను నేకశాస్త్రాధ్యయన
మున సర్వవ్యవహారజ్ఞానము వొడమమిని ధీమంతుఁ డెక్కుడు
జతనమునఁ బెక్కులగు నాగమముల నేర్చునది. రోవెలఁది
ప్రజల సొమ్ము గ్రహియించియు వారికి న్వశురాలు గాక
వారి స్వవశమున నుంచునట్లు మనుజుఁడే వారికి నధీనుఁడు
గాక జగంబెల్ల స్వవశంబున నుండునట్లు సేయు సామర్థ్యము
వారవనితాసందర్శనమున నేర్వవలయు. పండితుల చెలికా
రంబున శ్రుతి స్మృతి పురాణార్థవిజ్ఞానముం బ్రశస్తబుద్ధియుఁ
గలుగు.

### అతిథిపూజాదులు

ఆత్మార్థంబు పాకము సేయువాఁడు నరకార్థంబు జీవిం
చుఁ గాన నేఁడును దేవ పితృతిథుల కీక యశనం బేనాఁడును
గుడువంజనదు. నడుచునపుడు గురులకును బలవంతులకును
రాజులకును వ్యాధిగ్రస్తులకును శవంబునకును శ్రేష్ఠునకును
యానారూఢునకును మార్గం బిచ్చి యొరసిలి పోవునది.
మఱియు శకటమునకై దుహస్తములును గుఱ్ఱమునకు నెద్దు
నకుఁ బదిహస్తముల దూరమును నేనుఁగులకు బహుదూర
మును తొలఁగి చరించునది. దీర్ఘంబులగు కొమ్ములేని గోళ్లేని

కోఱ లేని గల మొకంబులను దుర్జనులను యువతులను నదీ కూలంబును నమ్మి యెన్నఁడును సమీపింపఁదగదు.

జనసమ్మతుఁ డగు విధము.

మార్గంబునఁ బోవుచు నములుటయు హసించుచు భాషించుటయు గతంబునకు వగచుటయు స్వకృతంబయిన సుకృతము వాక్రుచ్చుటయు శంకితుల సమీపంబునకుఁ బోవుటయు నీచుల సేవించుటయు మనుజులకుఁ దగని పను లగు. మనుజుఁడు పొంచుండియే వారి సల్లాపంబును వినఁదగదు. వేల్పుల యనుజ్ఞ నొందక సుధాపానంబు సేయ రాహువు శిరము దెగియెఁ గావున నుత్తములచే ననునుజ్ఞాతుం డయి వారితో చేక కార్యము సేయ నిచ్ఛగింపఁ జనదు. అన్యులకుఁ మృత్యుకారణం బయిన విషపానంబు శివునకుఁ బోలె మహాత్ముల కసత్కారంబును భూషణంబ యగు. అగ్ని యట్లు తేజస్వి సర్వపదార్థంబుల భుజించియు దోషి గాఁడు. గురునకు రాజునకుఁ దనకంటె గరీయసుఁ డగు సేవానికి నెదుటఁ గూర్చుండఁదగదు. రాజు తనకు మిత్రుం డని యిచ్ఛానుసారంబుగఁ బ్రవర్తిల్లిన హాని యగు. పండితుఁడు మొఱకులకు స్వామిత్వముకంటె మహాత్ములకు దాస్యం బేని యిచ్ఛయించునది. జ్ఞాన లవ దుర్విదగ్ధుని రంజింపను వానితో విరోధింపను జతనము సేయఁ దగదు. బుద్ధిమంతుఁడు ప్రాప్తంబు లగు కార్యంబుల నాలోచించి యవశ్యంబు లగు వాని ముందు సరగఁ జేసి యనావశ్యము లగు వాని వెనుక విలంబంబునఁ జేయుచు గురువు లాన యిచ్చినను జెమదగ్నమునకు గౌతమ పుత్రుండు పితృాజ్ఞప్తుండైన మాతృవధంబునకుఁ బోలె నాల

సించునది. మఱియుఁ బెరిమ నేని స్తుతివినయంబుల నేని సేవా
కౌశలముల నేని కళలనేని కథల నేని జ్ఞానార్జవంబుల నేని
శౌర్య ప్రత్యుత్థానాభిగమనంబుల నేని స్మితభాషణంబున
నేని యుపకారమున నేని దానమున నేని జగమెల్ల వశపఱిచి
కొనునది. మీఁదటి వశ్యకరము లయిన యుపాయము లన్ని
యు దుర్జనులయెడ నిష్ఫలంబులగుం గాన వానితోడి నెయ్యా
ము వర్జించి ప్రాజ్ఞుఁడు శక్తుఁడయ్యెనా వాని దండంబున
నొండె ఛలభూతము లయిన యుపాయాంతరముల నొండె
జయించునది. సాంగములయిన వేదములను స్మృతి పురాణేతి
హాసములను నభ్యసించు టాత్మహితం బగు. మృగయాక్ష
స్త్రీపానంబులు వ్యసనములు గాన వీని ధీమంతుఁడు పరిత్య
జించి యొకప్పుడు యుక్తిపూర్వకముగాఁ దదాసక్తుఁడు గాఁ
దగు. ఏవానికిని వృత్తిలోపంబును గూటవ్యవహారంబును నహి
తమును మనమునను జింతింపను జేయను దగదు. కాలత్రయ
మునను సుఖదమును దృఢమును మృతుఁడైన స్వర్గమును
జీవించిన నిర్మలంబగు కీర్తిని గావించు కార్యంబు ప్రాజ్ఞుఁడు
సుప్రయత్నమునం గావించునది. ఆధి వ్యాధి బాధితుండును,
జోరుండును బలియునితో వైరంబు గొన్నవాఁడును, విషయా
సక్తుండును, ధనలోలుపుఁడును, మసహాయుండును భిన్నా
మాత్యసుహృజ్జనుండు నగు రాజును నిద్రలేక కుందుదురు.
కాన బాగుగ నాలోచించి మతిమంతుఁ డీలోపంబుల నివారించు
కొని సుఖంబుగ నిద్రింపవలయు. రాజును శ్రేష్ఠజనులను వేష
భాషణాదుల ననుకరింపఁ జెడుగగు. వ్యాఘ్రాది దుష్టసత్వం
బులఁ జోరులను బాధింప నేకాకియై చనంబోలదు. గురువు

నయిన నాతతాయియయిన జిఘాంసువును హింసింప నిచ్ఛగిం చునది. కలహంబున నేవానికిని దోడు సూపందగదు. ఒజ్జల యెదుటను తేండ్లయెదుటను మహాసనంబునఁ గూర్చుండను ప్రౌఢపాదుఁ డయి వారి వాక్యంబులఁ దన హేతువులతో ఖండింపను దగదు.

ఏవాఁడు చేయఁ దలఁచిన కార్యం బితరు లెఱుఁగరు. మఱి యేవాఁడు చేసినకార్యంబు సువిదితంబగు నేవాఁడు తన సుకృతంబును గర్తవ్యంబును బరుల కెఱిఁగింపకుండు నతఁ డుత్తముఁ డగు.

### స్త్రీల దుర్గుణములు

అనృతంబును దెగువయు మాయయు మోఱకుఁదనం బును నశౌచంబును నిర్దయయు లౌభ్యంబును దర్పంబు నను నెన్మిదియు నింతులకు సహజములయిన దుర్గుణంబులు గావునఁ బ్రియురాలిచేఁ జెప్పఁబడిన స్నుషామాత్రాదుల యపరాధం బు ననుభవంబునఁ బరిశీలింపక సత్యంబని యెన్నఁదగదు. పది యునాఱు వత్సరంబులకంటె మీఁదఁ బుత్త్రునిని బదియు రెండు వత్సరములకంటె మీఁద స్నుషాదిస్త్రీజనంబును దాడనంబు నను దుర్వచనంబులను బీడింపఁజనదు.

### రక్షింపవలసినవారు

దౌహిత్రులు, భాగినేయులు, భ్రాతలును బుత్త్రుల కంటె నధికంబుగను స్నుషలు, భ్రాతృభార్యలు, స్వసలు దుహితలకంటె నధికంబుగను బాలనీయులు. గృహపతికుటుం బపోషణార్థంబు పదార్థంబుల నార్జింపను రక్షింపను మిగుల జతనంబు సేయు. తక్కినవారు తస్కరులం బోలుదురు. ఉవిద

లకు సాహసాన్నృశవకార్యాంబులుం గామంబు నధికంబులు గా వున వారితో నేకాసనంబునం గామకాలంబునం దక్క శయనించు టనుచితంబు.

## కన్యాదానము

కులంబును ధనంబును శీలరూపంబులను విద్యను వయోబలంబులను బరికించి యుత్తమునకుం గన్యనీయవలయు. విద్యావయోరూపసంపన్నుం డగువాఁడు నిర్ధనుండయినను భార్యార్థియయ్యెనా వానికిఁ గన్నె నీఁదగు. కేవలధనవయోరూపసంపత్తిని గన్యాదానార్హుండు గాఁడు గావున ముందు కులంబును బిమ్మట విద్యయుం దర్వాత వయసును ననంతరము శీలంబును బదంపడి ధనరూపంబులును వెండియు దేశంబును బరిశీలించి యుత్తమునకుం గన్యాదానముచేసి మైత్రి నెఱపునది. కన్య రూపంబును దల్లి ధనంబును దండ్రి విద్యయు బాంధవులు కులంబును దక్కినవారు మృష్టాన్నంబును గోరుదురు. వరుఁడు భిన్నర్షిగోత్రజాతయు భ్రాతృమతియుం గులీనయు సమాన దోషవర్జితయు నగుకన్యను భార్యగా వరియించునది.

## విద్యాధనముల సంపాదనము

ధనార్థియు విద్యార్థియుం గణంబును క్షణంబును బరిత్యజింపక కణంబుకొలఁదిని క్షణంబు కొలఁదిని ధనంబును విద్యను సంపాదింపఁ గడఁగునది. అనురక్తయగు భార్యను మిత్రులను రక్షింపను దానార్థంబును ధనార్జనంబు హితంబు. కళత్రాదులు లేనివానికి ధనంబుతోడను బ్రపంచంబుతోడను బ్రయోజనం బొకఁడు లేదు. శతవర్షంబులు జీవింతు ననియు ధనంబుల మోదింతు ననియు భావిసంరక్షణక్షమం బయిన

ధనం బార్జింపవలయు. దానంబున వర్ధిల్లునదియుఁ జోరులచే ననపహార్యంబును భారంబు లేనిదియు నగు విద్యాధనం బెల్ల ధనంబులకు మూలంబు గావున నెల్లవాఁడును నిరువది యైదేండ్లయినఁ దదర్ధంబయినఁ దదర్ధంబయిన విద్యాసంపాదనమునకు మొదలఁ గడఁగవలయు. దుర్గుణుం డయ్యు ధనవంతుఁ డెల్లవారికిఁ బూజ్యుండును సేవ్యుండును నిర్ధనుండు ప్రశస్తగుణుం డయ్యు దారపుత్రాదులచేతనుం ద్యాజ్యుండు నగుం గావునను సంసారంబున సుఖజీవనమునకు సుసాధనంబుగా ధనంబు పరిగణితము గావునను సూపాయము లగు సువిద్యాసుసేవాశౌర్యంబుల నేని కళలనేని కృషి కుసీద ప్రతిగ్రహంబుల నేని బేహారమున నేని యెద్దియే నొక్కవృత్తిని ధీమంతుఁడు ధనముసంపాదించునది. ధనికుని గృహద్వారమున గుణవంతులుం గింకరులు వ్రాలె నిల్తురు. వాని దోషములును గుణములట్ల వినుతిఁ జెందు. నిర్ధనుని గుణములును దోసములట్ల యగు; మఱియు నతఁ డెల్లవారిచే నిందింపంబడు. కొందఱు దారిద్ర్యంబున నాశముఁ బొందిరి. మఱికొందఱు దేశాంతరములకుఁ బర్వతములకు నరణ్యములకుఁ బలాయితులయిరి. ఇంకఁ గొందఱు వేదురు గొనిరి. మఱియుఁ బెక్కండ్రు శత్రులకు వశంపడి దాస్యమును జేయ నీకొనిరి. ధనవంతుండు ధనపరిమాణమును ధనస్థానమును బుత్ర మిత్ర కళత్ర బాంధవు లెఱుఁగని యపుడు వ్యవహారులకు లిఖితముకంటె స్మారకము లేదు గావున లిఖితపూర్వకముగఁ బదిలము సేయునది. మఱియు బుధుండు లేఖ్యము లేకుండ వ్యవహారం బెన్నండును జేయందగదు. మిగుల నోరిమి గలిగి నిర్లోభుఁడయిన

రాజునొద్దను విశ్వస్తుం డయిన ధనికునొద్దను సంచితధనము పత్రము వ్రాయించికొని దాఁచికొనునది గాని మిత్రునకుఁ గావలసినపుడు కుసీదము లేకుండఁ దగినంతధనం బీఁదగు. ఏయధమర్ణునకు నిచ్చిన మూలధనంబునకు హాని లేకుండు నట్టి వ్యవహారక్షముం బరికించి లగ్నకుం బుచ్చికొని సాక్షిమంతముగఁ దగునట్లు వృద్ధి నిర్ణయించి లిఖితము వ్రాయించికొని ధనవంతుండు ఋణం బొసఁగిన సుఖప్రత్యాగమం బగు. వృద్ధిలోభమున సంచి మొదలు నశించునట్లు పర్యాదంచనం బీనర్హము గాదు. ధనం బిచ్చునపుడు మైత్రీకరమును మరల గ్రహించునపుడు శత్రుకరము నగుం గావున వ్యవహారమున భోనమునందుం బోలె నిర్లజ్జుండైన వ్యవహారి మిగుల సొగియు. ధీశాలి మనమున మహాదార్యము గలిగియు వెలుపటఁ గార్పణ్యము సూచించుచుఁ దగిన కాలమున సముచిత వ్యయంబు తప్పక చేయునది. మఱియు సుభార్యాపుత్ర మిత్రాదులను సకలధనమును వెచ్చించియేని శక్తికొలఁది రక్షించుచు మనుజుఁడు జీవించిన భద్రశతముం జూచుఁ గావున నను దాఁగల్గిన సకలపదార్థములు సుసాధనములు గావునను ధనాదుల నన్నిట నాత్మరక్షణము గావించుకొను చుండునది.

విభాగవిషయము

సదారులుం బ్రౌఢవయస్కులు నగు సుతుల శ్రేయోర్థియగు తండ్రి విభజించునది. సదారులుం బ్రౌఢవయస్కులు నగు భ్రాత లేకోదరులయ్యు విభక్తధనుల కావలయు. అట్లు కాని నాఁడు తప్పక ముప్పుఁ జెందుదురు. స్త్రీయుగళమును నొక్కచో వసియింపఁ బొసఁగ దనఁ బెక్కండ్రు యువతు

గాదె. జనుండు మిగుల నాలోచించి యేవానితో నయిన నెయ్యంబేని పగయేని గావించి దానికి దొసఁగు పొసఁగ కుండ మిత్రున కుపకారమును శత్రున కపకారమును గావింప యత్నించు చుండవలయుఁ గాని వ్యత్యయము దగదు. మఱియు నతిక్రౌర్యము నతిశౌర్యము నతివాదము నతికార్యాసక్తియు నత్యాగ్రహమును నతిమార్దవమును నతిశౌర్యమును విడుచుచు ననర్థకారి యగుట నతిని సర్వకార్యములఁ ద్యజించునది. అతిక్రౌర్యమున జనము పీడ నొందు. కార్పణ్యాధిక్యమున నిందించు. మార్దవాతిశయమున నరకు సేయకుండు. అతివాదమున నవమానించు. అతిలోభమునఁ దిరస్కరించు. అతిదానమున దారిద్ర్యము ఘటిల్లు. అత్యాగ్రహమునను నత్యాచారమునను నరునకు మోఅకుఁదనమును ననాచారమున ధర్మహాని

ద్ధిమంతుఁ డే నందఱకంటె నధికుండ నా కెక్కుడు

కేవలాత్మనియు ధర్మతత్త్వం బిది యనియు నెన్నఁడు గుణములచేతన విదితుఁ నద్గిలమును గలుగున ల్లెల్ల కార్యలన ప్రథితుఁ డధముఁడును నధికుండు గలఁడని తలఁచునది. తుఁడు నీచుండును నగుదురు. హ్మణులయందును గోవులందును ధనమునను భార్య సౌమ్మునను భిలషింపక యాత్రితయమున ముం డగు. లయు. ఎవనియం దెట్టి

దానప్రశంస నది యెవ్వఁడెఱుఁగు.

మహాధనుం డగు బుధుండు పోష్యు నవి దుర్లభంబు బోషించుచుఁ గొంచెమైన నేవానికైన దానము నష్టవిమర్దిత నొక్క దివసమును గడపంగూడదు. నేను మిత్రినొకారియు వాఁడ మీఁదటి ఋణమున జీవింతు నను ప్రమాణమును

రాజునొద్దను విశ్వస్తుం డయిన ధనికునొద్దను సంచితధనము
పత్రము వ్రాయించికొని దాఁచికొనునది గాని మిత్రునకుఁ
గావలసినపుడు కుసీదము లేకుండఁ దగినంతధనం బీఁదగు.
పయధమర్ణునకు నిచ్చిన మూలధనంబునకు హాని లేకుండు
నట్టి వ్యవహారక్షముం బరికించి లగ్నకుం బుచ్చికొని సాక్షి
మంతముగఁ దగునట్లు వృద్ధి నిర్ణయించి లిఖితము వ్రాయించి
కొని ధనవంతుండు ఋణం బొసఁగిన సుఖప్రత్యాగమం బగు.
వృద్ధిలోభమున సంచి మొదలు నశించునట్లు పర్యుదంచనం బీ
నర్హము గాదు. ధనం బిచ్చునపుడు మైత్రీకరమును మరల
గ్రహించునపుడు శత్రుకరము నగుం గావున వ్యవహారమున
బోనమునందుం బోలె నిర్లజ్జుండైన వ్యవహారి మిగుల సౌగియు.
ధీశాలి మనమున మహౌదార్యము గలిగియు వెలుపటఁ
గార్పణ్యము సూచించుచుఁ దగిన కాలమున చారదత్తం
వ్యయంబు తప్పక చేయునది. మఱియు ఘాతుకునకును
మిత్రాదులను సకలధనమును శాపభయమున దత్త
రక్షించుచు మనుజుఁడు జీవించిన వారల కిచ్చునదియు జూద
నను దాఁగల్గిన సకలపదార్థమృతమును నష్టంబనియు బరస్త్రీ
ధనాదుల నన్నిట నాత్మరక్ష వ్యవహరింత్రు.

౧- చెడునడవడి - వానిఫలము

సదారులుం చు దేవుఁ డుత్కృష్టుఁ డని చెప్పుచుఁ
యగు తండ్రి విశ కల్పింపక సుఖముగ నతని సేవించుచు
నగు భ్రాత యుండ వలయు. దానార్జవములకంటె వశీకరణ
కాని నా బొకండు లోకమున లేదు. దానక్షీణుండగు శుక్ల
నా శశి వక్రుఁ డయ్యు వర్ధిష్ణువు నయన సుభగుఁడు నగుం

గాదె. జనుండు మిగుల నాలోచించి యేవానితో నయిన నెయ్యంబేని పగయేని గావించి దానికి దోసఁగు పొసఁగ కుండ మిత్రున కుపకారమును శత్రున కపకారమును గావింప యత్నించు చుండవలయుఁ గాని వ్యత్యయము దగదు. మఱి యు నతిక్రౌర్యము నతిశౌర్యము నతివాదము నతికార్యా సక్తియు నత్యాగ్రహమును నతిమార్దవమును నతిశౌర్యమును విడుచుచు ననర్థకారి యగుట నతిని సర్వకార్యములఁ ద్యజించు నది. అతిక్రౌర్యమున జనము పీడ నొందు. కార్పణ్యాధిక్యమున నిందించు. మార్దవాతిశయమున నరకు సేయుకుండు. అతివాద మున నవమానించు. అతిలోభమునఁ దిరస్కరించు. అతిదాన మున దారిద్ర్యము ఘటిల్లు. అత్యాగ్రహమునను నత్యాచార మునను నరునకు మోహకుఁదనమును ననాచారమున ధర్మహాని యునగు. బుద్ధిమంతుఁడే నందఱకంటె నధికుండ నా కెక్కుడు తెల్వియుం గల దనియు ధర్మతత్త్వం బిది యనియు నెన్నఁడు నిశ్చయింపక తిమింగిలమును దద్గిలమును గలుగున ట్లెల్ల కార్య ముల నెక్కనికంటె నొకఁ డధికుండు గలఁడని తలఁచునది. నరుఁడు దేవతలయందును బ్రాహ్మణులయందును గోవులందును స్వామ్యంబనర్థకారిగావున దానినభిలషింపక యాత్రితయమున భజనపూజన సేవనతత్పరుండు గావలయు. ఎవనియం దెట్టి బ్రహ్మవర్చసము సుప్రతిష్ఠితంబై యుండునది యెవ్వఁడెఱుఁగు. తరుణీధనపుస్తకములు పరాధీనములు సేసిన నవి దుర్లభంబు లగు. దైవానుగ్రహమున లబ్ధములయ్యేనేని భ్రష్టనష్టవిమర్దిత ములగు. మనీషి యల్ప సాధనసాధ్యమును మిగులలాభకారియు నగుకార్యము మానను బహ్వర్థసాధ్యమును నల్పఫలదమును

నగు కార్యం బభిమానమునఁ జేయను మహాసాధనసాధ్యం
బయినను సత్కీర్తికరం బయిన కార్యము విడువనుం దగదు.
లెంక లెఱుంగమి ననదుక్తి వల్కిన నీసును నలుకయు నొందఁ
జనదు. మేధావి నెయ్యునకు ప్రీకరమును మర్మభేదకమును
నగు పల్కు వినోదమున నేని వచియింపఁదగదు. ఎవ్వని
యొద్ద సూక్తదురుక్తములు సదృశము లయి బధిరునొద్ద
గాననైపుణ్యముంబోలె నిరర్థకం బగు నతనియొద్ద భాషింప
కుండునది. ఆపన్మగ్నుం డగు సుహృదు ననునయించి
యూఱడింపనివాఁడు నృశంసుఁడు. దాయలకుఁ గలహంబు
ప్రాప్తంబయిన సర్వయత్నంబుల మాధ్యస్థ్యంబు నంగీకరిం
పనివాఁడు మిత్త్రుండనం దగఁడు. మానసమున నాటిన దురుక్తి
శల్యం బుద్ధరింపఁ గరణం బొండు లేదు గావున నా జన్మ
సేవితుండును దానమానంబులఁ బోషితుం డయిన చెలి
కాఁడును బరుసపు మాటల నప్పుడ పగవాఁ డగు. తన
బలం బధికం బగునంత దనుక నమిత్త్రుని గందంబున నయిన
వహించి వాని బలంబు హీనం బగుడు ఱాత ఘటంబుం
బోలె భేదించునది. అలంకారంబులును రాజ్యంబును పౌరు
షంబును విద్యయు ధనంబును సౌజన్యంబుం బోలె మనుజు
నలంకరింపం జాలవు. అశ్వమునకు జవంబును వృషంబునకుఁ
భారవహన సామర్థ్యంబును మణికిఁ గాంతియు రాజునకు క్షమ
యు వేశ్యకు హావభావంబులును గాయనునకు మధురస్వరం
బును జోదునకు యుద్ధోత్సాహంబును గోవునకు బహుదుగ్ధ
సంపత్తియుఁ దపస్వుల కింద్రియ నిగ్రహంబును ధనికునకుఁ
జాగంబును విద్వాంసునకు వావదూకతయు వివాదపద నిర్ణేతల

కపటుపాతంబును భృత్యులకుఁ బ్రభుభక్తియు సాకిరులకు సత్య వచనమును మంత్రులకు హితోక్తియు మూఢులకు మౌనమును స్త్రీలకుఁ బాతివ్రత్యమును సుభాషణమును విపరీతము దుర్భాషణము నగు. శక్తుఁడు హింస్రు నుపేక్షింపక తత్క్షణంబ దండించునది. పైశున్యంబును గోపంబు మాత్సర్యంబును (పరశుభద్వేషము) గార్యఘాతిత్వంబు ననృతవాదంబు నాలస్యంబు (సోమరితనము) గుణవంతుల కున్నను గుణంబుల నాచ్ఛాదించి దోషంబుఁ బ్రకటించు. బాల్యంబున మాతృవియోగంబును జవ్వనంబున భార్యావియోగంబును వార్ధకంబునఁ బుత్రనాశ ధననాశంబులును మహాపాపఫలంబులు. శ్రీమంతుల కనపత్యతయు దుర్గతులకు వార్ధక్యంబును భామినులకు నపుంసకుండు పతి యగుటయు మహాదుఃఖకరంబులు. యథాజాతుఁడగు పుత్త్రుఁడును విధవ యగు కూఁతురును జండి యగు భార్యయుఁ బేదతనంబును నీచసేవయు ఋణంబు నను నీయాఱును మహావ్యథాకరంబులు.

ఖలస్వరూపము

అధ్యయనంబునను నధ్యాపనమునను దేవునందు నొజ్జయందు నితిహాసాగమ దేశభాషాలిపిజ్ఞానాది కలలయందు సత్సేవయందు గానంబునను ఋజుప్రవర్తనంబునను రమణియందును దపంబునను సాహిత్యంబునను నేవానిమనంబు రమింపకుండు నట్టివాఁడు ఖలుండు నరరూపధరుండయిన పశువును గావలయు.

కానివాఁడు ముత్తుఁడయినం గావలయు. ఇతరుల వృద్ధి నోర్వని వాఁడు పరుల తప్పులనె వెదకువాఁడు నొరుల

నిందింపం గడంగువాఁడు నన్యులకుఁ జెఱుపు సేయ యత్నిం చువాఁడు మనంబున దురాలోచనంబు గల్గియుఁ బ్రసన్నా స్యుండగువాఁడు ఖలుండు నాఁబడు. ఆశ గలవానికిఁ బ్రపం చంబునఁ గల యర్థం బెల్ల నొక్కనికి చాలదు. సాధుఁడు కా ర్యంబు సేయుచు బోధించుచు ననుమోదించుచు నుండు. ధూర్తులన్యోపదేశంబున సాధువులువోలె నుందురు గాని స్వప్ర యోజనంబుకై యకార్యశతం బేని చేయ నిచ్ఛయింత్రు.

మంచిపుత్త్రులు - చెడుపుత్త్రులు

తల్లిదండ్రుల యాజ్ఞ జవదాఁటక యనలసుండై నీడ వలె వారి సేవించుచు ధనాగమార్థం బేని వేదార్థజ్ఞానార్థం బేని యత్నించుచు సర్వవిద్యాకుశలుం డగు పుత్త్రుంను ప్రీతిదాయకుండును విపరీతవర్తనుండు దుర్గుణుండు ధననాశ కుండు నగువాఁడు దుఃఖదాయకుండు నగు.

భార్య మొదలగువారి ప్రాశస్త్యము

మగనియం దనురక్తయు గృహకృత్యంబునఁ గుశలయు సుశీలయు భర్తృసేవాతత్పరయుఁ బుత్త్రప్రసువు నగు పత్ని పతికిం బ్రియురా లగు. నిసువుల యపరాధంబులు సైఁచి పోషించు మాత ప్రీతిదాయకురాలు దుశ్చరిత దుఃఖదురాలు నగు. పుత్త్రునికి విద్యాగమార్థంబు జీవనార్థంబు నిచ్చలు యత్నించుచు నెల్లపుడుఁ దగునట్లు శాసించుచు నుండు పిత రుఁ డుత్తముఁడు ననృణియు నగు. ఎవఁ డెల్లకాలంబు స్వకా ర్యంబులకు సహాయము గావించుచు నొకప్పుడేనియుం బ్రతీపంబు వలుకక సత్యమును హితంబు నుపదేశించుచుఁ

దనయొద్దఁ గలదాని నెద్దియే నిచ్చుచుఁ బుచ్చికొనుచుఁ దనయింటికి వచ్చుచుం బోవుచుండు వాఁడు సన్మిత్త్రం బగు.

దుఃఖహేతువులు

నీచులతోడి యతిపరిచయంబును బరగృహంబులకుఁ బలుమాఱు పోకయు జాతియందును సంఘంబునందును బ్రాతికూల్యంబును దారిద్ర్యంబును మానహానికరంబు లగు. వ్యాఘ్రంబులతోడను, వహ్నితోడను, సర్పంబులతోడను, హింస్రులతోడను సంఘర్షణంబు గీడు గావించు. సుహృదులకు దౌర్మనస్యంబును బగఱకుఁ బ్రాబల్యంబును విద్వాంసులకు బీదతనంబును దరిద్రున కపత్యబాహుళ్యంబును దుఃఖహేతువు లగు. కన్యయొక్కఁత యయ్యు సంతాపకారిణి. తల్లిదండ్రుల యాచనంబు దుఃఖదంబు. ధనికుఁడు గుణవంతుఁడును వెజ్జును ఱేఁడును సుజలాశయంబును లేని యూర నివసింప సుఖంబు గలుగదు. పతి ధనరూప సంపన్నుండయ్యును బలాధికుఁ డయినను విద్వాంసుఁ డయినను యథేష్టంబుగఁ బ్రవర్తింపనివాఁ డింతులకు సుఖదుండు గాఁడు. సంధారణ లాలనంబుల శిశువు వశంపడునట్లు మానసం బెఱిఁగి యభిలాషానుసారంబుగఁ జరించువానికి స్త్రీ వశురా లగు. జ్ఞాని కార్యసాధనం బయిన వ్యయం బెంత యధికం బయినం జేయుఁ గాని నిరర్థకంబయిన వెచ్చ మల్పం బయినఁ జేయఁ దలఁపఁడు. మఱియు నధికవ్యయంబు నల్పలాభంబు నగు పని చేయక విపరీతంబగు దాని నుపాయంబుతో సేవించు. పణ్యంబు లయిన వస్తువుల మూల్యంబును మానంబును యత్నంబున

నెల్లరుం దెలియ వలయు. తప స్త్రీ కృషి సేవలందు నుప భోగ్యంబులందును భక్షణంబునను గాక యన్యకార్యంబుల హితకారి యగు ప్రతినిధిని నియోగింప నగును.

### మనుజుల వేర్వేఱు కోర్కులు

మధురపదార్థంబులఁ దినఁ గోరు వాఁడును జోరుఁడును బొజుఁగును విజనప్రదేశంబును, బలవంతుఁడో విద్వేషంబు గొన్న వాఁడు సహాయమును, వేశ్య ధనికమైత్రియుఁ, గునృపతి ఛలంబును, దేవజీవకుఁ డగ్నియు దంభతపంబును, గ్రొత్తడి నిజకాంతుని, జ్ఞానితత్త్వంబును జలాభి దురాచారుని, వ్యాధితుఁడు వైద్యుని, ధృతపణ్యుఁడగు బేహారి మహార్ఘంబును, గుసేవకుఁడు రాజద్రవ్యంబును, యాచకుఁడు దానశీలుని, భీతుఁడు రక్షకుని, దుర్జనుఁడు ఛిద్రంబును, వెదకుచుందురు. పాలసుఁ డొకపుడు మిగులఁ గోపించుచు విరుద్ధంబుగ భాషించు. నిద్రించు. మాదకద్రవ్యంబుల భక్షించు. నిష్ఫలంబు ననిష్టఫలంబు నగు కర్మం బేని కావించు. క్షాత్రం బయిన తేజంబు తమఃప్రధానమును బ్రాహ్మము సత్త్వగుణప్రధానమును నితర తేజంబు రజఃప్రధానము నగుఁ గాని సత్త్వప్రధానం బయిన తేజం బన్నిటం బ్రశస్యతమం బగు.

### బ్రాహ్మణప్రాశస్త్యము

బ్రాహ్మణుం డెల్లవారికంటె స్వకర్మమునన యధిక తేజస్వి యగు. క్షత్త్రియాదులందుఁ దత్తేజముకంటె నను తేజ ముండదు. స్వధర్మాచరణనిరతుఁ డయిన బ్రాహ్మణుం జూచి యితరులు భీతిల్లుదురు. కనుక స్వధర్మముం జేయునది.

## వృత్తిభేదములు

ఎల్లవారికి స్వధర్మమునకు లోపము గావింపని వృత్తి యుత్తమ యగు. మఱియు నెద్దేశమునఁ గుటుంబపోషణము సుఖముగ నగు నద్దేశము ప్రశస్యము. కృషి సరిన్మాతృకం బయ్యెనా యుత్తమవృత్తి యనందగు. వాణిజ్యము మధ్యమ వృత్తియు భారవహానాదుల జీవనం బధమమును దపస్వు లందుఁ దక్క యాచ్నావృత్తి యధమతమము నగు. మఱియు నొకప్పుడు ధర్మశీలుండగు రాజుసేవయు నుత్తమంబని యెన్ను దురు. యాజనమును బేహారమును గరిసనమును రాజసేవ యుంబోలె విపులం బయిన ధనంబు గావింపం జాలవు గాని యది బుద్ధిమంతులకుఁ దక్క నన్యులకు నసిధారయుంబోలె నతిగహనంబు నశక్యమునై యుండు. వ్యాళగ్రాహి వ్యాళం బును మంత్రి నృపునిని మంత్రబలమునన వశపర్చికొందురు గాని రాజునెడ బుద్ధిమంతులకు వెఱ పగ్గలం బగు.

## బుద్ధిప్రశంస

మతిమంతుఁడు దూరమున నున్నను సమీపమున నున్నవాఁడు వోలె బుద్ధిపాశమున బంధించి యెవ్వానినే నాకర్షింపఁ జాలు. బ్రాహ్మతేజంబు బుద్ధిమంతులందును క్షాత్రంబు రాజునందును బ్రతిష్ఠితంబులు. మందప్రజ్ఞుఁడు సమీపమున నున్నను దూరస్థుఁడ యగు. వేదాభ్యాసపాటవ మునఁ దేరినబుద్ధి సర్వతంత్రములం బ్రవేశింపఁ జాలమి వ్యవ హారక్షమము గానోపదు.

### అల్పభాగ్యాదుల యప్రాశస్త్యము

అల్పం బయిన కలిమికంటె లేమియు దుష్టయానారోహణముకంటెఁ బాదగమనంబును మృతాపత్యతకంటె ననపత్యతయుఁ బగగొనుకంటె నౌదాసీన్యమును దేశాచ్ఛాదనముకంటెఁ జర్మమునఁ బాదగూహనమును బరునింటఁ గాఁపురముండుటకంటె నడవి వసించుటయు నల్పజ్ఞానముకంటె నజ్ఞానమును దుష్టభార్యాగార్హస్థ్యముకంటె మరణం బేనియు సన్న్యాసం బేనియు వరమును సుఖదము నగు. ఋణమును గర్భధారణమును నధికారము ఖలసఖ్యమును నపథ్యభోజనమును మొదల సుఖమును దర్వాత దుఃఖమును గావించు.

### నాశహేతువులు

రాజు దౌర్మంత్ర్యమునను రోగి దుర్వైద్యమునను బ్రజ దురాధిపత్యమునను గులము గుసంతతిని గుబుద్ధి నాత్మయు నశియించు.

### సంసర్గమహిమ

హస్త్యశ్వ వృషబాల స్త్రీ శుకములు సంసర్గమునం జేసి శిక్షకుని గుణములు ధరియించు. సమయోచితభాషణమున జయమును సద్వ్యసనములఁ బ్రసిద్ధియు విద్యచే సభయందు మానమును నధికారమున మూఁడును సంఘటిల్లు.

### సుఖహేతువులు

సత్కళత్రమును సుపుత్త్రుఁడును సువిద్యయు సుధనమును సుమిత్త్రుఁడును వశంవదుండయిన దాసుఁడును నట్టిదాసియు నారోగ్యసంపన్నం బయిన దేహమును సుఖవాసార్హం

బయిన సదనమును సున్నపతియు ననుపదియు మనుజునకు సుఖము గావింపంజాలు. ఇం దెద్దియేఁ గొఱఁతవడిన సుఖము నకుఁ గొఱఁత యగు.

### అంతఃపుర సేవార్హులు

వృద్ధులు సుశీలురు విస్రంభార్హులు సదాచారులు నగు పురుషులనేని యట్టి యింతుల నేని క్లీబులనేని నరుం డవరోధ రక్షణమున నియోగింపవలయుం గాని మిత్రునేని యువను నియోగింప మేలు గాదు. ఎల్లవాఁడును గాలము నియమించి కార్యములు సేయు చుండవలయుఁ గాని వ్యర్థముగఁ గాల క్షేపము సేయంజనదు. గవాదులం దన్నుఁబోలెఁ బాలించు చు నన్నసంసిద్ధికిఁ దల్లిని దన్ను ధర్మార్థంబులను స్వాశిక్షణ మునకు గురులను నియోగించుచు ననియమముగ నంతిపుర మున కప్పుడప్పుడు నరుండు పోవుచుండ వలయు.

### మార్గమున సుఖహేతువులు

అనపత్య యగు పెండ్లమును సద్యానమును బరువు మోయువాఁడును సంరక్షకుండును అనలసుఁ డగు సేవకుం డును బరక్లేశహారం బగు విద్యయుఁ బ్రవాసమున సుఖహేతు వు లగు.

### చేయఁగూడని పనులు

మార్గమునిరోధించి యెక్కుడయినను సమర్థుండును నిలువఁదగదు. దేశాధిపతియయ్యు సద్యానముననేని హట్టమా ర్గమున బోవఁ గీడగు. అధ్వగామి సహాయము కలిగియె పయ నంబు సేయుచు సన్మార్గమునకు సమీపమున నున్న యూర

సుజలము నభయము నగుదాన విడియ వలయుం గాని మార్గమున నరణ్యమునను నాఁగఁగూడదు.

### జరాకారణములు

బహుదేశాటనమును ననశనవ్రతమును స్త్రీసంసర్గాధిక్యము నతిశ్రమానుభవమును శీఘ్రంబుగ జరాగమన కారణంబు లగు. వాగ్రూపము లయిన విద్యలయందును క్రియారూపము లయిన కలలయందును నిరంతరాభ్యాసమును జరాకారియ యగు.

### స్తుతి

దుర్గుణములను సద్గుణము లని కీర్తించువాఁడు ప్రియుం డన గుణాధిక్యము స్తుతించు వాఁడు సఖుం డెట్లు కాకుండు? ప్రియుం డయ్యు దుర్గుణముల నెదుట వక్కాణించువాఁడ ప్రియుండగునన గుణంబులు దోషంబు లనువాఁ డప్రియుండని చెప్పనేల? దేవతలును స్తుతిచే వశ్యు లగుదు రన మనుజుల మాట చెప్పనేల? లోకమున నెల్లరును స్తుతిప్రియు లగుటఁ బ్రత్యక్షముగ నేవాఁడును దోషము నుసువ వెలిచుఁగాన లోకజ్ఞానమునను శాస్త్రాభ్యాసపాటవమునను నెల్లవాఁడు నాత్మదోషముల నెఱిఁగి విసర్జించు చుండవలయు.

### దుర్గుణహానము

తన దుర్గుణములు విని యెవ్వఁడు కోపింపక సంతసించుచు స్వదుర్గుణములఁ దెలిసికొన యత్నించుచు శ్రుతము లయిన దురభ్యాసముల విడుచుచు నాత్మగుణంబుల విన్న

నుపొంగక నే దుర్గుణాకరుండ జ్ఞానహీనుండ నాయందు గుణాధానం బెట్లగునని తలఁచువాఁ డెల్లరకంటె నధికుండును సాధువు నగుం గావున నతని కలాలేశంబు దివ్యులుం బోలరు. మహాత్ములకు గావించిన యుపకారం బల్పం బయ్యు మహత్త్వము వడయు.

సాధునకు నసాధునకుఁ గావించిన యుపకారము

ఖలులకుఁ గావించిన మే లధికం బయ్యు సర్షపము కంటె నల్పముగఁ దలఁతురు. సాధువు క్షమ గలవాని బలవంతుఁ డనియు దుర్జనుఁడు బలహీనుఁ డనియుఁ దలఁచు. సాధుని దుర్వచనంబును క్షమించునది. కాని దుర్జనునిది క్షమింపరాదు.

జనుల రంజించు విధము

ఏవారికిని గలహంబు గలుగున ట్లుచ్ఛృంఖలంబుగఁ గ్రీడింపను, వినోదంబునను నీభార్య చెడిప యగునా యను నిట్టి పల్కు పల్కనుండగదు. స్నేహాధిక్యము నచేవారియందు నపశబ్దములఁ బ్రయోగింపఁ జనదు. మిగుల గోప్యం బయినను మిత్త్రునకు దాఁపక వాని గోప్యంబుఁ బ్రకటింపక వానిక్షోభఁ గాలవశమునఁ బగ చేకూడినను దాను ము న్నెఱిఁగిన వాని రహస్యంబుఁ బ్రకటింపక వాని గాప్ట్యము నుగ్గడింపక మాన్ప గుప్తంబుగ యత్నించుచు శక్తికొలఁదిఁ బ్రతిక్రియ సేయు టుచితం బగు. యథార్థం బయినను బలవంతులకు విరుద్ధం బగు నుడి నుడుగుచు నరుఁడు బలవంతులకుఁ బ్రతికూలం బయిన వచనం బొకయపుడు విన్నను విననియట్లు నట్టి కార్యంబు చూచినం జూడనియట్లును వ్యవహరించుచు స్వాప

త్కాలమున మూకుని బధిరుని ఖంజునిని బోలియుండవలయు. అట్లు కానివాఁడు దుఃఖము వాటిల్లు. నయ జ్ఞాన సంపన్నుఁడు వృద్ధానుకూలం బయిన వచనంబు సమయమునకుఁ దగునట్లు పల్కవలయుఁ గాని కోమలప్రజ్ఞుఁడు గాఁ దగదు. ప్రసంగమున నన్యగృహంబునకుఁ బోయినను వాని కాంతా జనంబు వంక దృష్టిప్రసారము సేయందగదు. అధను ననుజ్ఞ వొందక యె వాని కార్యంబున యాజమాన్యంబు వహింపను దగు. బాలుర వివాదమునఁ దన బాలుర శిక్షింపనలయును గాని యపరాధుల నేని యన్యుల బాలుర శిక్షింపఁదగదు. వాదిప్రతివాదుల మతంబు యథార్థంబుగ నెఱింగినను నధికారినియుక్తుండు గాక చెప్పినహీనుండు శత్రు వగుం గాన నేవాఁడు నట్లు చేయఁదగదు. అన్యవివాదంబు గ్రహించి తానెన్నఁడు నేనానితోడను వాదింపఁ దగదు. అధర్మనిరతుఁడు ఛలాంతరుఁడు నతిపీడకుఁడు నీతిహీనుఁడు నగు నధికారి యెచట నుండు నా గ్రామంబు పరిత్యజించి యన్యస్థలమున బుద్ధిమంతుఁడు నివసించునది. పెక్కండ్రు సంఘీభవించి రాజమంత్రము తర్కింపఁ గీడు మూఁడు. జ్యోతిషంబు ధర్మనిర్ణయమును నీతియు దండంబును జికిత్సయుఁ బ్రాయశ్చిత్తంబును గ్రియాఫలంబును దత్తచ్ఛాస్త్రజ్ఞానంబు సంపాదింపక చెప్పవలదు.

అప్రవాసియు స్వాతంత్ర్యుండు నగు గృహమేధి సుఖించును. స్వాతంత్ర్యంబుకంటె సుఖంబును బారతంత్ర్యంబు కంటె దుఃఖంబును లేదు.

వ్యవహారముం దెలియు సాధనము

ప్రాచీనులు నవీనులు నగు వ్యవహారవిదుల బుద్ధివిశే షంబునను బ్రతిక్షణంబును వ్యవహారంబు నవనవం బగు చుండుఁ గాన దాని నిర్ణయంబు దుస్సాధం బయ్యు ననుభ వంబునను యుక్తి నుపమానంబునను నాప్తోపదేశంబునను సుసాధం బయియుండు నని నృప రాష్ట్ర సాధారణం బయిన నీతి చెప్పె.

ఇది శుక్రనీతిసారంబున నాంధ్రీకృతంబున నృపరాష్ట్ర సామాన్య లక్షణం బనునది తృతీయాధ్యాయము

శ్రీ ర స్తు

# శుక్రనీతిసారము

## చతుర్థాధ్యాయము



### ప్రథమప్రకరణము



#### మిత్రామిత్రుల లక్షణము

వెనుకటి యధ్యాయంబున జనసాధారణం బయిన నీతి నుపదేశించి మిశ్రంబున సుహృదాదుల లక్షణంబు సమాసంబునఁ జెప్పెద వినుఁడని హితశ్రోత లగు రక్కసులకు శుక్రుం డిట్లనియె. సుహృదుఁడు దుర్హృదుఁడును గర్తయుఁ గారయితయు ననుమంతయు సహాయకుఁడు నని నలుఁదెఱఁగుల నుండురు. ఎవ్వని మనం బన్యదుఃఖంబున ద్రవించు; మఱెవ్వఁ డితరుల ప్రేరణంబు నొందకయ యిష్టకార్యంబు సేయ జతనంబు సేయుచు సత్కరించు; ఇఁక నేవాఁ డాపత్సమయంబున నాత్మ స్త్రీ ధనాదులకు శరణం బగు నతఁ డుత్తమమిత్రుండును గొన్ని కర్జంబులయందు సహాయం పడువాఁడు రెండవ మిత్రుండు నగుదురు. ఒక్కఁ డపేక్షించిన పదార్థంబును మఱియొక్కఁ డపేక్షించుటయు నన్యుని యిష్టంబునకు నాశంబు గావించుటయు వైరిలక్షణం బగు. సోదరులు లేరేని పితృద్రవ్యం బంతయు నాక యగు నితని

వశంబున నేమియు ద్రవ్యం బుండదు. నిస్సపత్నంబుగ నంతయు నే నొక్కరుండన యనుభవించెద నను వారు పరస్పర వైరులు. ద్వేషించువాఁడును ద్వేషింపఁబడినవాఁడు నేకతరవైరు లగుదురు. శూరుండు నుత్థానశీలుండు నీతిబలసంపన్నుండు నగు రాజున కెల్లనృపులు గూఢవైరులు కాలప్రతీక్షకులు నగు నమిత్త్రుల యగుదురు. ఎల్లరకు రాజ్యలోభంబు మెండు గావున నది యంత వింతయుఁ గాదు. రాజు లేవారికి నేవారు రాజులకును మిత్త్రులు గారు గాని వారలు పరస్పరంబు కార్యవశంబున మిత్త్రులు తఱచుగ నగుచుంద్రు.

## సహజమిత్త్రులు – సహజశత్త్రులు

మఱియుఁ గొందఱు స్వభావంబునన యెప్పుడు మిత్త్రులును శత్త్రులు నగుదురు. తల్లియుఁ దత్కులంబువారును దండ్రియు నతని తల్లిదండ్రులు దండ్రిపితృవ్య పుత్త్రికయు నాత్మకన్యయు భార్యయు నామె కొలంబువారును బితృమాత్రాత్మభగినులు దుహితృ సంతానంబును సత్త్రప్రజాపాలకుండును గురువును సహజమిత్త్రు లగుదురు. విద్యయు శౌర్యంబు దాక్ష్యంబు బలంబును ధైర్యంబును బుధులకు జీవనసాధనంబు లగుం గావున సహజమిత్త్రంబు లగు. పిత్రాజ్ఞానువర్తి యగు పుత్త్రుండు పుత్త్రుండు. గుణహీను లగు నూర్వురకంటె గుణవంతుఁ డగు పుత్త్రుఁ డొకఁడు శ్రేష్ఠుఁడు.

హింస్రుండును దుర్వృత్తుండును బుణి యగు తండ్రియు ధర్షణి యగు తల్లియు నాత్మసోదరులుం బితృసోదరు

లును వారి భార్యలుం బుత్రులును స్నుషాశ్వశ్రువులును సపత్నులును ననాందయుఁ దోఁడికోడంద్రును మూర్ఖుండగు పుత్రుండును గువైద్యుండును రక్షకుఁడు గాని పతియును గోపనుండగు ప్రభువును దాత గాని ధనికుఁడుం బ్రజలకును సహజశత్రు లగుదురు. దుష్టులకు రాజును గులటలకుఁ బతివ్రతయు ఖలులకు సాధువును మూర్ఖుల కుపదేశకుండును శత్రువులు. భుజంగంబులకు క్షీరపానంబు విషంబుంబోలె నుపదేశంబు మూర్ఖులకుఁ గ్రోధంబు వర్ధిల్లఁజేయును. రాజులకు నలుదెసలను సన్నికృష్టులును వారి తరువాతివారును వారి యవతలివారు నగు రాజులు గ్రమంబున హీన బలాదులు నరిమిత్రోదాసీనులు నగుదురు. తన కతిసమీపంబున నుండు కర్మసచివులు నమాత్యాదులుం గర్షితు లయి శత్రు లగుదురు.

### రాజు శత్రులయెడను మిత్రులయెడను బ్రవర్తింపవలయువిధము

రాజు హీనబలులు నధికబలులు నగు మిత్రులయందుఁ గ్రమంబున బృంహణంబును గర్షణంబు నుపయోగించుచు శత్రులకు సామాద్యుపాయంబులచే భేదనంబుఁ బీడనంబు నాశనంబు గావించుచు నెయ్యురను దాయలను వశవర్తులం జేయునది. ఉపాయంబున వ్యాఘ్ర గజ సింహాదులును వశం పడును. భూమిష్ఠు లుపాయంబున స్వర్గంబుం జొత్తురు. బుద్ధిమంతు లుపాయంబున వజ్రంబు భేదింత్రు. సుహృత్సంబంధులయందును స్త్రీ పుత్ర ప్రజా శత్రులందును సామాద్యుపాయంబుల వేర్వేఱ నుపయోగించునది. ఏక శీల వయో విద్యా జాతి వ్యసన వృత్తులకు సాహచర్యంబు నార్జవంబు గలిగిన

మైత్రి సంఘటిల్లు. నీతోడం దుల్యుండగు చెలికాఁడు నా కింకొకఁడు లేఁడను నుడికారంబు మిత్రునియందు సామంబగు. నా కున్న దంతయు జీవితంబుతోడ నీద యని యర్పించుట మిత్రునందు దానంబును మిత్రునొద్ద నన్యమిత్రుని సద్గుణకీర్తనంబు గావించుటయు మిత్రునందు భేదప్రయోగంబు నగు. నీ విట్టి పనులు సేయుచున్న నీతో నింక నేస్తంబు సేయఁగలవాఁడఁగా ననునుడియె దండంబగు. ఏవాఁ డిష్టంబు సంఘటింపఁడు మఱియు ననిష్టంబు నుపేక్షించు నతఁ డుదాసీనుండగు. నేను నీకును నీవు నాకును నెన్నండు ననిష్టంబు చింతింప వలవదు. నేను నీకును నీవు నాకును గావలసినపుడు సహాయంబవశ్యంబు చేయవలయు నని నిశ్చయించి పల్కుటయు పగవారియందు సామప్రయోగంబును బ్రబలు లయిన శత్రుల నేఁడుట మితంబులగు గ్రామంబులనే నరిసేని యథాయోగ్యంబుగ నారాధించుట దానంబును శత్రులకు సాధనవైకల్యంబు గావించుటయుఁ దాను బ్రబలుల నాశ్రయించుటయు నతనిచే నిష్కాసితు లయినవారి నుద్ధరించుటయు భేదంబును దస్యు ద్వారంబున ధనధాన్యంబులు హరియించి శత్రులఁ బీడించుటయు వారిఛిద్రంబు లన్వేషించి నీతిచే నుగ్రబలులచే భీషణంబును బ్రాప్తంబైన యుద్ధంబునకుఁ దొడరి మరలక త్రాసంబు గావించుటయు దండంబు నగు. క్రియాభేదంబున నుపాయంబులు భేదిల్లు.

### ఉపాయస్వరూపము - ఉపాయములఁ బ్రయోగించువిధము

నీతిజ్ఞుఁ డయిన పార్థివుఁ డరిమిత్రోదాసీనులు తనకంటె నధికులు గాకుండ సర్వోపాయంబుల యత్నించుచుండ

వలయు. సర్వకార్యంబులకుఁ బ్రధానసాధనంబును శ్రేష్ఠంబు
నగునది సామంబును దదనంతర సాధనంబు దానంబును దర్వా
తిది భేదంబు నగును; కాని ప్రాణసంశయకాలంబున దండంబు
సమాశ్రయణీయంబు. రాజు ప్రబలులగు నరులయందు సామ
దానంబులేని సామభేదంబులేని వినియోగించుచు సముఁడగు
పగవానియందు భేదదండంబులు ప్రయోగించుచు హీనబలుం
డగు రిపునియందుఁ దప్పక దండం బుపయోగించునది. మిత్రు
లందు సామదానంబులె కాని భేదదండంబు లొకప్పుడును
బచరింపఁ దగదు. పుడమిఱేఁడు స్వవిజయార్థంబు శత్రు
రాజులచే బాధింపఁబడిన గుణవంతులగు జనుల సామ
దానంబుల సంగ్రహించుచు దుష్టులకు స్వదేశంబునుండి
నిర్వాసనంబు గావించుచుండవలయుం గాని తన ప్రజల
యందు దండభేదంబులు గావించిన రాజ్యవినాశంబు
గలుగుఁ గావునఁ దన పాలనంబున నున్న వారియెడ నవి
చూపందగదు; మఱియుఁ బ్రజ లత్యధికులు నతిహీనులు గా
కుండ వారిం బావించునది. చెడునడవడినుండి నివృత్తిదమ
నంబు; అది దండంబునన సంభవించు. దేన జంతువు దమి
యింపంబడు నది దండోపాయంబు. రాజు సర్వంబునకుఁ
బ్రభువు గాన నాయుపాయంబు దదధీనంబయియుండు. నిర్భ
ర్త్సనంబు నవమానంబు ననశనంబును జెఱసాలం బెట్టుటయుఁ
దాడనంబును ద్రవ్యహరణంబు పురనిర్వాసనంబు నంక
నంబు నేకదేశ క్షౌరంబు నసద్యానారోపణంబు నంగచ్ఛే
దంబు వధంబు యుద్ధంబు నను నివి యన్నియు దండభేదం
బులగు. దండంబునఁ బ్రజధర్మాసక్తిఁ జరియించు; మఱియుఁ

బూజ్యులకుఁ దిరస్కారంబు ననృతభాషణంబు గావింప నోడు. క్రూరులు మార్దవంబు నొందుదురు. దండంబునఁ బశువులును వశంపడు. చోరులు దండంబునకు వెఱచి యూడనిఁ బాడుదురు; కొండెగాండ్రు మూఁగ లగుదురు; ఆతతాయులు వెఱతురు; కొంద ఱరి యీనొప్పికొండ్రు; కాన నధిపతి ధర్మరక్షణార్థంబు నిచ్చలు దండధరుండు గావలయు. గురుండయినను గార్యాకార్యంబు లెఱుంగక గర్వించి యుద్వృత్తుండయినఁ దప్పక దండార్హుండయగు. జన్నంబులయందుఁ బశ్వాలంభంబుఁబోలె నసాధువులందు హింసయు వేదచోదితంబు గావున నహింసయ యనఁదగు. రాజులకు నెల్లకార్యంబులు దండనీతిన సిద్ధించు; మఱియు నెల్లధర్మంబులకు నదియ శరణం బగు; దండ్యుని దండింపమి నదండ్యుని దండించుటను బరుసంపు దండంబునను రాజు గుణవంతులచేఁ బరిత్యక్తుండును బాతకియు నగు. అల్పదానంబున మహాఫలంబును దండప్రణయనంబునఁబుణ్యంబును శాస్త్రంబులయందు మునివరులు ప్రవృత్త్యర్థంబును భయార్థంబును నిర్వచించిరి గాని యశ్వమేధాది మహాయాగంబులవలని ఫలంబు స్తోత్రపాఠంబునను క్షమచేఁ గల్గు పుణ్యంబు దండంబునను గలుగదు. స్వప్రజా దండంబున రాజులకెట్లు శ్రేయంబు గలుగు? తద్దండంబున నకీర్తియు ధన పుణ్యవినాశంబును గల్గు. కృతయుగంబున రాజు నెల్ల ప్రజలును గేవల ధర్మపరులు గాన దండంబు లేదు. త్రేతయందధర్మలేశంబు గలదు గావున దండంబు పూర్ణంబుగ వలయు. ద్వాపరంబున సంగోరుధర్మంబు గలదు గావునఁ బాదోనంబుగ దండంబు గావలయు. కలియందు రాజ

దౌష్ట్యంబువలనఁ బ్రజ నిస్స్వ కావున నర్థదండంబు విహితంబు. జనులకు ధర్మాధర్మంబు లలవడుచుటంబట్టి రాజు యుగప్రవర్తకుఁ డగు. నృపుఁ డెద్దాన నాతసిల్లు దానిఁ బ్రజ లోభంబునను భయంబునను నాచరించుం గాన మనుజుల యపరాధంబునను యుగంబుల దోషంబునను గాదు గాని రాజుల యపరాధంబునన యధర్మంబు గలుగు.

### మంచిరాజు ప్రవర్తనము

రాజు సుశిక్షకుం డయిన జనం బెట్లు ధర్మపథంబున నడువకుండు? ఎద్దేశంబున మహీపతి ధర్మిష్ఠుం డగు నచటి జనులు ధర్మనిరతులు, నెచట భూపతి యధర్మనిరతుఁ డగు నచటివా రధర్మపరులు నగుదురు. అధర్మవర్తనుల దేశంబునఁ బర్జన్యుండు కాలంబున వర్షింపఁడు. భూమియు మిగుల ఫలింపదు; మఱియు రాష్ట్రంబునకు హ్రాసంబును ధనక్షయంబును బగఱ కభివృద్ధియుఁ గలుగు. భూమీశుండు మిగుల స్త్రీవ్యసక్తుండును నతికోపనుండు నగుటకంటె మద్యపుఁ డయినను వరం బగు. ప్రథముఁడు వర్ణలోపంబును ద్వితీయుఁడు లోకతాపంబును,గావింపనోపుదురు. మద్యంబు త్రావువాని కొక్కనిక బుద్ధి భ్రంశంబును వ్యవహార భ్రంశంబును గావించును గాని కామక్రోధంబు లితరులకును బాధకంబు లగుట మద్యంబు కంటె బలవత్తరంబు లగు. రాజున కతిలోభంబు గలిగినఁ బ్రజల ధనప్రాణంబులు హరియింప నోపును; కావున మీఁదటి దోషంబులు మూఁడును విడిచి రాజు దండధరుండు గావలయు. మఱియు రాజు తన ప్రజల దండించునపుడు మనంబున దయా

క్షువు వెలుపటఁ గ్రూరుండు నై శిక్షించుచుఁ దనకు స్వభా వంబున నహితంబు గావించు వారియెడ నుగ్రదండకల్పుండు గావలయు. రాష్ట్రంబునకుఁ గణ్టకజపులచే హాని గల్గుఁ గాన రాజు సూచితుఁ డయ్యు బాగుగఁ గార్యంబు విమర్శించు చుండవలయు. ఆత్మదోషంబులు రాష్ట్రజనుల దోషంబులును గనుఁగొని వ్యవహరించు రాజుత్తముఁడు. రాజు మొదటఁ దన్ను శిక్షించికొని పిమ్మట భృత్యులను బిమ్మటఁ బ్రజలను శిక్షింప యత్నించునది.

### రాజు శిక్షింపవలయు విధము

అపరాధంబు కాయికంబు వాచికంబు మానసికంబు సాంసర్గికంబు నని నలుఁదెఱఁగు లయియుండు. ఇవన్నియు బుద్ధికృతంబులు నబుద్ధికృతంబులు నని ద్వివిధంబులు. అవి మరలఁ గారితంబులు (చేయింపఁబడినవి) ననుమోదితంబులు (సమ్మతింపఁబడినవి) నని యిరుదెఱంగు లయ్యె. మఱియు నివి యెల్ల సకృత్కృతంబులు నసకృత్కృతంబులు స్వాభావికం బులు నభ్యస్తంబులు నని చతుర్విధంబులు. నేత్ర ముఖా ద్యవయవంబులవికారంబుల మానసికంబును క్రియచేఁ గాయికంబును బరుషవచనంబున వాచికంబును సాహచర్యం బున సాంసర్గికంబును బాగుగఁ దెలిసికొని వాని గౌరవ లాఘవంబులఁ బరికించి చేసిన యపరాధంబులకుఁ జేయఁగల యపరాధంబులకు రాజు దండంబు గావించునది. ఉత్తముఁడు మొదల నల్పాపరాధంబు గావించిన 'నిట్టి తప్పు గావించుట నీబోఁటివానికిఁ దగునా' యని యుపహాసంబు గావించి చీవాట్లు వైచి యట్టి యపరాధంబు మఱిమఱి కావించిన

మీఁదటి యట్ల త్రిగుణంబుగను ద్విగుణంబుగను మండలించి మధ్యమాపరాధంబు గావించిన మొదట ధిగ్దండంబును బిమ్మట నట్లు కావించినఁ బ్రథమాపరాధ దండంబును దర్వాతివానికిఁ గ్రమంబుగ నధికంబుగను దండించుచు నుత్త మాపరాధంబు గావించిన ముందు ప్రథమాపరాధదండం బును ననంతరము మధ్యమాపరాధ దండంబును దర్వాత నుత్తమాపరాధంబునకుఁ దగిన దండంబును గావించి యింక నపరాధంబు గావించిన ద్విగుణంబుగ రాజు శిక్షించి కడపట నవరోధంబు గావించునది. మీఁదటి దండకల్పనంబు బుద్ధి కృతం బయిన నరహత్యకుఁ గాక యితరాపరాధంబులక చెప్పంబడియె. ఈ ప్రకరణంబున నుత్తమ మధ్య మాధమ భావంబులు ముఖ్యంబుగ గుణంబునను దర్వాత గులంబునను ధనంబునను జెప్పంబడె. మధ్యమునిఁ బ్రథమాల్పాపరాధం బున ధిగ్దండంబునను రెండవసారి యర్థదండంబునను మూఁ డవసారి పూర్ణదండంబునను శిక్షించి పిమ్మట నతఁడు దోషి యయ్యెనా ద్విగుణంబుగను ద్రిగుణంబుగను శిక్షించుచుఁ గడపట సంరోధంబు గావించి నీచకర్మంబు సేయ నియో గించునది. మధ్యముఁడు మధ్యమాపరాధంబు గావించిన మొదట నర్ధదండంబునకును బిమ్మట విహితదండంబునకును దర్వాతను నట్లు కావించెనా ద్విగుణదండంబునకును ద్రిగుణ దండంబునకును ననంతరంబు బంధనంబునకును దగును.

మధ్యముఁడు మహాపరాధంబు గావించిన మొదట మధ్యమాపరాధదండంబునను దర్వాత యథోక్తదండంబునను గ్రమంబుగ ద్విగుణమునను ద్రిగుణంబునను రాజు శాసించి

పిమ్మటను దోషి యయ్యెనా జీవితావధికముగ బంధనాగారమున నుంచునది. అధముఁ డల్పాపరాధంబు చేసిన ముం దర్ధదండంబునను బిమ్మటఁ బూర్ణదండంబునను శిక్షించి యనంతరము సంశోధనంబు గావించి యతనిచే నధిపతి మార్గసంస్కారము సేయించుచుండవలయు. అధముఁడు మధ్యమాపరాధమున మొదటిమా అల్పాపరాధ దండమునను రెండవసారి చేసిన యపరాధమునకుఁ దగిన దండమునను మూఁడవసారి ద్విగుణదండంబునను దండ్యుఁ డగు. అధముఁ డుత్తమాపరాధంబు గావించిన మొదట మధ్యమాపరాధ దండమును దర్వాత విహితదండమును గావించి యనంతరపర్యాయమున ద్విగుణముగ శిక్షించి తర్వాత యావజ్జీవమును నిగళమున బంధించి నీచకార్యంబులన సేయ నతని నధికారి నియోగించునది. ఎవ్వఁడు ధనగర్వమున నపరాధము గావించు నాతని ప్రథమాపరాధమున నర్ధంబునఁ జతుర్థాంశంబు హోముచేసి పుచ్చికొని యనంతరాగంబున నర్ధంబును దృతీయమంతువున సకలధనమును హరియించి తర్వాత జీవితం బుండునంతదనుక బంధనాలయమున నుండ రాజు శాసించునది. సహాయగౌరవమునను విద్యామదంబునను బలదర్పమునను పాపంబు గావించువాని శృంఖలంబుల బంధించి పలుమాఱు కశల మోదించునది. భార్యయుఁ బుత్త్రుఁడు భగినియు శిష్యుఁడు దాసుండుఁ గోడలు ననుజుఁడు నపరాధము గావించిన గృహస్థుఁడు సన్నంపుఁద్రాటనేని యట్టి వేణువుననేని శరీరమునకుఁ జరమభాగమునఁ గొట్టవలయుం గాని యుత్తమాంగమున నెన్నఁడు దండింపఁ గూడదు.

అశ్లీవఁడయిన దండించిన రాజు వానిఁ జోరదండమున దండింపవలయు. మఱియు రాజు పాపాత్ముని దప్పునకుఁ దగినట్లు మాసం బేని మూఁడుమాసంబు లేని యాఱునెల లేని వత్సరం బేని యావజ్జీవం బేని బంధనాలయంబున నుంచి నీచ కర్మముల నియోగించుచుండవలయుం గాని యెట్టి యపరాధినైనను వధదండంబున దండింపఁదగదు. భూతంబుల హింసింపఁ దగదని వేదంబు లుగ్గడించుఁ గాన రాజు సర్వప్రయత్నంబులను వధం బుజ్జగించి యవరోధమునను బంధనంబునను దాడనమునను దోషిని బాధింపవలయును, కాని లోభంబున ధనదండంబును విధింపఁ దగదు. తప్పు గావించినవానికి సహాయులు గాని పిత్రాదిబంధువులు దండ్యులు గారు. ఇది క్షమాశీలుం డయిన రాజు దండ ప్రకారంబు. రా జుగ్రదండుండు ధనహారకుండు నై యపరాధముల నైఁపనప్పుడు లోకంబు కలఁత నొంది శత్రుభేదమునకు సుసాధం బగుం గావున క్షమాపతి క్షమావంతుఁడు రంజకుండు నయి జనుల యెడ న్యాయ్యంబుగ దండంబు ప్రయోగించుచుండవలయు.

శిక్షార్హులు - శిక్షయును

మద్యంబు త్రావువాఁడు జూదరియుఁ జోరుండును జారుఁడును బరహింస గావించువాఁడును వర్ణాశ్రమాచారములఁ ద్యజించినవాఁడును నాస్తికుఁడు శఠుఁడును మిథ్యాభిశాపకుఁడు కర్ణేజపుఁడు (Tale-Bearer) నార్యుల దేవతల దూషించువాఁడు ననృతవాదియు న్యాసహారియుఁ (దాఁచికొన్న సొమ్ము హరించినవాఁడు) బరులవృత్తికి హాని చేయువాఁడును బరులసంపద నోర్వనివాఁడును లంచంబున నాసక్తుఁడును

జెడుకార్యంబులఁ గావించువాఁడును మంతనము వెలువఱుచు వాఁడును గార్యంబులఁ జెడనడఁచువాఁడును బరుసములు ననిష్టంబులు పల్కువాఁడును సుజలాశయముల నారామములఁ బాడుచేయువాఁడును నక్షత్రసూచియు రాజవిద్వేషియుఁ గుమంత్రియుఁ గుసాక్షియు డాంబికుండును స్వామిద్రోహియు నాయంబుకంటె నెచ్చు వెచ్చించువాఁడును జిచ్చు వెట్టువాఁడును విషంబు ప్రయోగించువాఁడును బ్రబలదండంబు గావించువాఁడును బాక్షికుండయిన ధర్మాధికారియు బలంబున లిఖితంబు (దస్తావేజు) గ్రహించువాఁడును గలహశీలుండును యుద్ధపరాఙ్ముఖుండును రాజశత్రుల సేవించువాఁడును గ్రామకంటకుఁడును దల్లిదండ్రులకు నొండె సతి యగు భార్యకొండె మిత్రులకొండె ద్రోహముసేయఁ దలఁపుగొన్న వాఁడును గుటుంబభరణమునకుఁ దగిన వెరవు సూపక విద్యాభ్యాసంబునకుఁ దపంబునకు నరుగువాఁడును తృణకాష్ఠాదుల నోచికొనశక్తుఁ డయ్యు బికిరంబున జీవించువాఁడును రాజదాయల దాఁచువాఁడును గన్యావిక్రేతయు రాజు ననిష్టం బుపేక్షించు వాఁడును గుటుంబవృత్తికి హానిచేయువాఁడును నగు పురుషుల యందును గులటయుఁ బతిం బుత్రులను హింసించునదియు నెల్లపుడు గృహకృత్యంబుల విడిచినదియు దురాచారురాలు స్నుషయుం దప్రియయు నగునింతులయందును స్వభావదుష్టులగువారిం దెలిసికొని యపరాధానుసారంబుగ రాజు దేశంబునుండి వెడలనడఁచుచు ద్వీపాంతరమున నేని దృఢబంధము గావించి దుర్గమధ్యంబున నేని వసియింపఁ జేయుచుఁ గదన్నంబునను న్యూనభోజనంబునను గృశింపఁ జేయుచు మార్గసం

ష్కారణమున నియోగించుచుఁ దత్తజ్ఞాత్యుచితంబు లయిన కర్మంబులు వారిచేఁ జేయించుచు నిట్లు సంసర్గమున దుష్టులగు వారి సయితము దండించుచు నెల్లవారిని సన్మార్గమునకుఁ ద్రిప్పునది. మఱియు రాజు తనకును రాష్ట్రజనమునకును మంత్రిగణమునకును శత్రుసంబంధమున వినాశంబు గావింపఁ గడంగువాని సరగ వధించునది. సమాజమున దౌష్ట్యంబు గలప్పుడు ఱేఁడొక్కమాఱు గణంబునకు హానిసేయక పర్యాయమునఁ దన్నాశంబు సేయవలయు. రాజధర్మనిరతుఁడయి నపుడు ధర్మశీలుండు నతిబలుండు నగు నతనిశత్రు నాశ్రయించి జనంబు లతని భయపడుచునది. రా జెంతదనుక ధర్మైకపరాయణుం డగు నంతదనుక రా జగు. ధర్మశీలుఁడు గాకున్నఁ బ్రజలును రాజును శీఘ్రముగ నశియింత్రు. నిరపరాధు లగు తల్లిం దండ్రిని భార్యను బరిత్యజించిన భృత్యుని నిగడంబుల బంధించి మార్గశోధనంబున నియోగించి యతని భృతియం దర్ధంబు వారిజీవనంబున కిచ్చుచుండవలయు. మహాపరాధంబునకుఁ బణసహస్రంబు దండంబని రా జెఱుఁగునది. రాజముద్రాముద్రితంబయిన దశమాషమాత్ర తామ్ర నాణకంబు పణంబునాఁబడు. సార్థశతవరాటికామూల్యం బయిన తామ్రనాణకంబు కార్షాపణంబు. మధ్యమాపరాధంబులకు నూఱుపణంబులును బ్రథమాపరాధంబున కందున నర్ధంబును రాజు దండంబు విధించునది. ఇట్లు మిశ్రంబున నుపాయములతో నరిమిత్రోదాసీనులు చెప్పంబడిరి.

ఇది చతుర్థాధ్యాయంబునఁ బ్రథమప్రకరణము.

# చతుర్థాధ్యాయము



## ద్వితీయప్రకరణము

అనంతరము మిశ్రంబున ద్వితీయమైన కోశప్రకరణం బు నుపక్రమించి చెప్పెద నని శుక్రుం డిట్లనియె.

### కోశ (Treasure) స్వరూపము - దాని సంగ్రహించువిధమును

సజాతీయార్థసముదాయంబు వేఱ్వేఱఁ గోశంబు నాఁ బడు. రా జెద్దియే నొక్క యుపాయంబున ధనంబు సంపాదించి దాన రాష్ట్రంబును బలంబును యజ్ఞాదిసత్క్రియాకలాపంబును రక్షించునది. సేనాప్రజాసత్క్రియా రక్షణార్థం బయిన ధనసంగ్రహం బుభయలోకసుఖదంబు నితరంబు దుఃఖదంబు నగు. దారపుత్రార్థంబు నుపభోగార్థంబు నగు ధనసంగ్రహంబు నరకకారియ యగుంగాని లోకాంతరంబున సుఖంబు నీఁజాలదు. అన్యాయంబున నేవానినుండి యేని ధనంబు నాఁచికొనురాజు వాని పాపంబు నొందు. పాత్రునివలన గ్రహించిన ధనము నతనికిచ్చిన ధనముఁ గ్రమంబుగ వర్ధిల్లు. త్యాగమియు సద్వ్యయుండును బాత్రుండును విపరీతుం డపాత్రుండును నగుదురు. రాజపాత్రుల సర్వస్వంబు హరియించియు నధర్మశీలు రయిన నృపాలురధనము హరియించియుఁ బాపభాజనము గాఁడు గావున నట్టివారి నుండియు బలంబున

నేని ఛలంబుననేని దస్యువృత్తినేని పరరాష్ట్రముల నుండియు ధనంబు తప్పక సంగ్రహించునది. సత్ప్రవర్తనము వదలి స్వదేశప్రజలఁ బీడించి యార్జించురాజు ధనసంచయంబు రాజ్యముతోఁ గూడ శత్రుల యధీనంబగు. రాజు లాపద లేని యపుడు దండ భూభాగశుల్కాధిక్యంబునను దీర్ఘదేవ కర గ్రహంబునను గోశవర్ధనంబు గావింపందగదు గాని శత్రువినాశార్థం బధికబలసంధారణంబు గావింప యత్నించునపుడు విశిష్టదండశుల్కాదుల లోకమునుండి ధనము హరింపఁదగు. మఱియు నాపత్కాలంబున ధనికులకు భృతినిచ్చుచు వారి ధనంబు పుచ్చికొని యాపత్సముత్తీర్ణుం డయి మరల దాని సవృద్ధికంబుగ నీవలయు. అట్లు కానినాఁడు ప్రజయుఁ గోశం బును రాజును క్షీణించు. మున్ను సురథాదులు ప్రబలదండం బున నశించిరి యని వినుదుము గాదె. స్వప్రజారక్షణక్షముఁ డయిన రాజునకు దండభూభాగశుల్కాదులు గానకున్నను వింశతివత్సరంబుల దనుకఁ దనకును దండునకును సంరక్షణ క్షమంబయిన కోశంబు ధార్యంబగు. బలమూలంబు కోశం బును గోశమూలంబు బలంబు నని బుధులు స్మరియింత్రు గాన బలరక్షణంబు గావించు రాజునకుఁ గోశంబును రాష్ట్రవృద్ధి యు నరిక్షయంబును బ్రజాపాలనంబున స్వర్గమును సిద్ధించు. ద్రవ్యము యజ్ఞార్థమును యజ్ఞంబు స్వర్గసుఖమునకు నుత్ప న్నంబు లయ్యె. శత్రులయభావంబును బలమును గోశమును రాజ్యవృద్ధికరములు. క్షమాశీలుం డయిన నృపునకుఁ దద్వృద్ధినీతి నై పుణ్యంబున నగునుగాన బుద్ధికోలఁదిఁ దదర్థంబు యత్నించుచుండవలయు.

మాలాకారుండు వృక్షములఁ బెనిచి పుష్పంబులఁ గొనునట్లు ప్రజల రక్షించి సంపాదించిన భాగమునను బగఱం గరదులఁ గావించి సంపాదించిన ధనమునను గోశంబు పెంచు రాజులు శ్రేష్ఠులు. కృషివాణిజ్యాది వైశ్యవ్యాపారముల ధనార్జనము సేయువారు మధ్యములును సేవను దండమునను దీర్ఘదేవకరగ్రహంబులను సొమ్ము సంపాదించువా రధములు నగుదురు. హీనధను లయిన జనులును మధ్యధను లయిన భృత్యులును రాజులకు రక్షణీయులు. అధికృతులుం బ్రతిభువులును ద్రవ్యవంతు లయినకొలఁది నుత్తము లగుదురు. ఉత్తమధనులయిన ధనికులు రాజులకు హీనాధికులు గాకుండువారు. పండ్రెండేండ్లు కుటుంబము రక్షింపఁజాలిన ధనము హీనమును బదియునాఱబ్దంబులు కుటుంబము రక్షింపఁ బర్యాప్తం బయినది మధ్యమంబును ముప్పదివత్సరంబులు ప్రోవ సమర్థంబయినది యుత్తమధనము నగు. మహార్ఘంబగు కాలంబునఁ బదార్థంబుల విక్రయించుచుఁ దక్కువవెల గల కాలంబున విలుచుచు వణిజులు భాండమునన కాని వృద్ధిచేత వ్యవహరింపరు. రాజు లాపత్కాలమునను వ్యవహారమునందలి ధనము గాక తక్కిన యెల్లవారల ధనముఁ గ్రమముగ రక్షింపవలయును. అట్లు కావింపనినాఁడు ప్రజాసంతాపంబు సాన్వయంబుగ నృపుని దహింపనోపు.

### ధాన్యసంగ్రహము

రాజు లాయాయికాలంబుల రాష్ట్రార్థమును నాత్మహితార్థమును మూఁడేండ్ల భోజనంబునకుఁ జాలిన ధాన్యము

సంగ్రహించి యుంచునది. ధాన్యంబు చిరస్థాయియు నెల్ల సంపదలలో నధికము నగు. సుపుష్టమును గాంతిమంతమును బ్రశస్యజాతియు శుష్కముఁ గ్రొత్తదియు సుగంధియు సువర్ణమును జిరస్థాయియు రసవంతము నగు ధాన్యముఁ బరిశీలించి మహార్ఘం బయ్యు నట్టిదానిని సంగ్రహించి రక్షింపవలయు. విషమునను నగ్నిని స్పృష్టము నిమము దాఁకినది గీటజుష్టము నగుకొల్చు సంధరింపఁ జనదు. సంగ్రహించిన ధాన్యము నిస్సారముగాక మున్న వెచ్చించుచు వ్యయపఱిచినవానికిఁ దుల్యపరిమాణం బగు క్రొత్తధాన్యం బేఁటేఁటఁ బ్రయత్నమున రాజు సంగ్రహించునది. మఱియు నోషధులు ధాతువులు (=ఖనిజములు) తృణకాష్ఠాదులు జంత్రములు శస్త్రాస్త్రములు,నగ్నిచూర్ణము భాండాదులు వసనములు నింకను గార్యసాధకములగు నితరపదార్థములు సుప్రయత్నమున సంగ్రహించి సంగృహీతము లయినవాని రక్షించుచుండవలయు. ఆర్జనముననొందు శ్రమముకంటె రక్షణమున నాయాసము చతుర్గుణంబధికము. ఆర్జించినవస్తువు క్షణ ముపేక్షించిన నశియించు. సంపాదించిన వస్తువులు నశించిన సంపాదకునకు మిక్కిలి దుఃఖము వొడముగాని యతని స్త్రీపుత్త్రాదులకు నంతసుఃఖము వొడమదన నితరులకును జెప్పనేల? ఎవఁడు తనకార్యమున శిథిలప్రయత్నుం డగు నతని సహాయులు నట్ల యగుదురు. ఎవ్వాఁడు తనకార్యంబున మెలఁకువపడు నతని సహాయులును వానికిం దుల్యు లగుదురు. ఎవ్వఁ డార్జింప శక్తుఁడయ్యు నార్జించిన వానిరక్షింప నశక్తుఁ డగు వానికంటె మూఢుఁడు వేఱొకఁడు లేఁడు. వానియార్జనశ్రమం బెల్ల విఠ

యగు. ఏకాధికారంబున నిద్దఱ నియమించువాఁడును జీవద్ద్వి
భార్యుండును నతివిస్రంభవంతుఁడును మహాధనాశుండు నల
సుండును స్త్రీజితుండును జారచోరాతతాయులయం దేవాని
నేని సాక్ష్యం బడుగువాఁడును మూర్ఖులు. ఎల్లవాఁడును కృప
ణుండువోలె ధనంబుల రక్షించుచుఁ గర్జంబుతఱి విరక్తుండు
వోలె వెచ్చింపకున్నను నిరర్థకంబుగ వెచ్చించినను మౌర్ఖ్యం
బునొందు. వస్తువుల యాథాత్మ్యంబు పరీక్షింప మనుజుండు
తాన యత్నింపవలయుం గాని యన్యుల నియోగింపఁ జనదు.

### రత్నసంగ్రహము - వాని స్వరూపాదులును

రాజు పరీక్షకులచేఁ బరీక్షింపించి రత్నాదిపదార్థం
బులఁ గాపాడునది. వజ్రంబును మౌక్తికంబును బ్రవాళం
బును గోమేదంబు నింద్రనీలంబును వైడూర్యంబుఁ బుష్యరా
గంబును బాఁచియు మాణిక్యంబు నను తొమ్మిదియు మహా
రత్నంబు లని విద్వాంసులు చెప్పుదురు. రక్తవర్ణంబు నింద్ర
గోపకాంతంబు నగు మాణిక్యంబు గాములసూర్యునికిని రక్తంబును
బీతంబును శ్యామంబు నగు మౌక్తికంబు చంద్రునకును,
మాంజిష్ఠంబయిన ప్రవాళంబు నేలపట్టికిని మయూర చాష
పత్రాభంబయిన పాచిబుధునకును స్వర్ణవర్ణం బయిన పుష్య
రాగంబు బృహస్పతికి నత్యంతవిశదంబుఁ దారకాభంబు నగు
వజ్రంబు శుక్రునకును వార్షికాబ్దనీలం బయిన నీలంబు శనై
శ్చరునకు, సిమత్పీతారుణప్రభం బయిన గోమేదంబు రాహున
కును మార్జారాక్షినిభం బయిన వైడూర్యంబు కేతుగ్రహం
బునకును బ్రీతికరంబు లగు. రతనంబులలో వజ్రంబు శ్రేష్ఠ

తరంబును గోమేదవిద్రుమంబులు హీనంబులును గారుత్మత మాణిక్య మౌక్తికంబులు శ్రేష్ఠంబులును బుష్యరాగేంద్ర నీల వైడూర్యంబులు మధ్యమంబులు నని చెప్పంబడు. ఎల్ల రత్నంబులకంటె మహాద్యుతిమంతం బయిన యహిజం బగు మణి శ్రేష్ఠతమంబ కాని యది దుర్లభంబు. అజాల గర్భంబును గీఱలుం జుక్కలు లేనిదియు సద్వర్ణంబును సత్కోణంబును సుప్రభంబు నగు రత్నంబు శ్రేష్ఠం బని తద్విదులు చెప్పుదురు. శర్కరాభంబు దలాభంబు చిపిటంబు వర్తులంబు నని రత్నంబు లెల్ల నలుఁదెఱంగుల నుండు. సిత రక్త పీత కృష్ణంబు లయిన ప్రభావర్ణంబులు రత్నజంబులు. దోషవర్జితం బయిన రత్నంబు ప్రభావర్ణంబుల ననుసరించి యైశ్వర్యంబుం బుష్టియు శౌర్యంబు నాయువు ధరియించు వారి కొసఁగు. కోకనదచ్ఛవి యైన పద్మరాగంబు మాణిక్య భేదంబగు. పుత్త్రకామ యగునారి యెక్కుడ్పుడును వజ్రంబు ధరియింపఁ జనదు. నిర్దుష్టం బయిన రత్నంబునకు గౌరవంబు నను బ్రభావర్ణంబులను విస్తారంబున నాశ్రయంబున నాకా రంబునను మూల్యం బధికం బగుచుండు. ముత్యంబుం బవడం బును ధరియింపఁ గాలంబున జీర్ణంబగు. ముక్తాప్రవాళం బులకంటె నితరంబు లగు మణులు పాషాణంబున నాయసం బునను నుల్లేఖ్యంబులు గావని రత్నవిదులు వల్కుదురు. సద్గు ణంబయిన రత్నంబు విరివిగలిగి లఘువయిన నధికమూల్యంబు నకును బరిమాణంబున నల్పంబయి గురువైన నల్పార్ఘంబున కును దగు. శర్కరాభంబయిన మణికి నల్పంబును జిపిటము నకును మధ్యమమును దలాభంబయిన దాని కధికమును వర్తు

లంబయిన దానికి యథాకామముగను వెలయగుంగాని రాజ ద్రాష్ట్రమున వాని కర్షం బధికంబు నల్పంబు నగుచుండు. ముక్తాప్రవాళేతరంబు లయినమణులు చిరకాలంబు ధృతంబు లయ్యు జీర్ణింపవు. ముత్తియంబులు మత్స్యాహిశంఖంబుల వలనను వేణువరాహజీమూతంబులవలనను శుక్తులవలననుం బుట్టును గాని వానియందు శుక్త్యుద్భవంబులు మెండయి యుండు. శుక్తిజంబులయందుఁ గృష్ణవర్ణంబులు ద్వికంచుకం బులు గనిష్ఠంబులును సితవర్ణంబును నాల్గుపొరలు గలదియు మధ్యమంబును బీతరక్తంబు సప్తకంచుకంబు శ్రేష్ఠంబును నగు. ఇట్టి ముత్తెంబులు వేధ్యంబులు నితరంబు లవేధ్యంబులు నగు. మఱియు సింహళద్వీపవాసులు కృత్రిమంబు లయిన తారల రచియింత్రు గాన సందియంబుదీరఁ బరీక్షకుఁడు వానిఁ బరీక్షించునది. లవణంబుతోడను జమురుతోడను గూడిన యుష్ణజలంబున నొక్కరే యునిచి వ్రీహులతో మర్దించిన వైవర్ణ్యంబు నొందని ముత్తియంబు లకృత్రిమంబు లనియుఁ దక్కినవి కృత్రిమంబు లనియు నెఱుఁగునది. శుక్తిజాతంబయిన మౌక్తికజాతం బుత్తమప్రభంబును దదితరజాతంబు మధ్య మప్రభంబు నగు. గోమేదకభిన్నం బయిన రత్నంబుల కెల్ల నర్ఘ్యవు తులాకల్పితంబు గావలయు.

## రత్నముల వెల

ముత్తియంబులకుఁ గాక యితరరత్నంబులకు వింశతి సంఖ్యాకంబు లయిన త్సుమ లొక్కరతి యగు. ముత్తియం బులకు నాల్గుకృష్ణలంబులు మూఁడురక్తు లగు. ఇరువదినాల్గు

రతు లొక్క రత్నటంకం బగు. స్వర్ణవిద్రుమంబులకు నాల్గు టంకంబు లొక్కతోలం బగు. ఏకర క్తిమితం బయిన యేక హీరంబునకు సువిస్తృత దలంబునకుం బరీక్షకుం డుత్తమ మూల్యంబు పంచసువర్ణకంబులు నిర్ధరించునది. పరిమాణా ధిక్యంబును బెక్కుకోణంబులుం గలిగిన నధికమూల్యంబును మానంబు తక్కువయిన కొలంది నల్పపువెలయు నిర్ణయింపం దగు. ఇం దెనిమిదిరతు లొక్కమాషంబును బదిమాషంబు లొక్క సువర్ణకంబు నగు. అయిదు సువర్ణంబుల మూల్యం బెనుబదిరాజతకర్షంబు లగు. వజ్రంబునకు బరువుంబట్టి రక్త్యనుసారంబుగ మూల్యంబు నిర్ణయించునపుడు చిపిటం బయినదానికి వెల మున్ను చెప్పిన వజ్రంబు వెలకంటె మూండవయంశంబు న్యూనంబుగ నేర్పడు. శర్కరాభం బయిన హీరంబునకు నుత్తమమూల్యంబునం దర్ధంబు వెల యగు. ఒక్కరతి పరిమాణంబు గల రెండు మగతాలవెల సార్ధద్విసువర్ణకంబులును నంతియె పరిమితి గల పెక్కు మగ మానికంబులకు మూల్యంబుమీఁది దానియం దర్ధంబు నగు; మఱియు గుణాహ్యాంబున వాని విలువ మున్ను చెప్పిన దాని యందు సగంబును నాల్గవపాలు నగు. దలాభంబులుం జిపి టంబులు వర్తులంబులు నగు వజ్రంబు లొక్కనివలన నొక్క మాఱు నూఱురతులకంటె నధికంబుగ విలిచెనేని శత శతం బునకు న్వింశతి రతులకు హ్రాసించి శేషించినవానికి మూ ల్యంబు గొన్నవాఁ డిచ్చుచుండవలయు; మఱియు శర్కరా భంబు లయిన నేఁబదిరక్తులయిన న్నలుబదిరక్తులైనం గొన్న ను నట్లు హ్రాసించియె వెల యీవలయు. కృష్ణవర్ణంబును

రక్తబిందుయుతంబునగు రత్నం బేనాఁడును శ్రేయస్కాముండు ధరియింపఁదగదు. గారుత్మతంబు మాణిక్యంబు నుత్తమంబు లయ్యేనేని రతి కొక్క సువర్ణం బుత్తమమూల్యంబు. నంతకంటె నధికపరిమాణంబు గలిగినఁ దదనుసారముగ మూల్యంబునగు. రక్తిపరిమితంబు లగు పుష్యరాగ నీలముల కుత్తమమూల్యము సువర్ణమునం దర్ధంబగు. ప్రశస్తంబయిన వైడూర్యము నుత్తమమూల్యమునకుఁ దగు. తోలకమితం బయిన ప్రవాళంబుమూల్యం బర్ధసువర్ణకం బగు. గోమేదం బల్పమూల్యంబు గావున నున్మానంబునకుఁ దగదు. అల్ప పరిమాణంబులయిన హీరభిన్నంబు లగు రత్నంబులకు సంఖ్యన వెల నిర్ణయింపఁదగు. అత్యంతరమణీయంబులు దుర్లభంబులు నగు మణులకుఁ గ్రయద్రవ్యం బిచ్ఛానుసారంబుగ నుండు. మహాగుణసంపన్నంబు లయిన మణులకెల్ల మానంబునం గాక వెల యథాకామంబుగఁ గల్పింపఁ దగు. ఉత్తమంబయిన ముత్తియంబున కర్ధసువర్ణంబును దక్కువగుణంబు గలదానికిఁ దక్కువయును గ్రమంబుగ వెల యగు. రక్తవర్ణంబును బీతంబును సితంబును వర్తులంబు నగు ముత్తెంబు శ్రేష్ఠంబును జపిటంబు శర్కరాభంబు నధమంబును దక్కనవి మధ్యమంబులు నని తద్విదులు వల్కుదురు.

### లోహస్వరూపమును - వాని మూల్యములును

రతనంబులందు స్వాభావికంబులును ధాతువులందుఁ గృత్రిమంబులు నగు దోషంబులు పెక్కులుండుం గాన విద్వాంసుండు వానిం బాగుగఁ బరీక్షించి యర్ఘంబు నిర్ణ

యించునది. స్వర్ణ రజత తామ్ర వంగ సీస రంగలోహంబు లేడును ధాతువులును దక్కిన యారకూటాదులు దత్సంకరం బులు, నిందు బూర్వపూర్వంబు శ్రేష్ఠంబు నని ధాతువిదులు చెప్పుదురు. ధాతువులన్నిటను గార్తస్వరంబు ప్రశస్యతమంబు. వంగతామ్రంబుల సంయోగంబునఁ గాంస్యంబును దామ్ర రంగంబుల సంయోగంబునఁ బిత్తలంబు నుత్పన్నం బగు. ప్రమాణంబున సమంబులయ్యు భర్మంబు తనువు నితరంబులు పృథులంబులు నయి కాన్పించు. జంత్రంబులయు నాయుధము లయు నాకారము నొందిన లోహము నుహామూల్యం బగు. సువర్ణమునకు షోడశగుణంబయిన రజతమును దఱచుగ నశీతి గుణం బయిన తామ్రము రజతమునకును, సార్ధకగుణం బయిన వంగమును ద్విగుణంబయిన రంగమును ద్విగుణంబయిన సీస మును షడ్గుణంబయిన లోహమును దామ్రమునకును మూల్య ము లగు. ఇది విశిష్టంబయిన రత్న ధాతుమూల్యకల్పనం బని తత్స్వరూపజ్ఞులు సెప్పిరి.

### ఆవు మొదలగు పెంపుడు జంతువుల వెలలు

సుశృంగములు మంచివర్ణమును లేఁబ్రాయమును గలిగి బహుదుగ్ధయై సువత్సకయైనగో వల్పయేని మహతియేని మహార్ఘమునకుఁ దగు. పీతవత్స యయ్యుఁ బ్రస్థదుగ్ధ యైన గోవునకు రాజతం బయిన యొక్కపలము మూల్యం బగు. అయిదుగుంజ లొక్కమాషమును బదియునాలుమాషము లొక్కనిష్కమును నాల్గునిష్కము లొక్కపలమును నగు. అజకు గోవునర్ఘమునం దర్ధంబును మేషి కందు సగంబును

మూల్యంబగుం గాని యుద్ధశీలంబును సుదృఢంబు నగు మేషం బునకు రాజతంబగు నొక పలంబు వెల యగు. గోవుల కుత్తమంపు వెల పదియే నెన్మిదేని రజతపలంబులును నజావిజాతంబునకు మహార్ఘ్యం బేకపలంబును నగు. మహిషికి గోవు వెలయు మఱియు నం దర్ధంబు నుత్తమం బయిన వెల యగు. సుదృఢం బును బలవంతంబును సుశృంగంబును సౌష్ఠవయు శీఘ్రగమనం బును నగు సప్తతాలప్రమాణం బయిన వృషభంబున కఱువది రాజతపలంబులును మహిషంబున కేడే నెన్మిదేని పలంబులును గజాశ్వంబులకు వేయేని రెండువేలేని మూడువేలేని, నాల్గు వేలేని పలంబులును గ్రమేలకంబునకు మాహిషసమంబును మహార్ఘ్యంబు లని తచ్ఛాస్త్రజ్ఞులచేఁ జెప్పంబడె. ఒక్క దివసం బునన నూఱుయోజనంబులు పోఁ గల యశ్వం బుత్తమంబును దానికిఁ బంచశతసువర్ణ ముత్తమమూల్యము నని నిర్ణీతంబయ్యె. ఏకాహమున ముప్పదియోజనములు నడువ శక్తి గల యుష్ట్ర ముత్తమమును దను త్తమమూల్యము పలశతము నగు. సర్వ విధముల నుత్తమంబయిన గోరున కుత్తమమూల్యము రెండు వేలనిష్కములు. నాల్గుమాషముల పరిమితి గల శాతకుంభం బొకనిష్కమును నైదురక్తు లొక్కమాషము నని గజమూల్య మున నిర్ణయింపఁబడె. భూమియుం దత్ప్రతిమములయిన వస్తువు లెల్ల రత్నభూతముల యగుం గావున వానిమూల్యము దేశ కాలానుసారముగఁ బ్రభువులచేఁ గల్పనీయం బగు. వ్యవహా రాక్షమము గుణహీనము నగుపదార్థమునకు మూల్యము కల్పింపఁదగదు. ఎల్ల పదార్థములకు వెల నీచమధ్యమోత్తమ భేదమునఁ గల్పించునది.

## పన్ను గ్రహించు పద్ధతి

పదార్థజాతము నమ్మినవారినుండియుఁ గొన్నవారి నుండియు గ్రహియింపఁబడిన రాజభాగము శుల్కం బని బుధులు వ్యవహరింత్రు. హట్టమార్గములు నాకరంబులు సీమలును శుల్కదేశము లగు. రాజు వస్తుసముదాయమున కొక్కమాఱు జతనమునఁ దనరాష్ట్రమున సుంకము గ్రహింపఁదగుం గాని ఛలమునఁ బలుమాఱు గ్రహింపఁదగదు. విక్రేతనుండియేని క్రేతనుండియేని వస్తుపునర్ఘమునందు ముప్పదిరెండవ యంశము రాజు గ్రహించునది. సుంకము వింశాంశము షోడశాంశమునయినను మూలద్రవ్యమునకు హాని సేయకుండు. కొన్న మూల్యమునకు సమంబుగను హీనముగను విక్రయించువారి వలన రాజభాగంబు గొనందగదు. రాజెల్లపుడును సరకులఁ గొన్న వారిలాభము పరికించి యరి గొన శ్రేయంబగు. భూపతి బహుఫలములు మధ్యఫలములు నల్పఫలములు నగు భూప్రదేశములఁ గొల్పించి సంగోరు నిర్ణయించి కర్షకునధీనంబు చేసి పిమ్మట వానికినష్టము లేకుండ భాగంబు గొనునది; మఱియు ఫలతారతమ్యంబు లెస్సగఁ బరికించి యంగారకారునిఁ బోలక మాలాకారుం బోలి భాగంబు హరించుచుండవలయు. రాజభాగాదిసకలవ్యయంబుకంటె ద్విగుణంబగు లాభంబు గావించు కృషికృత్యంబు కృషీవలునకు సుఖదంబు నితరంబు దుఃఖదము నగు. వాపీకూపతటాకాది జలాశయంబుల సహాయమున ఫలించు భూభాగమునుండి తృతీయాంశమును వర్షమునన పండునేలనుండి తురీయాంశమును నదీమాతృకంబయిన యుర్వరనుండి సంగోరును గుల్మపాషాణాది సమాకులం బయిన

భూమినుండి షష్ఠాంశమును నగు ఫలము రాజు గ్రహించునది. ఏ కాఁపువలనఁ భూమికాశున కేఁటేఁట శతరాజతకర్షమితంబయిన భాగము వచ్చునతని కిరువదిమానంౘ దగు. ఖనిజంబయిన సువర్ణమునందు నర్ధంబును రూప్యమునఁ మూఁడవయంశమును దామ్రమున నాల్గవపాలును లోహసీసాదుల నాఱవ భాగమును మణులయందును క్షారంబులందు నర్ధమును వ్యయశేషమునఁ గర్షకునకు లాభాధిక్యము గలుగునట్లు నృపతి స్వభాగము హరియించుచుఁ దృణకాష్ఠాదుల నరణ్యమునుండి సంగ్రహించి జీవించువానినుండి వింశాంశము కరంబు గ్రహించునది. అజావిగోమహిష్యశ్వంబుల వృద్ధియం దేనిమిదవయంశము రాజభాగం బగు; మఱియు గవాదిదుగ్ధంబుల షోడశాంశము రాజరి గొనునది. కారు శిల్పాదిగణంబువలనఁ బక్షమున కొక్కదినమునఁ బనిగొనవలయు. కొఱఁకులు నూతనముగ దున్ను వారినుండియు భూమి ఫలవతిం జేయ వాపీకూపాదుల నేని కుల్య నేని త్రవ్వించిన కర్షకునివలనను వారి కయిన వ్యయమునకంటె ద్విగుణముగ ధనము తత్ఫలమునఁ గూడునంత దనుక రాజు బలి గ్రహింపఁదగదు. భూమిఫలమున భాగమును నిర్వేశమును సుంకమును వడ్డియు నుత్కోచమును గప్పమును గాలవిలంబనము గావింపక బుద్ధిమంతుఁడు నియతకాలమున గ్రహింపవలయు. భూములయందు భాగము నిర్ణయించుకొని ధనవంతు నొక్కని లగ్నకుం బుచ్చికొనియైన వారివలన నేని కర్షకులవలన వేర్వేఱనేని నిరుప వచ్చినంత సొమ్ము ముందు పుచ్చికొనియైన, నొక్క పర్యాయంబేని పెక్కుపర్యాయంబులేని ధనము గ్రహింప నిశ్చయించి

కొనినయైన రాజు కర్షకుల కెల్ల స్వచిహ్నితము లయిన భాగ పత్త్రంబులు వ్రాయించి యీవలయు. మఱియు నెనమంద్ర నేని పదుంద్ర నేని యంతకంటె నెక్కువ సంఖ్యగలవారి నేని గ్రామాయంబున నాఱవపాలికి మించకుండ వేతనంబు నియమించి గ్రామపాలుర నేర్పఱుచునది. గవాదిదుగ్ధంబుల విక్రయింపక కుటుంబార్థం బుపయోగించు గేస్తునివలన రాజు స్వభాగంబు హరియింపఁ జనదు. మఱియు ధాన్యవస్త్రాది పదార్థంబుల స్వోపయోగంబునకు విలుచునారివలన సుంకంబును గ్రహియింపఁ దగదు. వార్ధుషికునివలనఁ గాసీదంబున ద్వాత్రింశాంశంబు రాజుగరంబు గొనవలయు. గృహంబుతో సంబంధించిన భూమికి వ్యవసాయంపుభూమికిం బోలెఁ బన్ను పుచ్చికొనం దగు. మఱియు నల్లె యాపణికులవలనఁ బ్రసారభూమికిని మార్గసంస్కారణార్థంబు పాంథుల వలన మార్గభూమికిని రాజు కరంబు గ్రహింపవలయు. ఎల్లవారి వలన ఫలము గ్రహించుచు రాజు ప్రజారక్షణమున దాసుండువోలె జాగరూకుండు గావలయు. ఇట్లు చతుర్థాధ్యాయంబున ద్వితీయంబైన కోశప్రకరణం బుశనుండు చెప్పె.

# చతుర్థాధ్యాయము

తృతీయప్రకరణము

---

## రాష్ట్రస్వరూపము

అనంతరము మిశ్రములఁ దృతీయం బైన రాష్ట్రప్రకరణంబుఁ సంగ్రహముగఁ జెప్పెద నని శుక్రుం డిట్లనియె. స్థావర జంగమాత్మకంబెల్లను రాష్ట్రంబని నీతికోవిదులు వ్యవహరింత్రు. రాష్ట్రం బెవ్వానివశంబున నెంతకాలముండు నంతకాలంబది యతనిది. సర్వగుణ సంపత్తికంటె ధనసంపత్తి శతగుణా బధికంబును మహాతపఃఫలం బయిన యీశత్వంబు దానికంటె నధికమునని గురువలు వల్కుదురు. పృథివియందుఁ బార్థివునికంటె దేవుఁడు లేఁడని స్మరింపఁబడుఁ గాన నతఁడు తేజస్వియయి సర్వోత్కర్షంబున నుండు. లోకంబతని నాశ్రయించి జీవించుచు నతనియాచరణము గొనియాడి యాచరించుచుండు. రాజు రాష్ట్రఫలము పూర్ణముగ ననుభవించుఁ గాన దదఘంబుం బొందు. ఎవ్వానిదేశమున జనము స్వధర్మాచరణతత్పరం బగు ధర్మనీతి పరుండయిన యారాజు శాశ్వతంబయిన కీర్తి వడయు. భూమియం దెవ్వానికీర్తి యెంతకాలముండు నతఁడంతవఱకును స్వర్గంబున నుండు. అకీర్తికంటె నరకం బనునది వేఱొండు లోకాంతరమున లేదు. నరదేహంబుకంటె నన్యదేహంబులెల్లను నరకములు నాధివ్యాధులు

మహాపాపస్వరూపములు నని విద్వాంసులు పల్కుదురు. ఈ
శుండు తాను స్వధర్మపరుండయి ప్రజ న్స్వధర్మమున నియ
మించెనేని ప్రమాణభూతుండు ధర్మిష్ఠుండు నగు నతని నెల్ల
వారు ననుసరింత్రు. సనాతనములయిన దేశధర్మములును జాతి
ధర్మములుం గులధర్మములు మునిప్రోక్తము లయిన ప్రాచీన
ములు నూతనములు నగు నితరధర్మములును రాష్ట్రగుప్త్య
ర్థంబు సన్నృపు లెఱింగి సుయత్నమున రక్షించునది. ధర్మ
సంస్థాపనమున వారికిఁ జిరైశ్వర్యముం గీర్తియుం గలుగు.

## చాతుర్వర్ణ్యస్థితియుఁ దద్ధర్మములును

మున్ను పద్మసంభవునిచేఁ గర్మములచేత జాతి
నలుఁదెఱంగుల భేదింపఁబడె. పిమ్మట ననులోమసాంకర్యము
నను బ్రతిలోమసాంకర్యమునను జాత్యానంత్యము ప్రాప్తం
బయ్యె. తదానంత్యము చెప్ప నశక్యము. మనుష్యునకు జన్మ
మున జాతిభేదము నెఱుఁగువారెల్లను నామకర్మములన యట్టి
భేదము గలిగెనని యెఱుంగుదురు. సంగ్రహమునఁ బ్రాణు
లెల్లను జరాయుజములు నండజములు నుద్భిజ్జములు స్వేదజ
ములునని చతుర్విధజాతులుగలవి. జన్మమున నుత్తముఁడయ్యు
సంసర్గమున నీచుఁడగుం గాని నీచుఁడగువాఁడు సంసర్గమునఁ
గాని జన్మమునఁగాని యుత్తముఁడు గానోపఁడు. జన్మమునను
గర్మమునను గుణమునను విద్యాకలాశ్రయమునను నీచోత్తమ
భావములు చిరంకాలంబునకు స్థిరంపడును; అదియ నామ
మున జాతి యనంబడు. యజ్ఞము నధ్యయనము దానము నను
నివి ద్విజున కావశ్యకము లయిన కర్మములు. ప్రతిగ్రహము
నధ్యాపనము యాజనము ననునవి బ్రాహ్మణునకు విశేషధర్మ

ములు. సద్రక్షణమును దుష్టశిక్షణమును స్వభాగహరణ
మును క్షత్త్రియునకును గృషి పాశుపాల్య వాణిజ్యములు
వైశ్యునకును విశేషధర్మములు. సేవయు దానము ననురెండు
ధర్మములు శూద్రునకు విహితములయ్యె. కర్మభేదమున నెల్ల
వారికి భృతివృత్తి నిందితముగాదు. స్మృతికర్తలయిన మన్వా
దులు బ్రాహ్మణాదులకు సీరభేదమునఁ గృషి వేర్వేఱ విధిం
చిరి. బ్రాహ్మణులకు షోడశగవంబును దక్కినవారికిఁ జతురూ
నంబగు లాంగలమును నంత్యజులకు ద్విగవమును నందు విహి
తములు. విప్రులక కాని యితరులకు భిక్షాన్నవృత్తి గర్హితంబు.
తపోవిశేషంబులతోడను విధిచోదితంబు లయిన వివిధవ్రతముల
తోడను సరహస్యముగఁ గృత్స్న వేదాధ్యయనము ద్విజునకు
విహితము. విద్యలుం గలలు నేర్చినవాఁ డెల్ల వారికి గురు వగుం
గాని జాతిమాత్రమున ననధీతి యాచార్యకమునకు నర్హుండు
గాఁడు.

### విద్యాకలాస్వరూపసంఖ్యానిర్ణయము

విద్యలుం గలలు లెక్కింప శక్యముగా నన్ని కలవు
గాని యందు ముఖ్యవిద్యలు ముప్పదిరెండు నట్టికల లఱువది
నాలుగుం గలవు. వాగింద్రియసాధ్యం బయిన కర్మము విద్య
యనియు మూకునిచే నయిన సుకరంబయిన కర్మము కల య
నియు విద్యాకలాస్వరూపము సంగ్రహముగఁ జెప్పి, యింక
వాని నామములు లక్షణములు వేర్వేఱుగఁ జెప్పెద వినుమని
భార్గవుం డిట్లు చెప్పె. ఋగ్యజుస్సామాథర్వములను వేదం
బులు నాల్గును నాయుర్ధను ర్గాంధర్వతంత్రంబు లను నుప
వేదంబులు నాల్గును శిక్షావ్యాకరణములును నిరుక్తజ్యోతిష

ములును గల్పమును ఛందము నను వేదాంగము లాఱును దర్కమీమాంసలును సాంఖ్యమును వేదాంతమును యోగం బును బురాణేతిహాసములును మన్వాదిస్మృతులును నాస్తిక మతము నర్థశాస్త్రమును గామశాస్త్రమునుశిల్పంబు నలంకృతి గ్రంథంబులును గావ్యములును దేశభాషయుఁ బ్రస్తావజాత ము(అవసరోక్తియు)ను యావనమతమును దేశధర్మము నను ముప్పదిరెండును విద్యలనంబడు. ఋగాదులందు మంత్ర బ్రాహ్మణములు రెంటికిని వేదనామము ప్రోక్తంబయ్యె. వేని యుచ్చారణంబునను జపహోమాదులను దేవతాప్రీతియు నర్చనంబునగు నవి మంత్రంబులును వాని వినియోగంబుఁ జెప్పునది బ్రాహ్మణంబు నగు. ఋగ్రూపంబు లయిన మంత్ర ములు పాదములకొలఁది నర్థర్చముల కొలఁదిం గలిగి స్తోత్ర మునకు సాధనంబయినది ఋగ్వేదంబు నాఁబడు. ఎందలి మంత్రంబులు ప్రశ్లిష్టపఠితములు నృత్తగీతవర్జితములుఁ ద్రిగుణ పఠితములు యత్ర ప్రతిపాద్యంబయిన కర్మం బాధ్వర్యవంబు నది యజుర్వేదము. జన్నంబులయం దుద్గీథము శస్త్రములకు నెహివిటత మో యది సామవేదంబు. ఉపాస్యోపాసనాస్వ రూపప్రతిపాదకం బాథర్వణము. ఇది సంక్షిప్తంబయిన వేదచతుష్కస్వరూపంబు.

ఓషధుల, నాకృతిని, నాయుపు దేనఁ దేటపడు నది యాయుర్వేదంబు. యుద్ధశస్త్రాస్త్రకౌశలంబు వ్యూహరచనా విశేషంబును దెలుపునది ధనుర్వేదంబు. తంత్రులను గంఠం బునను నుద్ధితంబులు నుదాత్తాది ధర్మవిశిష్టంబులు నగు స్వరం బులతోను దాలంబులతోను గానవిజ్ఞానంబు గావించునది

గాంధర్వంబు. వివిధంబు లగు నుపాస్యంబులయిన మంత్రం బుల ప్రయోగంబులు నుపసంహారంబులును వానిధర్మంబులు నియమంబులు నెఱిఁగించువిద్య తంత్రంబు. ఇవి క్రమంబుగ ఋగ్యజుస్సామాథర్వంబుల కుపవేదంబులు. స్వరంబులను గాలంబునను స్థానప్రయత్నంబులను వర్ణపాఠంబు శిక్షించుటం జేసి శిక్ష యన్వర్థాభిధానం బయ్యె. బ్రాహ్మణశేషంబయిన వేదభాగంబున జన్నంబులఁ బ్రయోగంబుఁ దెల్పునది శ్రౌత కల్పంబు నుపనయనాది స్వరూపంబు నిరూపించునది స్మార్త కల్పంబు నని కల్పంబు ద్వివిధంబయ్యె. శబ్దంబులెల్ల ధాతు సంధిసమాసంబులతోఁ బ్రకృతిప్రత్యయవివేచనపూర్వకం బుగ లింగభేదంబుతో సిద్ధాన వ్యాకృతంబులయ్యె నది వ్యాక రణంబు. సంగ్రహంబుగ వాక్యార్థంబు సెప్పుచు వైదికశబ్దం బుల నిర్వచించు వేదాంగంబు నిరుక్తంబు. రిక్కలయు గ్రాము లయు నడకలచేఁ గాలంబు నిర్ణయించు సంహితాహోరా రూపంబయిన గణితంబు జ్యోతిషంబు. మయరసతజభనగణం బులయు గురులఘువులయు స్వరూపంబును బద్యంబులప్రమా ణంబును బ్రస్తారక్రమంబును దద్భేదంబులును వేదపాద ప్రమాణంబును జెప్పునది ఛందశ్శాస్త్రంబు. వేదవాక్యంబు లకు విధినామధేయాది భేదంబున వ్యవస్థితంబుగ నర్థకల్ప నంబు గావించు న్యాయంబు మీమాంస యనంబడు. దీనికిఁ బ్రవర్తకుఁ డగు జైమినిముని ధర్మానుష్ఠానంబున నభిమతార్థ సిద్ధి యగు నని తత్స్వరూపాదినిర్ణయార్థంబు ద్వాదశలక్షణి యగు పూర్వమీమాంసం జెప్పె. అందు విధినామధేయా ద్యాత్మకంబయిన వేదవాక్యజాతంబునకు ననన్యాపేక్షంబుగఁ

ప్రామాణ్యంబు నిర్వహించి పెక్కులగు కర్మంబుల స్వరూపంబును వాని యధికారులను నిరూపించి ఫలతారతమ్యంబు వివరించి "స్వాధ్యాయం బధ్యేతవ్యం" బనియు దాని కర్థావబోధంబు దృష్టఫలంబనియు దృష్టఫలంబు సంభవించుచుండ నదృష్టఫలకల్పనం బన్యాయంబనియు బలవద్యుక్తిపూర్వకంబుగ నిర్వచించి వేదంబులు స్మర్యమాణకర్తృకంబులు గామి నపౌరుషేయంబులని స్థిరపఱిచి కర్మం బపూర్వద్వారంబున స్వాతంత్ర్యంబునన పురుషార్థము గావించునని యామ్ముని సిద్ధాంతించె. భావపదార్థంబులు నభావపదార్థంబులు నిరూపించు కణాదాదిప్రణీతం బయిన గ్రంథంబు తర్కంబు నాఁబడు.

అందు గౌతముండు ప్రమాణ ప్రమేయ సంశయ ప్రయోజన దృష్టాంత సిద్ధాంతావయవతర్క నిర్ణయ వాద జల్పవితండాదులు పదియునాఱు పదార్థంబులు గలవనియు వాని స్వరూపంబు దెలిసిన మోక్షంబు సిద్ధించుననియు నందుఁ బ్రమాణంబు ప్రత్యక్షాది భేదంబుల నలుఁదెఱఁగు లయ్యె ననియుఁ బ్రమేయంబు నాత్మయు శరీరంబు నింద్రియంబులు విషయంబులు మనంబు బుద్ధియుఁ బ్రవృత్తియు దోషంబు మరణంబు ఫలంబు దుఃఖంబు మోక్షంబు నని ద్వాదశవిధంబు లయ్యె ననియుఁ జెప్పి యనిశ్చయాత్మకం బయిన జ్ఞానంబు సంశయంబనియు నీలోకమందేని పరలోకమందేని మనుజులు దేని సంపాదింప యత్నింతు రది ప్రయోజనంబనియు నుదాహరణంబు దృష్టాంతం బనియుఁ బ్రమాణంబున నంగీకృతం బయిన యర్థంబు సిద్ధాంతం బనియు యథార్థానుభవంబను రెండవపేరుగల ప్రమితి నిర్ణయంబనియుఁ జెప్పి యిట్లె తక్కిన

వానిని నిర్వచించె. మఱియు నందు దుఃఖజన్మప్రవృత్తి దోషమిథ్యాజ్ఞానంబులలో నుత్తరోత్తరంబు నశియింపఁ బూర్వపూర్వంబు నశియించిన నపవర్గంబు సిద్ధించు ననియు నాత్మగాని దేహాదులం దాత్మ యనుభ్రాంతి మిథ్యాజ్ఞానం బనియు దేహాదుల కనుకూలంబు లయిన వస్తువులందు రాగంబును బ్రతికూలంబులందు ద్వేషంబును దోషంబనియు నాదోషంబునఁ బ్రేరితుండయి ప్రాణి శరీరంబున హింసాదిని షిద్ధకార్యంబులందును వాక్కున ననృతాదులందును మనంబునఁ బరద్రోహాదులందును బ్రవృత్తికలవాఁ డగుననియు నిదియె యధర్మంబనియు మఱియు నొక్కపుడు శరీరి శరీరంబున దానాదులను వాకున సత్యాదులను మనంబున హితసత్యాదులను బ్రవర్తిల్లు ననియు నిదియె ధర్మం బనియు నీయుభయ ప్రవృత్తులఁ బ్రశస్తం బేని నిందితం బేని దేహంబు ప్రాణి గ్రహించి యనుకూలంబయిన సుఖం బేని ప్రతికూలంబయిన దుఃఖం బే నొందుచుండుననియు నిట్లీమిథ్యాజ్ఞానాదు లెడ తెగక ప్రవర్తించునంత కాలము సంసారం బనువర్తించు ననియు నెపుడేని యీ సంసారంబు దుఃఖాయతనం బని పురుషుండు సుకృతపాకంబున నవిద్యాదుల విసర్జింప యత్నించు నప్పుడ సమ్యగ్జ్ఞానంబు వొడముననియు దాన మిథ్యాజ్ఞానంబు నశియించుననియు దాన దోషంబును దానఁ బ్రవృత్తియు దాన జన్మంబును దాన దుఃఖంబును నశియించు ననియు నిదియే యపవర్గం బనియు స్పష్టపఱిచె. మూలప్రకృతియుఁ బ్రకృతి వికృతు లయిన మహాదహంకార తన్మాత్రంబులును గేవల వికృతులయిన స్థూలభూతంబులు నింద్రియజాతంబును బ్రకృతి

వికృతిభిన్నుం డయిన పురుషుండును బంచవింశతి తత్త్వంబు లని నిరూపించి వాని స్వరూపంబు నిర్వచించు కపిలాద్యృషి ప్రణీతంబయినమతంబు సాంఖ్యంబు. బ్రహ్మం బేకంబు నద్వితీయంబు ననియు నీప్రపంచంబు నుత్పత్తికంటెం బూర్వము వేఱువస్తువు లేదనియుఁ బిమ్మట సర్వంబు నధిష్ఠానంబున నని ర్వాచ్యయగుమాయచేఁ గల్పితంబనియుఁ బ్రతిపాదించు నౌపనిషదంబయిన మతంబు వేదాంతంబు. చిత్తనిరోధంబు యోగంబనియు నది ప్రాణాయామాదుల నలవడుననియుఁ జెప్పి ధ్యానసమాధుల స్వరూపంబు విదితంబు సేయు పాతంజలం బయిన సూత్రసముదాయంబు యోగశాస్త్రంబు. ఒక్కరాజుకృత్యంబు సెప్పునెపంబునఁ బెక్కుకితలు ప్రాచీనంబులు దేనఁ జెప్పఁబడు నది యితిహాసంబు పురావృత్తంబు ననంబడు. సర్గప్రతిసర్గంబులును రాజవంశంబులును స్వాయంభువాది మన్వంతరంబులును రాజవంశ్యులయిన మహాపురుషుల చరితంబులును గల యది పురాణం బనంబడు.

బ్రాహ్మణాదివర్ణంబుల నాశ్రమంబులఁ దద్ధర్మంబులను వేదావిరుద్ధముగఁ గీర్తించు మన్వాదిప్రణీతంబయిన గ్రంథజాతంబు స్మృతి యనఁబడు. బలీయసి యగు యుక్తిచే సర్వప్రపంచంబు స్వభావంబునన జన్మించు ననియు దేనికి నీశ్వరుండు కర్త గాఁడనియు వేదంబులు ప్రమాణంబులు గావనియుఁ బ్రతిపాదించునది నాస్తికమతంబు. "మృత్యుగోచరంబు గాని జంతువు ప్రపంచంబున లేదు గావునను భస్మీభూతంబయిన దేహంబు మరల రామిని నెల్లవాఁడు సుఖంబున జీవించునది" యను లోకగాథ ననుసరించి నీతి కామశాస్త్రాను

సారంబుగ నర్థకామంబులు రెండు పురుషార్థంబు లని నిశ్చ
యించి పరలోకసిద్ధం బయిన యర్థంబు నపహ్నవించి ప్రవ
ర్తించుటంబట్టి నాస్తికమతంబునకు లోకాయతం బని యన్వ
ర్థాభిధానంబు గలిగియుండు. ఈమతంబునఁ బృథివ్యాదిభూతం
బులు నాల్గుతత్త్వంబులు దేహాకారంబునఁ బరిణతంబులయిన
వానివలనఁ గిణ్వాదుల సంయోగంబున మదశక్తియుంబోలెఁ జైత
న్యం బుత్పన్నం బగుననియు నవి శిథిలంబు లయిన నశించు
ననియు నీవిషయంబున "విజ్ఞానఘన ఏవైతేభ్యో భూతేభ్యస్స
ముత్థాయ తాన్యే వానువినశ్యతి నప్రేత్యసంజ్ఞాస్తి" యను
మైత్రేయీబ్రాహ్మణవాక్యంబు ప్రమాణ మనియు నట్లగుటచేఁ
జైతన్యంబుగల దేహమెయాత్మయనియుఁ బ్రత్యక్షాతిరిక్తంబు
లయిన యనుమానాదులకుఁ బ్రామాణ్యంబు మనోరథమాత్ర
కల్పితరాజ్యతుల్యంబనియు దేహేంద్రియాతిరిక్తుఁడైనయాత్మఁ
డు లేఁడనియు నిహలోకసుఖంబులె పరమపురుషార్థంబనియు
నది దుఃఖసంభిన్నంబయినను మత్స్యంబులం గోరువాఁడు సశ
ల్కంబులు సకంటకంబులు నగు మీలం బట్టి గ్రాహ్యాంశంబు
గ్రహించి యితరాంశంబు ద్యజించినట్లును ధాన్యార్థి సపలా
లంబయిన ధాన్యంబు గ్రహించునట్లు ననన్యప్రాప్తం బయిన
దుఃఖంబుఁ బరిత్యజించి సుఖమాత్రంబు భోక్తవ్యం బనియు
నాస్తికశిరోమణులు నిర్ణయించిరి. మఱియు నందు దుఃఖం
బుతోఁ గూడినదను కారణంబున సుఖంబు త్యాజ్యంబు గాదు.
మృగంబులు గలవను కారణంబున క్షేత్రంబుల శాల్యాదులు
నాటకుందురా? మాధుకరవృత్తిని జీవించువారు బాధింతు
రని గృహంబులఁ బాకంబు మానుదురా? యనియుం జెప్పి

పారలౌకికసుఖంబు లేదేని బహువిత్తవ్యయ శరీరాయాస సాధ్యంబయిన యగ్నిహోత్రాదికర్మంబుల శ్రోత్రియు లెట్లు ప్రవర్తింతు రని యడిగిన ననృత పునరుక్తాది బహుదోష దూషితంబు గావున వేదంబునందు వైదికమ్మన్యులును బర స్పరంబు కర్మకాండజ్ఞులు జ్ఞానకాండంబునకును జ్ఞానకాండ జ్ఞులు కర్మకాండంబునకును బ్రామాణ్యలోపంబు కల్పింతురు గావునను ద్రయి ధూర్తప్రలపితగావునను వేదాధ్యయనాగ్ని హోత్రాదులు పౌరుషహీనులకు జీవనార్థంబు కల్పితంబు గావునను వారిప్రవర్తనంబు ప్రమాణకోటిం బ్రవేశింప దని యు నైహికంబైన దుఃఖంబు నరకంబును సుఖంబు స్వర్గంబు ననియుఁ బ్రత్యక్షప్రమాణసిద్ధుం డయిన రాజు పరమేశ్వరుం డనియు దేహనాశంబు మోక్షం బనియు దేహాత్మవాదిమతం బున నేను గృశుండను గృష్ణుండను మొదలగు సమానాధి కరణప్రత్యయం బుపపన్నంబగుననియు నాశరీరము నాచేయి మొదలయిన ప్రయోగంబులు "రాహువుశిర"మన్నట్టు లుప చారప్రయుక్తంబు లనియు సిద్ధాంతంబు చేయంబడె. శ్రుతి స్మృతివిరోధంబు లేకుండ రాజవృత్తంబు శాసించుచు యుక్తి పూర్వకంబుగ నర్థార్జనంబు తెలుంగఁజేయించువిద్య యర్థశా స్త్రంబు. పురుషులయందు శశవృషాదిభేదంబుల ననుకూల దక్షిణాదిభేదంబులను స్త్రీలయందుఁ బద్మిన్యాదిభేదంబులను స్వీయాదిభేదంబులను స్త్రీపురుషుల యంతఃకరణలక్షణం బును వివరించునది కామశాస్త్రంబగు. ప్రాసాదంబులు నారా మంబులు నిండ్లు ప్రతిమలు వాపీకూపంబులు నిర్మించు తెరవు దెల్పునది శిల్పశాస్త్రం బని ఋషులు చెప్పిరి.

సమముగను న్యూనముగను నధికముగను సాదృశ్యా దిభేదముల నన్యోన్యగుణభూషణాదివర్ణనంబు లెట్లానఁ జెప్పఁ బడు నది యలంకృతి. మఱియు నందుఁ గావ్యభేదములును గుణములు రసములు ధ్వన్యాదులు నిరూపింపఁబడు. సరస ములు సాలంకారములు సగుణములు నదుష్టములునగు శబ్దా ర్థములు కావ్యము లనంబడు. అవి పద్యాదిభేదమున విలక్షణ చమత్కారజనకంబులగు. లోకసంకేతానుసారముగ నెల్లవారు నర్థంబు సులభముగ గ్రహించునట్లు ప్రయోగించువాక్యజా తము దైశికి యనంబడు. సమయానుసారముగఁ బ్రశంసించు వాక్యసముదయం బవసరోక్తి. ఇజ్జగమునుత్పత్తికి సర్వేశుండు కారణంబనియు నతఁ డెప్పుడు నదృశ్యుండనియు శ్రుతిస్మృతు లతో వినాగ ధర్మాధర్మనిర్ణయం బగుననియుఁ బ్రతిపాదించి వేదవిరుద్ధములయిన యాచారములఁ బ్రకటించు మతము యూ వనము. కల్పితశ్రుతి మూలము లేని యనుమూలము లేని లోకు లచే ధృతములయిన సదాచారములు దేశధర్మములు. ఇవి దేశదేశమునందును గులకులమునందును వేర్వేఱ గ్రహించు నదియని యిట్లు విద్యల కెల్లఁ బార్థక్యమున లక్షణములు సెప్పి కలలకు నామములు లక్షణము నుశనుండు చెప్పఁ [illegible]. కలలకుఁ బ్రత్యేకము నామమును లక్షణమును లేదు గాని యవి క్రియాభేదమున భేదిల్లు. హావభావాదులతోడి నర్తన మును, దతానస్థానాద్యనేకవిధంబులయిన వాద్యముల [illegible] వాదనవిజ్ఞానమును, స్త్రీలకుఁ బురుషులకు వేర్వేఱ వస్త్రా లంకారసంధానమును, [illegible]భూమికలు రచియించు నైపు ణ్యమును, సెజ్జలు నాస్తరణములు రచియించు నేర్పును

బలు తెఱఁగులఁ బుష్పమాల్యగ్రథనమును, ద్యూతాద్యనేక
క్రీడనములఁ బ్రజారంజనమును, ననేక సంవిధానముల యువతి
జనసంతోషణము నను కలాసప్తకము గాంధర్వమున నుదా
హృతం బయ్యె. మద్యంబులుం బానకంబులు రచియించు
వైశారద్యంబును, సిరావ్రణంబుల వేధించుటయందును
గూఢంబులయిన శల్యంబుల నుద్ధరించుటయందును సామర్థ్యం
బును, హీనరసంబు నధికరసంబు సమరసంబునగున ట్లన్నాది
పచనవిజ్ఞానంబును, వృక్షలతాదులకుఁ బ్రసవఫలాద్యుత్పత్తి
తత్పాలనంబులకు సాధనంబులగు దోహదంబుల నెఱుకయు,
ధాతుపాషాణాదుల ద్రుతియు వానిభస్మీకరణంబును, ఇక్షువు
నుండి మధురపదార్థంబుల రచియించు నైపుణియు, ధాతువు
లఁ గలుపు విన్నాణమును వానిని వేఱుసేయు తెల్వియు,
ధాత్వౌషధముల సంఘటించుజ్ఞానము, లోహంబుల సంయో
గంబున లోహాంతరము నిర్మించు జ్ఞానమును, క్షారనిష్కా
సనము, నను కలాదశకం బాయుర్వేదమున గ్రథితంబయ్యె.
వేర్వేఱు పాదవిన్యాసముల నస్త్రప్రతిక్షేపణమును, సంధుల
నాకర్షించియు బాధించియు మల్లయుద్ధము సేయు కౌశల
మును, దూరమునుండి యస్త్రముల లక్ష్యవిభేదనమును,
గాహళాదిసంకేతముల గ్రహించి వ్యూహముల రచియించు
నైపుణియు, గజాశ్వాదుల గతివిజ్ఞానమున వానియుద్ధాదుల
నియోగించు కౌశల్యము నను నైదుకలలు ధనుర్వేదోదిత
ములు. మల్లయుద్ధ మశస్త్రముగఁ బిడికిళ్లతోడను బాహుల
తోడన చేయునది. అందు మృతునకు స్వర్గముగాని కీర్తిగాని
రాదు కాఁబట్టి బలదర్పము లుడుగునందాఁకన కావించునది;

కాని ప్రాణాంతమునకుఁ గావింపరాదు. వివిధములగు నా
సనముల ముద్రలను దేవతాతోషణము తంత్రోదితము. సా
రథ్యమును, గజాశ్వాదులకు గతిశిక్షణమును, మృత్తికను
గాష్ఠమునను బాషాణములను సువర్ణాదులను రచింపఁబడిన
భాండములకు మెఱుఁగు వెట్టుటయు నను నీనాల్గును వేఱుకలల
యగు. చెఱువులు బావులు నూతులు మాడువులు నిర్మించు
నైపుణియు, ఘట్యాద్యనేకయంత్రములయు వాద్యంబులయు
నిర్మాణంబును, జిత్రాద్యాలేఖనంబును, వర్ణరంజనంబును,
వాయ్వగ్ని జలసంయోగంబునను దన్నిరోధంబునను జమ
త్కారకరణంబును, రజ్జువిజ్ఞానంబును, బటచిత్రకం బలాది
వయనంబును, రత్నంబుల దోషపరిజ్ఞానంబును, నౌకారథాది
యానకృతియు, స్వర్ణాదిధాతువుల యాథాత్మ్యవిజ్ఞానంబును,
గృత్రిమంబులయిన స్వర్ణరత్నాదుల రచియించు నైపుణియు,
స్వర్ణాద్యలంకార రచనాసామర్థ్యంబును, జర్మంబులకు మా
ర్దవం బాపాదించురీతియు, లేపాదికరణంబును, పశుచర్మాంగ
నిర్హారక్రియాజ్ఞానంబును, దుగ్ధదోహంబును, దన్మథనంబున
నవనీతాహరణంబును, గంచుకాదుల సీవనంబును సీఁతయు
గృహభాండాది సమ్మార్జనంబును, వస్త్రసమ్మార్జనంబును,
క్షురకర్మంబును తిలమాంసాదులనుండి చమురుఁదీయుట, హల
కర్మంబును, వృక్షాద్యారోహణనైపుణ్యంబును, ప్రభువున కను
కూలంబుగ సేవించు తెల్వియు, వేణుదళంబులను, దృణా
దులను దాళపత్రంబులను వేత్రంబునను బుటికాకట్యాది
నిర్మాణకౌశల్యంబును, గాచపాత్రంబులఁ జేయు చదురును
జలంబుల సంధరించి విడుచు పాటవంబును, లోహంబున

శస్త్రాది క్రియాభ్యాసంబును, గజాశ్వాదులకుఁ బల్యాయనం బుల రచియించు నోడికంబును, శిశుసంరక్షణ ధారణ క్రీడ నంబుల నేర్పును, దప్పుచేసినవారిని యుక్తంబుగఁ దాడితులఁ జేయు నేరిమియు, నానాదేశలిపిజ్ఞానంబును దల్లేఖనంబును, దాంబూలరచన రక్షణంబులుఁ, గలాగుణంబు లయిన శీఘ్ర గ్రహణంబును, మందబోధనంబును గూడ నివి యఱువది నాల్గుం గలలు. ఎవఁ డేకల నాశ్రయించి జీవించు నిపుణుం డగు నతఁడ దానిం జేయునది.

ఇది విద్యాకలాస్వరూపనిరూపణ మను
తృతీయప్రకరణము

# చతుర్థాధ్యాయము

## చతుర్థప్రకరణము

---

### ఆశ్రమములు

బ్రహ్మచర్యంబును గార్హస్థ్యంబును వానప్రస్థంబును సన్న్యాసంబు ననునాశ్రమంబులు నాల్గును బ్రాహ్మణులకుఁ గ్రమంబున విహితంబులు. క్షత్రియాదులకుఁ జరమంబు గాక తక్కిన యాశ్రమంబులు విహితంబు లయ్యె. విద్యాభ్యాసార్థంబు బ్రహ్మచర్యంబు నెల్లవారిం బోషింప గార్హస్థ్యంబును దీర్ఘసేవార్థంబును శమదమాద్యభ్యాసార్థంబును వానప్రస్థంబును మోక్షార్థంబు సన్న్యాసంబును విహితంబు లయ్యె. విప్రాదులెల్లను గులాచారంబులకు విరుద్ధంబుగఁ జరించిన రాజునకుఁ దప్పక దండ్యు లగుదురు. రాజుచే నుపేక్షితంబులు దండంబున నదండితంబులు నగు కులంబులు కులత్వంబు నకులంబులు కులీనత్వంబుం బొందును. వారు క్రమంబున మంత్రజపపరాయణులును తపోనిష్ఠులును తీర్థసేవాసక్తులును సంచరణశీలురును గావలయు. రాజు లుపేక్షించిన నాచారహాని వాటిల్లుఁ గావున రాజగురుకులంబు సదాచారప్రవర్తకులు గావలయు.

### స్త్రీసాధారణము లగు ధర్మములు

స్త్రీలకుఁ బతిశుశ్రూష గాక జపతీర్థసేవాదికంబు గావింపం జనదు. స్త్రీలకుఁ బతికంటె వేఱుగాఁ ద్రివర్గసాధ

నంబు లేదు. భార్య భర్తకంటెఁ బూర్వము నిద్రనుండి లేచి ముఖప్రక్షాళనాది దేహశుద్ధిం గావించికొని పాన్పుల నుత్థాపించి మార్జన లేపనంబులచే గృహశోధనంబుఁ గావించి పానలంబయిన ముంగిటిం జేరి స్నిగ్ధంబులయిన యజ్ఞపాత్రంబుల నుష్ణోదకంబున శోధించి తొలఁచి యుండవలయుచోట్ల నిల్పి శోషింపఁజేసి పూరింపవలయువానితోఁ బూరించి రక్షించునది. మఱియు వంటయింటిపాత్రంబుల వెలికిఁ దెచ్చి ప్రక్షాళించి మృత్తికతోఁ బ్రొయ్యినలికి యం దగ్ని నింధనంబుల నునిచి రసంబు (పేయంబు)ల నన్నంబుల నింట నున్న ద్రవ్యంబుల వ్యవహారార్హభాజనంబులఁ జింతించి యత్తమామలకు మ్రొక్కి వారిచేతను మగనిచేతను,దల్లిదండ్రులచేతను, సోదర మాతులబాంధవులచేతను దత్తము లగు వస్త్రాలంకార రత్నములను ధరించుచుండునది. కలత్రం బిట్లు పూర్వాహ్ణకృత్యంబులం గావించి మనోవాక్కర్మంబుల శుద్ధురాలయి భర్తృనిదేశవర్తినియయి నీడయుంబోలె నెల్లపుడు ననుగతయై యతని హితకార్యంబులం దెలివలె నిర్దిష్టకార్యంబుల దాసివలె నుండునది. పిమ్మట నామె వంట గావించి మగనికి నివేదించి వైశ్వదేవార్థ ముద్ధృతమైన యన్నముకంటె మిగిలినదాన భోజనీయుల భుజియింపఁజేసి పిమ్మటఁ బతికి బోనంబు వడ్డించి తదనుజ్ఞాతయై తానును భుజియించి యాయ వ్యయచింతచే నహశ్శేషంబుఁ గడపునది. సాధ్వియగు నింతి మరల సాయంకాలముననుమరలఁ బ్రాతఃకాలమున నిట్లు గృహశుద్ధిని బాకంబును గావించుచు సభృత్యుఁడయిన పతిని భుజియింపఁ జేయుచుఁ దాను సాయంతనమున నధికంబుగాకుండ భుజి

యించి గృహకృత్యంబుఁ దీర్చి శయనీయంబులఁ బఱచి పతి కుపచారంబు సేయుచు నతఁడు నిద్రింపఁ దానును శయనంబు నధివసించి భర్తృగతమానసయు నప్రమత్తయు జితేంద్రియయు నవివసనయు నై శయనించునది. ఉచ్చైస్స్వనంబుగను బరుషంబుగను నేవారితోడను వివదింపను బ్రలాపింపను దగదు. మఱియు సాధ్వి ప్రమాదరోషేర్ష్యావచనంబుల నిందితవచనంబులఁ బైశున్య హింసాహంకారదర్పవచనంబుల నుడుగుచు నాస్తిక్య హింసాస్తేయదంభ సాహసంబుల వర్జించి ధర్మార్థావిరోధిని యయి యతివ్యయశీల గాక పతిని దైవతముగా భావించి యుపచరించుచున్నది యగుచు నీ లోకంబునఁ గీర్తిసుఖంబులను బరలోకంబునఁ బతిలోకంబును బడయు. ఇది యింతులకు నిత్యకృత్యంబు. మీఁద నైమిత్తికం బయిన కార్యంబు చెప్పంబడు. వనిత రజస్వల యయిన మున్ను చెప్పంబడిన కార్యములనెల్ల నుజ్జగించి యెవ్వనికంటం బడక లజ్జితయై యంతర్గృహంబునకుం బోయి యేకవస్త్రయుఁ గృశయు దీనయు స్నానాలంకారవర్జితయు నప్రమత్తయు నై భూమిన పన్నుండుచు మూఁడు రాత్రులు వసించునది. అట్టి కాంత నాల్గవనాఁడు సూర్యుఁడుదయింప సచేలస్నానంబు గావించి భర్తృముఖంబుం గాంచి శుద్ధురాలగుచున్నది. ఇట్లు శుద్ధయై పూర్వమునం బోలె నెల్లకర్మములం గావించునది. ఈ ధర్మంబు ద్విజాతిస్త్రీలకుఁ దఱుచుగాఁ బెఱయింతులకును విహితంబు. కాని పెఱయింతులు కృషివాణిజ్యాది పురుష కార్యంబులకు నుపకరించువారు గావలెను. భర్త మరణించిన ననుగమనంబు గావింపనినాఁడు పరగృహంబునకుఁ బోవనిచ్ఛ

యింపక సర్వాభరణవర్జితయై బ్రహ్మచర్యంబుననుండి భర్తృ వ్రతంబుఁ బాలించుచుండునది. ప్రోషితభర్తృకయు మంగళార్థంబులయిన యలంకారంబులఁ గాక తక్కినవాని వర్జించి పతిహితార్థంబు దేవతారాధనతత్పర యై యుండునది. స్త్రీ లెల్లపుడును సంగీతంబులను మధురాలాపంబులను భర్త వశంవదుండగునట్లు ప్రవర్తించుచు భర్తృసముండగు బంధువును సుఖంబును బ్రభువును లేఁడు గావున సర్వస్వంబుం బరిత్యజించి యతనిన శరణంబు నొందునది. ఇంతికిఁ దండ్రియు సోదరుండును బుత్త్రుండును జుట్టంబులును మితంబుగ నిత్తురు పతియొక్కండ సర్వస్వంబు నివేదించు. అట్టివానిఁ బూజింపని యువిదల కెట్టు సుఖంబు గలుగు.

## శూద్రధర్మము

శూద్రుండు చతుర్థవర్ణుండయ్యు సత్కార్యానుష్ఠానంబున కర్హుండ కాని వేదోక్తంబు లయిన మంత్రంబులను స్వాహా స్వధావషట్కారంబులను వదలి పురాణేతిహాసోక్తంబులును నమోంతంబులు నగు మంత్రంబుల సకలకర్మంబులు సేయందగు. బ్రాహ్మణులచే వివాహితలగు యువతులందు జన్మించినవారు బ్రాహ్మణుండునుంబోలెను క్షత్త్రవిన్నలయందు జనియించినవారు క్షత్త్రియుండునుంబోలెను వైశ్యోఢలయందుఁ బుట్టువారు వైశ్యుండునుంబోలెను గర్మంబులు గావించువారు గావలయు. విప్రులవలనను క్షత్త్రియులవలనను వైశ్యాంగనలయందును శూద్రాంగనలయందు నుత్పన్నులగువారు శూద్రుండునుంబోలెఁ గర్మంబులు గావించునది. అధముం

డగు పురుషువలన నుత్తమ యగు వనితయందు జాతుండు శూద్రాధముఁడు గాన వారికంటె హీనంబుగ నమోమంత్రంబునన సత్కర్మంబుల నాచరించునది. పాశ్చాత్యులు నుత్తర దేశవాసులు నగు యావనులు వేదంబు లప్రమాణంబు లనియుఁ దద్భిన్నంబు లగున వచనంబులు ప్రమాణంబులు ననియుఁ జెప్పుదురు. వారికి హితార్థంబుగ వారి యాచార్యులచే నట్టిశాస్త్రంబు నిర్మింపఁబడె; కాని లోకవ్యవహారానుకూలంబయిన నీతిశాస్త్రం బెల్లవారికి సమంబయి యుండును.

### జన్మగుణముల ప్రాశస్త్యము

విశ్వామిత్ర వసిష్ఠ నారదాదులకుఁ జాతి నీచమధ్యమాదిభావంబు లొక్కప్పుడు క్షేత్రమాహాత్మ్యంబునను నొకొ యొకప్పుడు బీజానుభావంబునను జనులకుఁ గల్గుచుండును. విశ్వామిత్ర వసిష్ఠ నారదాదులు స్వతపస్సామర్థ్యంబునను యుత్తమత్వంబు వడసిరి కాని జాతివలనం గాదు. ఎల్ల జాతుల వారుం దమకు విహితంబులుం బూర్వాచరితంబులు నగు ధర్మంబుల నాచరింపకున్న రాజులచే నవశ్యంబు దండనీయు లగుదురు. ఎల్లకులంబుల వారు, నెల్ల యాశ్రమంబుల వారును వేర్వేఱు చిహ్నంబులఁ దెలిసికొనఁ దగినట్లుండ వలయును.

### పనివాండ్ర రక్షణము

ధాతుకారుల యంత్రంబులు లోనగు పదార్థంబు లెల్ల రేల నారెకులచే క్షేమంబు రక్షించుచుండ వలయును. నాటకులుం గారుశిల్పాదిగణంబు నెల్ల స్వరాష్ట్రంబునఁ గాని రాష్ట్రాంతరంబున నేని కార్యంబు గలుగనోపు నని రక్షించుచుండ వలయును

ధూర్తు లుందురు గానఁ బెక్కం డ్రున్న యెడ వారి లలసులు గాకుండ సేవాకార్యంబుననేని కృషికర్మంబుననేని భృత్య పదంబుననేని నియోగించునది.

గంజాగృహంబు గ్రామోపశల్యంబున నిర్మింపించి మద్యపుల నందు నిల్పుచు దివాభాగంబునఁ దనదేశంబున నొక్కఁ పుడేని మద్యపానంబు లేకుండఁ జేయుచు నిక్కార్యంబున రాజు మిగుల మెలఁకువ గల్గియుండునది.

## వృక్షలతాది స్థాపనము

మఱియు గ్రామంబున గ్రామ్యంబులు నరణ్యంబున నారణ్యకంబులు నగు వృక్షలతాదుల నుత్తమంబు లగువాని వింశతికరంబుల దూరంబునను మధ్యమంబు లగువాని బదియు నయిదుహస్తంబుల దూరంబునను సాధారణంబులగువాని బది కరంబుల దూరంబునను గనిష్ఠంబులగు వాని నైదుమూరల దూరంబునను నాఁటించి యజావి గోమహిష్యాది శకృత్తులను జలంబులను మాంసాదిదోహదంబులను వానికిం దగునట్లు రక్షణంబు రాజు గావించుచు వృద్ధియగునట్లు సేయవలయు. వృక్షలతాదులు దేశంబున వృద్ధి యగుకొలఁదిని క్షేమంబు గలుగు నని పెద్దలు సెప్పుదురు. ఉదుంబరాశ్వత్థవటచించా చందనజంభలంబులును గదంబాశోకవకుల బిల్వామ్రాత కపిత్థంబులును రాజాదనామ్ర పున్నాగచంపకంబులును నీప సరళదాడిమాక్షోటంబులును శింశుపా బదర నింబజంబీరంబులును ఖర్జూర కుద్దాలలవలీ ధాత్రీ మాతులుంగకంబులును నారికేళ రంభాజంబువులు చాంపేయమల్లికాకురువకంబులు

నింకను సుఫలంబులు సుపుష్పంబులు నగు నితరవృక్షంబు
లును గ్రామ్యంబులు గాన వానినెల్ల గ్రామంబులందునేఁ
దత్సమీపంబుననే నారోపించి వర్ధిల్లఁజేయుచుఁ గంటకవతం
బులును ఖదిరాదులును దమాలకుటజార్జునపలాశంబులును
సప్తపర్ణ శమీ దేవదారువికంకతంబులును భూర్జవిషముష్టి
కరవీరకాదులును హరీతకి భల్లాతపుష్కరంబులును బీతద్రు
శాల్మలివిభీతకంబులును బబ్బులాదులు గుల్మవంతంబు లగు
నీవృక్షంబులు నారణ్యకంబులు గావున వాని నరణ్యంబునందు
నాటించి భూపతి పెరుఁగఁజేయునది.

### కూపాదులనిర్మాణము, దేవాలయాదినిర్మాణము

మఱియు బావులు నూతులుఁ బుష్కరిణులుఁ దటా
కంబులును విశాలంబులుగఁ ద్రవ్వించి నలుప్రక్కల సోపానం
బులు గట్టించి రాజు తనదేశంబున నెల్ల జలసమృద్ధి యగు
నట్లు సేయుచు నదులయందు సుమనోహరంబుగ సేతువులు
నిర్మింపఁ బంచుచు వానియందు నౌకాదితరణసాధనంబు లుభ
యపారంబుల నుండ నియోగించుచు సేనాని విద్య కెవ్వఁడు
గురువగు మఱియు నేనాటికి నద్దేవుఁడు పూజ్యుఁ డగు వా
గృహంబు లావీథికి మొదల నిర్మింపించుచు దేవాగారంబుల
నేని గ్రామమధ్యంబున నేని శివునకు విష్ణునకు గణపతికిని సవి
కిని దేవికిని మేర్వాది షోడశవిధంబులలో నెట్టిదనను మనో
హరంబులు సచిత్రంబులు జలమూలంబులు సమంటపప్రాకా
రంబులు నగు ప్రాసాదంబుల వర్తులంబులనేని చతురశ్రాకా
రంబులనేని యంత్రాకారంబులనేని శాస్త్రోక్తంబులగు [illegible]

మలఁగ నిర్మింపించునది. వీనియుచ్ఛ్రాయంబు వైశాల్యంబునకు ద్విగుణంబేని త్రిగుణంబే నగు. సహస్రశిఖరంబులచే రమ్యం బును సపాదశతభూమికంబును సహస్రహస్తవిశాలోచ్ఛ్రా యంబునయిన యాలయంబు మేరుసంజ్ఞం బొలుచు. ఒకదాని కంటె నొకటి యష్టమాంశహీనంబు లగునవి మందరాదులు. ఋతుమాలియు ద్యుమణియుఁ జంద్రశేఖరంబు మాల్యవంతం బుఁ బారియాత్రంబు రత్నశీర్షంబు ధాతుమంతంబు పద్మ కోశంబు పుష్పహాసంబు శ్రీకరంబు స్వస్తికంబు మహా పద్మంబు పద్మకూటంబు విజయంబును నాదిపదగ్రాహ్యం బులు. వీనికిం దగినంతయుఁ బాదహీనంబగు నుచ్ఛ్రాయంబు గలదియు నగు మండపంబును ముందటిప్రదేశంబునఁ గల్పింప వలయు. ఇట్లు దేవళంబులు గల్పించి వానియందుఁ బ్రతిష్ఠాప కులారాధ్య దేవతాధ్యానపూర్వకంబుగఁ బ్రతిమలఁ బ్రతి ష్ఠింపవలయు.

## ప్రతిమాభేదము, వాని స్వరూప నిర్మాణాదులు

ధ్యానయోగసిద్ధికై ప్రతిమా లక్షణంబు చెప్పంబడె. ప్రతిమలం జేయువాఁడు ధ్యానపరుండయి ధ్యానానుసారముగ నిర్మించునది. ధ్యానముకంటెఁ బ్రతిమాలక్షణముఁ దెలిసికొన వేఱుసాధనము లేదు. ప్రతిమానిర్మాణంబునఁ బ్రత్యక్షపరి శీలనము ననుపయుక్తము. ఇసుముతోడను బిండితోడను రంగులతోడను గాజురంగుల పూఁతతోడను మంటితోడను గఱ్ఱలతోడను రాలతోడను వెండి బంగారు మొదలగు వాని తోడను జేయంబడిన విగ్రహంబులలో నుత్తరోత్తరంబు

తాలమితయుఁ గావలయు. మూర్తులకు దేశభేదంబున సప్త
తాలాద్యౌన్నత్యంబు కల్పితం బయ్యె. స్త్రీమూర్తియు వానున
మూర్తియు నెన్నండు సప్తతాలోన్నతయ కావలయు. నర
నారాయణ విగ్రహంబులును రామప్రతిమయు నరసింహ
మూర్తియు దశతాలప్రమాణంబు లయి యుండు. బాణుండు
బలీంద్రుఁడు భార్గవుండు నర్జునుండును దశతాలు రని చెప్పం
బడిరి. క్రూరులగు చండీభైరవవేతాలురును హయశీర్షుండును
షోడశతాలురు. మఱియుఁ బైశాచివిగ్రహంబులు నాసురవిగ్ర
హంబులు నెల్లపుడు షోడశతాలోన్నతంబుల కావలయు.
హిరణ్యకశిపుండును వృత్రుండును హిరణ్యాక్షుండును రావణ
కుంభకర్ణులును నముచియు శుంభనిశుంభులును మహిషాసు
రుండును రక్తబీజుండు ననువారి విగ్రహంబులు షోడశతా
లోన్నతంబులై యుండునది. బాలవిగ్రహంబులు పంచతా
లంబులును గుమారవిగ్రహంబులు షట్తాలంబులు నగు. కృత
యుగంబున విగ్రహంబు లెల్ల దశతాలప్రమాణంబులును
త్రేతయందు నవతాలయుతంబులును ద్వాపరంబున నష్టతాల
మాత్రంబులును గలియందు సప్తతాలద్వయసంబులు గావ
లయు ననియుం జెప్పుదురు. నవతాలప్రమాణంబు మూర్తి
యగునపుడు ముఖం బేకతాలంబు లలాటంబు చతురంగులం
బును బిమ్మట నంతయె నాసికయు నాసికకుఁ గ్రిందిభాగంబు
హనువువఱకును నాల్గంగులంబులును గ్రీవ నాల్గంగులంబు
లును హృదయం బేకతాలంబును నెదకుఁ గ్రిందటి ప్రదేశం
బున సురమ్యంబయిననాభి యొకతాలప్రమాణంబును దానికిఁ
గ్రిందిభాగంబున ననురూపం బగు లింగంబును నూరుపరిమా

ణంబు రెండుతాలంబులును జానువులు నాల్గంగులంబులును జంగలు రెండు తాలంబులును గుల్ఫంబులకుఁ గ్రింద నాల్గంగులంబులు నుండునట్లు శిల్పిచేఁ బ్రతిష్ఠాపకులు ప్రతిమల నిర్మింపఁజేయునది. ఇది నవతాలప్రమాణం బయిన విగ్రహావయవనిరూపణం బని బుధులు సెప్పెదరు. దీని ననుసరించి సప్తతాలప్రమాణంబులకు నష్టతాలప్రమాణంబులకు దశతాలోన్నతంబులకు నవయవనిరూపణంబు సేయందగు. మఱియు నెల్లయర్చలకు సిగమొదలు కేశాంతంబుదనుక మూఁడంగులంబుల పరిమాణంబును బాహువులంగులులతో నాల్గుతాలంబుల పరిమాణంబు గలవియు నందుఁ గంధంబు మొదలుకొని కూర్పరంబుదనుక నిరువది యంగులంబుల పరిమితి గలవియు నగునట్లును గక్షంబులనుండి కూర్పరంబుదాఁకఁ బదియు మూఁడంగులంబు లుండునట్లును మధ్యమాంతంబయిన కరం బిరువదియొన్మి దంగులంబులు గలిగియుండునట్లును జేయించు టుత్తమంబు. మఱియుఁ గరతలంబున నేడంగులంబులును నడిమివ్రేలి కయిదంగులంబులు నంగుష్ఠంబునకుఁ దర్జనిమూలపర్వంబు నొందునట్లుగాఁ బరిమాణంబు సార్ధత్ర్యంగులంబును రెండుపర్వంబులును దక్కిన వాసికి మూఁడేసి పర్వంబులును దర్జన్యనామికలకు మధ్యాంగులంబుకంటె సర్ధాంగులంబు న్యూనంబుగను గనిష్ఠిక కనామిక కంటె నొక్కయంగులంబు తక్కువ పరిమాణంబును నుంచునది. పిమ్మటఁ బాదంబులకుఁ బదియు నాలుగంగులంబులును దక్కిన వ్రేళ్ళను సార్ధైకాంగులంబును బరిమాణంబు గలుగునట్లు శిల్పజ్ఞఁ డొనర్చునది.

ఇంకను బాణిపాదములును గుల్ఫములును సిరలు గన్పింపకుండునట్లును బ్రతిమావిశారదులు నిర్ణయించిన యీ యవయవంబు లింతకంటె నధికంబుగను న్యూనంబుగను నుండనట్లును శిల్పులు మిగుల మెలఁకువతో విగ్రహంబులఁ జేయునది. కృశంబులనేని స్థూలములనేని యన్ని యవయవంబులను రమ్యంబు లయిన యర్చలు పెక్కిటియందొక్కటి యుండుం గాని యన్నియు నుండవు. శాస్త్రవిహితపరిమాణానుసారంబుగ నిర్మింపఁబడిన యంగంబులతోఁ గూడిన ప్రతిమలె విద్వాంసులకు రమ్యంబులగుంగాని తద్విరుద్ధంబులట్టివి గానోపవు. మనంబు రంజించు విగ్రహంబులె రమ్యంబులు గాని శాస్త్రవిహితంబులు గావని కొందఱందురు. మఱియు మున్ను చెప్పిన పరిమాణం బౌన్నత్యంబునకును మీఁదం జెప్పు నది వైశాల్యంబునకు నగు.

విగ్రహంబులకు నెనిమిదంగులంబుల విశాలంబయిన లలాటంబును నంతటిభ్రూవులును మూఁడంగులంబుల నేత్రంబులు నందు నడుమ నొక్కంగులంబు కనీనికయు రెండంగులంబుల భ్రూమధ్యంబును నాసామూల పరిధి యొకయంగులంబును దర్బిలద్వయంబున కంగులద్వయ వైశాల్యంబును శ్లక్ష్ణంబయిన నాసిక యౌన్నత్యంబు సార్ధైకాంగులంబును గంధరామూలంబు మొదల్కొని యంసపర్యంతము నెన్మిదంగులములు రెండుబాహువుల నడిమితావు రెండుతాలంబులును స్తనమధ్యం బేకతాలంబును రెండుకర్ణంబుల నడిమితావు పదియు నాఱంగులంబులును గర్ణంబులకు నెలవులకు మధ్య నెన్మిదంగులంబులును నాసకు గర్ణంబులకు మధ్య

కూలముగఁ బ్రసన్నాక్షిని గావించి ధ్యానించునది. ప్రతిమా పరిమాణమున సగమున నేని । మూఁడవయంశమున నేని విగ్రహామునకుఁ బీఠముగల్పించి తత్పరిమాణముకంటె ద్విగుణముగ నేని త్రిగుణముగ నేని యెత్తుగ నాలయద్వారము నిర్మింపించి పీఠౌన్నత్యముకంటె దశకరోన్నతముగ గోడవెట్టించి ద్వారము నుచ్ఛ్రాయముకంటె ద్విగుణముగనేని త్రిగుణముగ నేని యధికముగఁ బ్రాసాదంబు నిర్మింపించి యందేకభూమిక మొదలు సపాదశతభూమికాపర్యంతము శక్త్యనుసారముగఁ గట్టించి నలుదిక్కుల మండపములు స్థాపకుఁడు నిర్మింపించునది. ప్రాసాదములనేని మండపములనేని శిఖరము నిర్మింపించు నెడల స్తంభములు నుపకుడ్యముల నిర్మింపించునది. గర్భాలయవిస్తారము విగ్రహప్రమాణముకంటె నయిదుగుణము లేని యాఱుగుణము లేని ప్రతిమకన్ని దెసలను లేకున్న నెదుటిదెసనయినను విశాలముగ నుండవలయు. ఏదేవతలకు రూపము చెప్పఁబడకుండు నాదేవతలకు నాల్గుభుజములును నాయుధంబులు చెప్పఁబడకున్న మీఁదికరముల నభయవరముద్రలును క్రిందికరముల శంఖచక్రము లేని యంకుశపాశము లేని డమరుశూలము లేని కమలకలశంబు లేని జపమాలాపుస్తకము లేనియు యథాకామముగ నిలుపందగు. ఏదేవునకు శిరోబాహుల్యము చెప్పంబడు నక్కడ గ్రీవాముకుటకంఠములు వరుసతో నేత్రకర్ణయుతముగ శిల్పి నిర్మింపఁదగునుగాని బాహుబాహుల్యంబు చెప్పినచో స్కంధభేదంబు గల్పింపక మోచేతి క్రింది ప్రదేశమున దృఢముగ హస్తములఁ గల్పించునది. బ్రహ్మవిగ్రహామునకు మొగములు నలు

లేకున్నను దోషంబు లేదు. మఱియు బాణలింగంబులందును స్వయంభూవిగ్రహంబులందును జంద్రకాంత విగ్రహంబు సందును గండకిం బుట్టిన మూర్తులందును మానదోషంబు లేదు. సువర్ణాదిధాతువులను బాషాణంబులను నిర్మించిన విగ్రహంబున దోషవిచారంబు సేయునది. కృతయుగంబున శ్వేత శిలను త్రేతను బీతశిలను ద్వాపరంబున రక్తశిలను గలిని గృష్ణశిలను శిల్పి విగ్రహంబులఁ జేయందగు. శ్వేత సాత్వికియు రక్తయుఁ బీతయు రాజసియుఁ గృష్ణవర్ణ తామసియు నని విద్వాంసులు సెప్పుదురు. కొందఱు గృతంబున సువర్ణంబునను త్రేతను రజతంబునను ద్వాపరంబునఁ దామ్రంబునను గలిని నారకూటంబునను విగ్రహనిర్మాణంబు చెప్పిరి. శివ ప్రతిమ శ్వేతవర్ణయు విష్ణుప్రతిమ కృష్ణవర్ణయు సూర్యశక్తి గణేశ్వరప్రతిమలు తామ్రవర్ణంబులును గావలయు నని బుధులు చెప్పుదురు. ఇట్లు లోహసీసాదుల నిర్మించు ప్రతిమలను శాస్త్రవిహితప్రకారంబున నిర్మింప వలయు నని బుధులు వక్కాణించిరి. చలార్చయందేని స్థిరార్చయందేని సలక్షణంబయిన ప్రతిమ నాలయంబున స్థాపింపవలయును గాని సర్వసౌఖ్యవినాశనియయిన విలక్షణప్రతిమ నేవాఁడును స్థాపింపఁ దగదు. మీఁదటి ప్రతిమాలక్షణంబు లన్నియు సేవ్యసేవక భావంబునందుఁ జెప్పఁబడినవి గాని ప్రమోదంబునకుఁ గల్పితంబులందుఁ గావు. ప్రతిమలయందుఁ బెక్కుదోషంబు లున్నను బరమేశ్వరాయత్తచిత్తుం డయిన యర్చకుని తపోబలంబున నవియన్నియు నశియించు. దేవత కెదుటనుండు మండపంబున విగ్రహంబులకంటె నర్ధపరిమాణంబున నేని పూర్ణపరిమా

ణాంబున నేని యధికంబుగ నుండునట్లు శిల్పి వాహనంబులఁ గల్పించునది.

గరుడవాహనంబు రెండుబాహువులు మోమునఁ జంచువు మంచికన్నులు శోభనపక్షంబులు నరాకారంబును గిరీటంబును గవచంబు నంగదంబులు గలిగి బద్ధాంజలియు నమ్రశీర్షంబు సేవ్యపాదాబ్జలోచనంబు నయి వెలయవలయు. మఱియు దేవతలకు వాహనత్వంబు నొందినపక్షులు సింహ వృషభాది మృగంబులును గామరూపంబుల కాని విద్వాంసులయిన శిల్పులు వానినామంబులకుఁ దగిన యాకారంబులఁగొడన దేవాలయమండపంబుల సుభూషణభూషితంబులఁ దత్తద్దేవతాధ్యానతత్పరంబులు నగునట్లు నిర్మించునది. మార్జాలంబు నాకృతియుఁ బచ్చని వర్ణంబును నల్లనిచాఱలును పెద్దశరీరంబుం గలిగి నటలు లేనిది వ్యాఘ్రంబును సన్నంపునడుమును బెద్దకన్నులును విశాలంపుఁ జెక్కులును స్థూలంబులగు గనుబొమలును గలిగి ధూసరవర్ణంబును కృష్ణలాంఛనంబులు లేనిదియై జడలుగల మనోహరాకారంబయిన మహాసత్వంబుగల జంతువు సింగంబు. సింగంబునకును శార్దూలంబునకును భేదంబు కేసరంబులచేతను లాంఛనంబులను వర్ణంబునన కాని తక్కిన యాకారంబునఁ గాన్పింపదు. గజంబును నాకారంబు పృథూదరంబును లంబకర్ణంబును మహాస్కంధంబును సంక్షిప్తచరణంబును బీనహస్తంబును దీర్ఘతుండంబును భగ్నవామదంతంబు నిచ్ఛానుకూలవాహనంబును నగు నట్లును గూఢంబులగు నస్థులు సంధులు ధమనులు గలుగునట్లును బరిమాణానుసారంబుగ శిల్పులు నిర్మింపవలయు. తుండాదండం

బునకు నాల్గుతాలంబులు నాఱంగులములును మస్తకము
నకుఁ బదియంగులములును భ్రూగండంబులకుఁ జతురంగులం
బులును గర్ణములకు దశాంగులదైర్ఘ్యము సప్తాంగులవిస్తార
మును గర్ణముల కంతరంబు పదునాల్గంగులంబులును మస్తక
పరిధి షట్త్రింశదంగులములును నేత్రములకుఁ గ్రిందికర
పరిధి రెండుతాలములు రెండంగులములును దంతమున కాఱం
గులంబుల దైర్ఘ్యంబును, నూరుమూలపరిధి ముప్పదియా
ఱంగులంబులును, దదగ్రపరిధి యిరువదిమూఁడంగులంబు
లును, జంఘామూలంబునకు నిరువది యంగులంబులును,
బాహుమూలపరిధి యంతకంటె రెండంగులంబు లధికం
బును గంఠంబునకు మూఁడంగులముల దైర్ఘ్యంబు, నుదరంబు
నకుఁ జతుస్తాలపరిణాహంబును, గణపతి విగ్రహంబునకుఁ బరి
మాణంబు విశేషజ్ఞులచేఁ జెప్పంబడియె. శక్తివిగ్రహంబులకుఁ
బయోధరోత్సేధం బయిదంగులంబులుం గటివైశాల్యంబు
మూఁడు తాలంబులు రెండంగులంబులు నయియుండు. స్త్రీ
విగ్రహావయవంబు లెల్లను సప్తతాలవిగ్రహంబునకుఁ దగి
నట్లు నిర్మించునది. అట్లయినను మొగము ద్వాదశాంగులంబు
గావలయు. కంధరంబువలె శిరంబు వర్ధిల్లదు గాన శిశువిగ్ర
హంబులు హ్రస్వకంధరంబును బృథుశిరంబును గలిగియుండ
వలయు. బాలావయవంబులకుఁ బరిమాణనియమంబు లేదు
గావున నవి శోభాఢ్యంబు లగునట్లు కల్పించునది. అయిదేం
డ్లకుఁ బిమ్మట నిరువదేండ్ల దనుక బాలుండును బదియునా
ఱేండ్లదనుక బాలికయు మిగుల వర్ధిల్లి తర్వాతఁ బూర్ణావ
యవసంపత్తి నెందుదురు. సప్తతాలాదిప్రమాణంబు విగ్ర

హంబుల కవయవసంపత్తి పూర్ణంబయిన వెనుక నిర్ణీతంబయ్యె. కొన్ని విగ్రహంబులు బాల్యంబునను గొన్ని తారుణ్యంబునను గొన్ని వార్ధకంబునను నున్నట్లు రచియింప మిగుల శోభాఢ్యంబులగు. సప్తతాలమితం బయిన విగ్రహంబునకు మోమునకుఁ గ్రిందఁ గంఠంబున మూఁడంగులంబులును హృదయంబున నుదరంబున నొక్కొక్కట నవాంగులంబులును సక్థి నష్టాదశాంగులంబులును జానువుల మూఁడంగులంబులును జంగలఁ బదియు నెన్మిది యంగులంబులును గుల్ఫంబులకుఁ గ్రింద మూఁడంగులంబులును బరిమాణం బుండవలయు. అష్టతాలమిత ప్రతిమకు జంగలయు నూరులయు మానంబు నిరువదియొక్క యంగులంబులును దక్కినవాని పరిమాణంబు సప్తతాలప్రతిమావయంబులకంటె నొక్కొక్క యంగులంబున నధికంబుగను నుండవలయు.

దశతాలంబయిన మూర్తికి ముఖహృదయంబులు నుదరవస్తులును త్రయోదశాంగుల మితంబులును గుల్ఫాధోభాగంబును గ్రీవయు జానువులును బంచాంగుళ మితంబులును నూరువులు జంగలు నిరువది మూఁడంగులంబుల పరిమితి గలవియు నేకాంగులమితం బయిన శిరోమణియు నేఁబది యంగులంబుల బాహువులు నుండవలయు. ఇంతకంటె హీన ప్రమాణంబులయిన ప్రతిబింబంబుల యవయవంబులకెల్ల రెండేసి యంగులంబుల పరిమాణంబు తక్కువయై యుండు. దశతాలాధిక ప్రమాణంబు లయిన మూర్తుల యవయవంబులెల్ల మీఁదటి మూర్తుల యవయవంబులకంటె నొక్కొక్క యంగులంబున నధికమగు పరిమాణంబు గలవి యగునట్లు బుద్ధి

ఘంతుఁడయిన శిల్పి రచియించునది. దీర్ఘోరుజంఘయుఁ గ్రూ
రాకారయు భీషణియు నగు మూర్తి యాసురి యనియు
నదియె మిగులం గృశయయ్యేనేని పైశాచియనియు విబుధులు
వ్యవహరింతురు. సర్వప్రమాణంబులయందును జేతి నడిమి
వ్రేలికి నాలుంగులంబులకంటె నధికంబుగను నయిదంగులం
బుల కంటె హీనంబుగను బరిమాణంబు శిల్పి నిర్మింపఁదగదు.
మఱియు విగ్రహంబులు బాలసదృశంబులుం దరుణసదృ
శంబులు నిర్మింపఁదగుం గాని యొక్కపుడేని వృద్ధసన్నిభం
బులు సేయందగదు. దేశాధిపతు లిట్లు శాస్త్రప్రకారం
బునఁ జేయంబడిన విగ్రహంబులఁ దమదేశంబున నెల్లచోట్ల
బ్రతిష్ఠింపించి ప్రతివత్సరంబును వానికి మహోత్సవంబులు
సేయింపించుచు దేవాలయంబున మానహీనయు భగ్నయు
నగు ప్రతిమ నుండనీక శిథిలంబు లగు దేవళంబుల నుపేక్షిం
పక మహాయత్నంబున నుద్ధరించుచుఁ బ్రజలచేఁ జేయింపం
బడు నుత్సవంబులెల్ల వర్ధిల్లఁజేయుచు దేవతలఁ బురస్కరించు
కొని నృత్తగీతవాద్యాది సుఖంబు లనుభవించుచు బ్రజల
దుఃఖంబున దుఃఖంబును దత్సుఖంబున సంతోషంబుం బొందు
చుండునది.

ఇది శుక్రనీతిసారంబునఁ జతుర్థాధ్యాయంబునఁ జతుర్థప్రకరణము

---

# చతుర్థాధ్యాయము

## పంచమప్రకరణము

---

### రాజధర్మము

ప్రజ స్వతంత్ర యయ్యోనేని స్వేచ్ఛానుసారంబుగఁ జరియించుం గాన రాజు జనుల వ్యవహారంబు లన్నియు బాగుగం బరిశీలించుచు దుష్టుల నిగ్రహించు చుండవలయు.

ఇష్టహాని గావించువాఁడు శత్రువును బాపప్రచారుండు దుష్టుండు నని చెప్పంబడుదురు. రాజునకుఁ బ్రజేష్టసంపాదనంబు న్యాయ్యంబు. అదియె పాలనంబు ననంబడు. ఏవాఁడు నెవనికి ననిష్టంబు గావింపకుండ నివారించుటయె శత్రునాశంబును నేవాఁడును బాపంబు సేయకుండ శాసించుటయె దుష్టనిగ్రహంబు నని నీతికోవిదులు నల్కుదురు. సదసద్వివేకపూర్వకంబుగ నీ రెండు గుణంబులు గల రాజులకు స్వప్రజాధర్మసంస్థాపనంబును స్వార్థసంసిద్ధియు సులభంబు లయియుండు.

### సభానిర్ణయము

పార్థివుండు క్రోధలోభవర్జితుండయి యమాత్యులతోడను బురోహితునితోడను బ్రాహ్మణులతోడను, బ్రాడ్వివాకునితోడను గూడి సమాహితాంతఃకరణుం డయి ధర్మశాస్త్రానుసారంబుగ రాచకర్జంబులఁ గ్రమంబుగఁ బరిశీలించు

నది. బుద్ధిమంతుఁ డయిన రాజొండె సభ్యుఁడొండె నొక్క
రుండు తగవులఁ బరిష్కరింపను రహస్యంబున వాదిప్రతి
వాదుల వివాదాంశంబు వినను నొక్కపుడుం దగదు. రాగ
లోభ భయద్వేషంబులును నేకతంబున వాదుల యభిప్రా
యంబు వినికియు నను నైదును బక్షపాతారోపహేతువు లని
నీతిజ్ఞులు వల్కుదురు. ఏరాజు సుఖి యయ్యుఁ బౌరజానపద
కార్యంబులు విచారింపకుండు నతఁడు ఘోరనరకంబునం బడు.
మఱియు నేయధిపతి మోహంబున నధర్మంబుగఁ గార్యం
బులఁ దీర్చు నతఁడు శీఘ్రకాలంబున శత్రువశుండగు. వాది
ప్రతివాదుల వచనంబులు విని శాస్త్రసభ్యనిరపేక్షంబుగ
రా జొక్కరుండ వివాదంబు దీర్చిన నుత్తమలోకహానియు
నాయుర్హానియు శత్రులవలని భయంబును స్వజనాపదయుఁ
బాటిల్లుం గాన శాస్త్రంబును సభ్యులం బురస్కరించికొని
వివాదంబులఁ దీర్చుచుండవలయు. రాజునకుఁ గార్యనిర్ణయంబు
సేయ నెడము లేనియెడ జితేంద్రియుండు నపక్షపాతియు
శాంతప్రకృతియుఁ బరలోకభీరువు ధర్మశాస్త్రజ్ఞుఁడు ననల
సుఁడు వేదవిదుండు నగు విప్రునిఁ దద్విషయంబున నియోగించు
నది. విద్వాంసుఁడగు బ్రాహ్మణుఁడు లభింపఁడేని ధర్మశాస్త్ర
జ్ఞులగు క్షత్రియాదుల నియోగించునది; కాని శూద్రు వర్జించు
నది. మఱియు రాజవంశ్యులు ప్రాయికంబుగ బుద్ధిమంతు లయి
యుందురు గాన వారినైనఁ దద్విషయంబున నియోగింపఁదగు.
వ్యవహారంబు నెఱిఁగినవారు ప్రాజ్ఞులు సద్వృత్తశీలురు గుణా
న్వితులుం బగఱయందు నెయ్యురయందు సములు సత్య
వాదులు నరివర్గంబు జయించినవారు ననలసులు ప్రియంవదులు

నగు నెల్ల జాతుల వారిని సభ్యుల (Councillors) నృపతి కార్య నిర్ణయార్థం బేర్పఱుచునది. మఱియుం గృషీవలులును గారు వులును శిల్పులును వృద్ధిజీవులు శ్రేణులును నర్తకులును మఱియు లింగులుం జోరులును వారివారి జాతింగో సంబం ధించిన ధర్మనిర్ణయంబు సల్పునపుడు తజ్జాతిధర్మంబు లితరు లకు దుర్విజ్ఞానంబులు గావునఁ దత్తజ్జాతివృద్ధులన వాని నిర్ణయింప రాజు నియోగించునది. ఆత్మహితంబు గోరు రాజు బ్రహ్మచర్యాద్యాశ్రమంబుల నున్న వారి కాశ్రమ ధర్మనిర్ణయార్థంబు వివాదంబు వొడమినపుడు విరుద్ధంబుగ భాషింపక యోగులుం దపస్వులును మాయావిదులును సులభ కోపులు గావున వారి వివాదంబులు వేదవిదులచేతన తీర్పింప వలయును గాని స్వయముగఁ బరిశీలించి తీర్పందగదు. రాజు లెస్సగ నెఱింగినవాఁడయ్యుఁ దపస్వులకు నాచార్యులకు నుప దేశింపఁదగదు. అరణ్యవాసులను సార్థంబువారిని సైనికులను వారివారి వివాదంబులు దీర్ప రాజు నియోగింపవలయు. ఎవ్వ రెం దభియుక్తులు మఱి యెవ్వరెందు నియుక్తులు వారు దాని గుణదోషంబులఁ బరిశీలింప రా జాజ్ఞాపింపవలయు. మఱియు ధార్మికులు సుపరీక్షితులు పుంగవంబులువోలె వ్యవహార ధు రంధరులు నగు సభ్యులను ధర్మనిర్ణయార్థంబు నియోగించునది. లోకాచారజ్ఞులును వేదజ్ఞులును ధర్మశాస్త్రజ్ఞులు నగు విప్రు లేడ్గు రేని యైదుగు రేని మువ్వు రేని యెచ్చట వసింతు రాసభ (Assembly) పరమపావని యగు. ఆ సభయందుఁ జేయు ధర్మ నిర్ణయంబు విచక్షణు లగువారు విన ననుజ్ఞ ధర్మాధికృతుం డీవలయు. సభయందు నియుక్తుండయిన ననియుక్తుండయినను

ధర్మజ్ఞుండు శాస్త్రానుసారంబుగను సత్యంబుగను బల్కఁగానిఁ బల్కనతగు. విద్వాంసుఁడట్టిసభకుఁ బోవఁదగదు. పోయిన సత్యంబు పలుకం దగు. ఎఱిఁగియు సత్యంబు పల్కనివాఁడును విరుద్ధంబు పల్కువాఁడును గిల్బిషంబు నొందు. రాజుచే విదితంబు లయిన కులగణాదులెల్లను స్వకులోచితకర్మంబులఁ గావించుచు స్తేయాది దుష్కర్మంబులఁ గావింపక చరియించు. కులంబువారు విచారింపలేని కార్యంబు సభ్యులును వారు విచారింప శక్తులు గాని కార్యంబు తదధ్యక్షుండు (Officer) నతనికి సాధ్యంబుగాని కార్యంబు రాజును విచారింపవలయు. కులంబువారికంటె సభ్యులును వారికంటె నధ్యక్షుండు నెల్ల వారికంటె ధర్మాధర్మనియామకుఁడయిన రాజు నధికులు గదా! ఉత్తమాధమమధ్యంబు లయిన వివాదంబులఁ దీర్చు నపుడు ప్రభుబుద్ధులందఱ నతిక్రమించి వర్తిల్లు. ఒకవిద్య నధిగమించినవాఁడు ధర్మనిర్ణయంబు సేయ సమర్థుండు గాఁడు గావున రాజుచేఁ బెక్కువిద్యలు నేర్చిన యుత్తముఁడు వివాదంబుల ధర్మనిర్ణయార్థంబు నియోగింపఁబడవలయు. పెక్కు శాస్త్రంబుల నెఱిఁగిన యుత్తముండు చెప్పినది ధర్మం బగు. అధ్యాత్మవిచారంబు సేయువాఁ డొక్కఁడయినను ధర్మనిర్ణయంబు సేయందగు. ఱేఁడు శ్రేష్ఠులయిన వేత్తలు ధర్మాధికారులతోఁ గూడి వ్యవహారానుచింతనంబు పెక్కుసారులు గావింపవలయు. ఎవఁడు వాదిప్రతివాదులను సభ్యులను లేఖకులం బ్రేక్షకులను ధర్మప్రతిపాదకవాక్యంబుల రంజించు నతఁడు సభ్యపదంబును దదధ్యక్షపదంబును బొందఁదగు.

## సభాంగములు

నృపుఁడును, నధికృతుఁడు (Officer), సభ్యులును (Councillors) ధర్మశాస్త్రంబును, గణకుఁడు (Accountant), లేఖకుఁడును, హేమంబు, నగ్నియు, జలంబును, భటులు, నను పదియు ధర్మాధికరణంబున కంగంబులు. ఈ దశాంగములు గల యీసభ నధివసించి రాజు కృతమతియై న్యాయము విచారించు నాసభ యజ్ఞసదృశం బయి వెలయు. ఈ యంగముల యందు నధికృతుఁడు వివాదవక్తయు రాజు శాసకుండును సభ్యులు కార్యపరీక్షకులుఁ గావలయు. స్మృతి నిర్ణయమును జపదానాదులం జెప్పును. హిరణ్యాగ్నులు శపథార్థమును జలము తృషానివారణార్థము నుపయోగించు. గణకుఁ డర్థముల గణియించు. లేఖకుఁడు ప్రకృతంబయిన న్యాయము లిఖియించు. (భటు లూడిగము సేయవలయు.) శబ్దార్థముల నెఱిఁగినవారు శుచులు నానాలిపిజ్ఞులు గణనాకుశలులు నగు గణక లేఖకులు రాజుచే నియోగింపఁబడవలయు. ఎల్లజనుల వ్యవహారములు ధర్మశాస్త్రానుసారముగ నిందు మిగులఁ బరిశీలింపఁబడుటం జేసి యీసభ ధర్మాధికరణము (Court of Justice) నాఁబడు. పార్థివుండు వ్యవహారముల విచారింపఁగోరి శుచులగు బ్రాహ్మణులతోడను మంతనంబు నెఱిఁగిన యమాత్యులతోడను వినీత వేషుండై సభం బ్రవేశించి ధర్మాసనం బధిష్ఠించి కార్యవిచారంబునకుఁ దొడంగి యర్థిప్రత్యర్థులయందు సముఁడయి వారి వివాదాంశంబుల నడిగి శాస్త్రసిద్ధంబులు లోకసిద్ధంబులు నగు హేతువులతో జాతిధర్మంబులు జనపదధర్మంబులు శ్రేణీధర్మంబులు కులధర్మంబులు బాగుగం బరికించుచు క్షత్రధర్మంబు నతిక్రమింపక తీర్పవలయు.

### వాడుకలో నున్న ధర్మములు

పురాతనంబు లయిన జాతి దేశ కుల ధర్మంబులు రాజు రక్షింపకున్నఁ బ్రజ మిగుల క్షోభించు. దాక్షిణాత్యులయిన ద్విజులు మాతులకన్య నుద్వహింతురు. మధ్యదేశంబునఁ గర్మకరులును శిల్పులును గోమాంసంబు భుజియింత్రు. అచటి నరు లెల్లరు మత్స్యములం దినువారును స్త్రీలు వ్యభిచారాసక్తలు. ఉత్తరదేశమునఁ బెక్కండ్రు స్త్రీలు మద్యంబు ద్రావువారును గలరు. మఱియు నచట రజస్వలలు మనుజులకు స్పృశ్యలగుదురు. ఖశజాతుల భర్తృకయైన భ్రాతృభార్యం బెండ్లియాడుదురు. ఈజనుల కివి యపరాధంబు లని యెంచి రాజు ప్రాయశ్చిత్తంబునేని దమంబునేని విధింపఁదగదు. ఎవరి కే యాచారంబులు పరంపరాప్రాప్తంబులుం బూర్వానుష్ఠితంబులు నగు నవి వారి కనుష్ఠేయంబుల కాని యితరుల కవి దూష్యంబు లగు. కలియుగంబున శ్రీమంతులు జ్ఞానలవదుర్విదగ్ధులును వేదవిముఖులుఁ దంత్రకర్మరతులుం బరస్త్రీధనలుబ్ధులును బ్రాయికంబుగ నగుదురు గాన రాజు వారినధికముగ దండించి ధర్మమార్గంబునకుం ద్రిప్పనది.

### రాజు వాదిం బరీక్షించి యతనివాదమును వినువిధము

రాజు పూర్వాహ్ణంబున స్మృతులం బరిశీలించుచు మధ్యాహ్నంబున న్యాయంబులు విచారించునది కాని మనుష్యమారణంబు స్తేయంబుం బ్రజలకతిపీడాకరంబయిన యపరాధంబును గాలనియమంబుసేయక తక్షణంబ విచారింపవలయు. వాది (Plaintiff) ధర్మాసనగతుం డయి మంత్రులతోఁ

గూడియున్న నృపుఁ జేరి సత్యంబు చింతించుచు సధర్మంబు నకుఁ జేరక జాగరూకుఁ డయి నివేద్యాంశంబు లిఖియించి నమస్కరించి ప్రాంజలియై వినమ్రుం డగుచు నివేదించునది. రాజట్లు నివేదింప నేతెంచినవానిం జూచి యథార్థంబుగ సత్కరించి బ్రాహ్మణులతో సాంత్వనంబున నతనికి దుఃఖోప శమనంబు సేసి యేకర్జంబున నిచటి కేతెంచితి వేదుష్టునిచే నేకాలంబున నేచోట నేకారణంబున నేపీడ నందితివి సత్యం బు చెప్పు మని యడిగి యతఁడు చెప్పునది వినవలయు. మఱి యు నాచెప్పినదాని లేఖకుఁడు ప్రసిద్ధంబగు లిపిని సులభా ర్థంబగు భాషను వ్రాయవలయు.

శిక్షార్హులు

వాది ప్రతివాదులు చెప్పినదానికి విరుద్ధముగ వ్రాసిన లేఖకునిఁ జోరదండమున దండించుచు నట్టివ్రాఁతను మన్నిం చు సభ్యులను బలాత్కారంబున లిఖితంబు గ్రహించువారిని నట్లు దమియించుచు రాజు వ్యవహారముల విమర్శించుచుండ వలయు.

[1]న్యాయముల విచారించువిధము

రాజు సభకు రానియపుడు ప్రాడ్వివాకుఁడు సభా గతుని నట్లడిగి రాచకర్జముల విచారించునది. వాదిప్రతివా దులఁ బృచ్ఛ సేయుటచేఁ బ్రాట్టనియు వారు చెప్పినదాని విని విచారణసేయుట నేని సభ్యులతోఁ (Assessors) గూడి ధర్మా ధర్మములు నిర్ణయించి పలుకుట నేని వివాకుం డనియు నివి రెండును గలవాఁడు ప్రాడ్వివాకుఁ డనియు నీతిజ్ఞులు నిర్వచిం

త్రు. సభయందుఁ బరహితులు గార్యదక్షులు సాధువులు నగువారు సభ్యు లనంబడుదురు. స్మృతికిని సదాచారమున కును విరుద్ధంబగు మార్గమునఁ బెఱలచే నాధర్షింపఁబడిన వాఁడు రాజునకు విన్నవించిన నా యాధర్షణనివేదనము వ్యవహారపదంబు. (Subject Matter of Law-suit) రాజేని రాజపురుషులేని పరులచే నివేదింపఁబడని తగవులఁ దమబుద్ధిబలమున నుత్పాదించి రాగమున నొండెఁ గ్రోధమున నొండెఁ లోభంబున నొండెఁ బ్రజల బాధింపఁ దగదు; కాని ముందు చెప్పంబడు ఛలములు నపరాధములు నృపతిపదములును స్వయముగ నేని స్తోభకునిచేత నేని సూచకునిచేత నేని యెఱిఁగి యావేదకులు నివేదింపకున్నను రాజు గ్రహించి విచారింపవలయు. శాస్త్రంబున నిందితుఁడును రాజుచే ననియుక్తుఁడు ధనముం గోరువాఁడు నయి యెవఁడు రాజునకుఁ గార్యము నావేదించు నాతఁడు స్తోభకుఁడును రాజుచేఁ బరదోషవీక్షణమున నియుక్తుఁడయి నృపునకుఁ గార్యము సూచించు వాఁడు సూచకుఁడు నని చెప్పంబడుదురు.

ఛలంబులు

మార్గభంగంబును, బరనిందయుఁ, బ్రాకారలంఘనంబును నిపాన (Water-reservoir) వినాశంబును గృహనాశనంబును గ్రామరక్షణార్థంబు త్రవ్వించిన పరిఖం బూడ్చుటయు, రాజలోపప్రకాశనమును, శుద్ధాంతమును వాసగృహమును భాండాగారమును బానసము నాన వొందక చొచ్చుటయు, నట్లు భోజనదర్శనమును, రాజు నెదుట బుద్ధిపూర్వకముగ నిష్ఠీవనాది ప్రక్షేపణమును, బర్యంకాసనబంధమును, రాజాధిక

వేషమును ముందటఁగూర్చుండుటయు నపద్వారమున నకాల
మున నన్యగృహప్రవేశమును, బ్రభువు నాజ్ఞ నొందక యాస
నాదిగ్రహణమును, నృపునెదుట శయ్యాసనపాదుకాగ్రహణ
మును లేని పగలు సేవించుటయు రాజు శయనింప నాసన్నుఁ
డగుటయు, భూపతి సమీపంబున నన్యవస్త్రాభరణ ధారణము,
నదత్తతాంబూల గ్రహణమును, బుష్పమాలాధారణమును,
ముక్తకేశత్వము, నభ్యంగనముఁ, బరిధానవిధూననము, నవ
కుంఠ నవిచిత్రాంగత్వంబులు నేకవస్త్రధారణంబు ననుజ్ఞఁ
బ్రార్థింపక భాషించుటయుఁ, గర్ణనాసావిశోధనంబు, వ్యసనా
సక్తియు, దంతకర్షణంబు, నుష్ణీషధారణంబుఁ బరచ్ఛిద్రా
న్వేషణంబు రాజనిందయు మొదలగునవి ఛలంబులు.

### అపరాధంబులు

రాజశాసనాతిక్రమణంబును, బరస్త్రీగమనమును, స్త్రీవధంబును, వర్ణసాంకర్యంబును, జౌర్యంబును, భర్తృసంబంధము లేకుండ గర్భధారణంబును, వాక్పారుష్యంబును, దండపారుష్యంబును, గర్భపాతంబును, నవాచ్యవాదంబు, ననునవి యపరాధంబు లగు; ఉద్వేజనంబును, సస్యఘాతంబును, గృహాదిదాహంబును, రాజద్రోహంబును, రాజముద్రాభేదంబును=తప్పునాణెముల సృజించుట.

### నృపతిపదములు, రాజజ్ఞేయములు

తన్మంత్రభేదంబును, రాజభాగాపహారణంబును స్వత్వంబు లేని వస్తువుల దాన విక్రయంబులును, రాజశాసన ఘోషణాచ్ఛాదనంబును, బందీ విమోచనంబును, రాజద్రవ్యం బేని యస్వామిక ద్రవ్యం బేని యపహ-

రించుటయు, జంతులయంగవినాశంబు, ననునివి నృపతి పదంబు లని చెప్పంబడు. ఇవియన్నియు, నెవ్వరు నావేదింప కున్నను, రాజు తెలిసికొని విచారించి యపరాధుల దండించు నది. క్రూరవేషుండును గర్వితుండును దాంభికుండును స్థేయు వితోఁ దుల్యంబుగ నాసనంబున నున్నవాఁడు నగువాది (Complainant) రాజునకు దండ్యుఁ డగు. వాదిచే రాజునకు నివేదింపఁ బడిన యంశం బావేదనం (Plaint) బనియు నదియె యఖిల వ్యవహారంబు తెలియునట్లు ప్రాడ్వివాకునకు సభ్యు లకు విన్నవించినఁ బూర్వపక్షంబనియుఁ వ్యవహారజ్ఞులు చెప్పు దురు. వాది చెప్పిన పూర్వపక్షము విని సభ్యాదులు విచా రించి యధికసాక్ష్యంబు త్యజియించి లోపంబున్నం బూరించిన పిదప రాజు వాదిచేనంకితంబయిన యా వాఙ్మూలంబునఁ దన ముద్ర వేయింపవలయు. ధర్మాధికారులు రాగలోభ భయం బుల వాదిచెప్పినపక్షంబు శోధింపక పక్షపాతులయి యుత్త రంబు = (Statement) వ్రాయించినయెడ రాజు వారి శాసించి స్మృత్యర్థం బధికారంబునుండి తొలఁగించునది. మఱియు రాజు వివాదంబులు గ్రాహ్యంబులు (పట్టఁదగినవి) నగ్రా హ్యంబులు (పట్టఁదగనివి) బాగుగ విమర్శించి తగినవానిన గ్రహించి వాది పూర్వపక్షంబు సేసినవెనుక నతని విడచునది.

### ఆసేధభేదము

చెప్పినదాని నతిక్రమించుననియు వక్తవ్యాంశంబు బాగుగఁ జెప్పఁడనియుఁ దోఁచెనేని వాది ప్రతివాదిని రాజాజ్ఞ నొంది సత్యవచనులు, దృఢులు, శస్త్రాస్త్రధారులు నింగి తజ్ఞులు ననలసులు నగు రాజభటులచేత నేని తనశపథంబుల

నేని వివాదంబు తీర్పనాహ్వానంబు (సమను) (Summons) చేయుదనుక నాసేధించునది. స్థానాసేధంబు కాలాసేధంబుఁ బ్రవాసాసేధము కర్మాసేధము నని యాసేధము (Detention) నలుఁదెఱంగులనుండు. ఆసిద్ధుఁడెన్నఁడు నాసేధంబుల్లఘింపఁ జనదు. ఉల్లంఘించిన దండ్యుండగును గాని యింద్రియ వ్యాపారమునకు నిరోధము గలుగునట్లును శ్వాసనిరోధము గలుగునట్లు నాసేధింపఁబడినయెడ నాసేధము నతిక్రమించి నను దండార్హుండు గాఁడు; మఱియు నట్లాసేధించినవాఁ డవశ్యము దండ్యుఁ డగు. తత్త్వమున నేని సందేహమున నేని వాది యెవ్వఁనిపై నభియోగము దెచ్చునతనిన రాజు స్వముద్రా ముద్రితంబయిన లేఖ్యమున నేని కేవల భటులచేత నేని వివాదంబు పరిశీలింప నధికరణంబు (Court) నకు రావించునది. విచక్షణుండయిన తీర్పరి యసత్సంసర్గంబునను బూర్వచరిత్రానుభవంబునను శంకయు లోప్త్రద్రవ్య దర్శనంబునఁ దత్త్వంబు నెఱుంగవచ్చు.

సభకు రాఁదగనివారు

రోగార్తులను విపన్నులను రాజకార్యవ్యగ్రులను మఱియొక్కచో నభియోగంబు గలవారి నుత్సవాసక్తులను భృత్యులను మత్తులను సూతికలను వ్యసనులను యియుత్సులను దత్తత్కాలంబునను గులీనలు ననదలు నగు నువిదలను నుత్తమలగు కన్నెలన జ్ఞాతప్రభుకలయిన యింతులను బాలురను వృద్ధులను నొక్కపుడును రాజు పిలిపింపను నాసేధింపనుందగదు. మఱియు గోవుల మేపుతఱి గోపాలురను, సస్యావాపకాలంబునఁ గృషీవలులను గర్జంబులు సేయునపుడు

శిల్పులను బాలికలన నున్నపుడు జోదులను వచ్చినపని కావిం పకున్న దూతలను దానాభిముఖుండగు దాతను వ్రతంబు పూర్ణంబగు దనుక వ్రతిని సాక్షులఁగాఁ బిలిపింపను నిరోధింపను దగదు.

ఎపుడెల్లవారును సభకురావలె

దేశోపద్రవాదులయం దాసేధంబు నతిక్రమించినవాఁడపరాధి గాఁడు. ఱేఁడు దేశకాలంబులను గార్యంబుల బలాబలంబులను బాగుగం బరిశీలించి యొకప్పు డకల్యాదుల నయి నను మందమందంబుగను యానాదిసహాయంబునను రప్పింపనుం దగు. అభియోగంబు నెఱింగినవా రరణ్యవాసులగు పరివ్రాజకాదులయినను గార్యగౌరవంబు గలప్పు డనుశాసకుఁడు వారలకుఁ గోపంబు వుట్టకుండ రప్పింపన వలయు. అర్థియేఁ బ్రత్యర్థియేఁ గార్యాంతరాకులుండౌండె వ్యవహారానభిజ్ఞుండౌండె నగునపుడు తజ్జ్ఞుడయిన ప్రతినిధిని (Pleader) రాజంగీకరింప వలయు.

ప్రతినిధులు = (Pleaders)

మఱియు వాది ప్రతివాదుల ప్రగల్భులు, నున్మత్తులు, వృద్ధులు, స్త్రీలు, బాలురు, రోగులు నయినయెడ వారిబంధువేని నియుక్తుఁడేని పూర్వోత్తరపక్షంబులుచేసి వ్యవహారంబు నిర్వహింప రాజంగీకరింప వచ్చు. వాది ప్రతివాదులు లేకున్నను వారిమాతాపితలేని సుహృద్బంధులేని భ్రాతలేనియున్న యెడ వాదంబు ప్రవర్తింపఁ జేయవలయు. మఱియు నియోగంబుననేని చుట్టఱికంబుననేని యేనాఁడయినం బ్రతినిధియె

చేసినదంతయుఁ దన్నియోగంబు గావించినవాఁడు చేసినట్ల
యప్రతిహతంబుగ రాజు గ్రహింపం దగు.

నియుక్తు (Pleader) నకు వివాదద్రవ్యంబున షోడశాం
శం బేని వింశాంశం బేని దాననర్ధం బేని తదర్ధం బేని తదర్ధం బేని
భృతి న్యాయాధికారి యిప్పించుచు ద్రవ్యం బధికంబయిన కొ
లఁదిఁ దక్కువపాలు నల్పంబయినకొలఁది నెక్కువపాలు నిప్పిం
పవలయు. నియోజకుఁడు పెక్కండ్ర నియోగించెనేని వారి
కా వాసరంబు వెచ్చమునకుఁ దగినంతసొమ్మయిన నిప్పింప
వలయు. ధర్మజ్ఞుఁడు వ్యవహారజ్ఞుఁడు నగువాఁడు ప్రతినిధి
పదంబున కర్హుండుగాని యితరుఁడు గాఁడు. అనర్హుఁడు ప్రతి
నిధియై వేతనంబు గొనెనేని రాజతని దండించునది. రాజు
తన యిచ్ఛ ననుసరించి సంతతంబు నొక్కప్రతినిధి నియమింపఁ
గూడదు. మఱియు వాదులచే నియుక్తుండయిన ప్రతినిధి
లోభంబునఁ గార్యహాని చేసెనేని యవశ్యం బతని దండింప
వలయు. ఎవఁడు వాదిప్రతివాదులకు సోదరుఁడేని పితయేని
పుత్త్రుఁడేని నియుక్తుఁడేని కాక వ్యవహారంబుల వాదించుచు
వివిధంబులగు నసంబద్ధాలాపంబులు వల్కు నతఁడు రాజు
నకు నెట్టన దండ్యుఁడగు. గృహంబునఁ బెత్తనంబు సేయు
స్త్రీలను స్వైరిణులను గణికలను నిష్కులులను మహాపాత
కంబులు గావించిన వెలందులను వివాదంబుల విచారించు
నపుడు ఱేఁడాహ్వానంబు నంపి యధికరణంబునకు రావింపఁ
దగు. మఱియు వాదంబు ప్రవర్తిల్లిన యనంతరము వాది
ప్రతివాదులు మృతులయిన నావ్యవహారం బెఱిఁగినపుత్త్రుల

వారిస్థానంబున నిల్చి వ్యవహారంబుల నిర్వహింప వలయు. ఔరసు లావ్యవహారం బెఱుఁగకున్న నెత్తివేయవలయు.

### ప్రతినిధుల నంగీకరింపరాని నేరములు

మనుష్య మారణంబును బరదారాభి మర్శనంబు నభక్ష్యభక్షణంబు కన్యాహరణంబు దద్దూషణంబును బరుష దండప్రయోగంబును బరుషవాక్ప్రయోగంబును గూటకరణంబును రాజద్రోహంబు నను నపరాధంబులందుఁ బ్రతినిధి నంగీకరింపక యపరాధియె వాదించుకొనునట్లు రా జేర్పఱుచునది. అభియోగమున నాహూతుండయి యెవఁడేని బంధుబలంబుననేని యితర దర్పముననేని రాక యాజ్ఞను నిరాకరించు వాని నావివాదానుసారముగ లోకమర్యాదార్థంబు రాజు దండింప వలయు.

### ప్రతిభూగ్రహణము

రాజభటులచే నాహూతులయి వచ్చిన ప్రాప్తధర్షణులగు వాది ప్రతివాదులకుఁ దగిన లగ్నకుల రాజాలోచించి గ్రహించునది. ఇతఁడీనియెడ నింత సొమ్మిచ్చెదనని యొప్పికొన్నవాఁడు దానప్రతిభువును వీని మీసమీపమునకుఁ గావలసినపుడు తీసికొని వత్తునని యొప్పికొన్నవాఁడు దర్శన ప్రతిభువును బంధకంబు నీతనిచేఁ దెప్పింతుననియు నీతనిచేఁ గార్యంబునేఁ జేయింతుననియు నీతనివలన భయము లేదనియు నితఁడు వృత్తిమంతుఁడనియు సత్యవాదియనియుఁ జెప్పి యొప్పికొన్నవాఁడు ప్రత్యయ ప్రతిభువునని చెప్పంబడుదురు. రాజు ప్రగల్భుఁడు విశ్రుతుండు ధనియు స్వతంత్రుఁడు నగులగ్నకుని వాది కేని ప్రతివాది కేని యంగీకరింప వలయు. మఱియు

వివాదంబుల విమర్శించునప్పుడు వివాద సాధనంబులయిన లిఖితాదులతోఁ గూడినవారును స్వతంత్రులే నస్వతంత్రులే సగు వాది ప్రతివాదుల నిరోధించి కూటసాధన సందేహమున సత్యము తెలియంగోరి బాగుగ విమర్శించునది.

## గ్రాహ్యాగ్రాహ్య పక్షాదులు

ప్రతిజ్ఞాదోషంబులు (మొదటి వాగ్మూలమునకు విరోధము) లేనిదియు సత్కారణాన్వితంబు సాధ్యంబు నిశ్చితంబు లోకసిద్ధంబునగు నభియోగవిషయంబు పక్షంబని విద్వాంసులు చెప్పుదురు. అన్యార్థము నర్థహీనంబు ప్రమాణవర్జితము హేతుశూన్యంబు హీనలేఖ్యంబు నధికలేఖ్యంబును జ్యాతాంశంబు నను నివి లిఖితమున భాషాదోషములని చెప్పుదురు. అప్రసిద్ధమును నిరాబాధమును నిరర్థకము నసాధ్యమును లోకవిరుద్ధంబు నగు నభియోగవిషయము పక్షాభాసముగావున దాని తేఁడు వర్జింపవలయునుగాని గ్రహింపందగదు. మూఁగ నన్నుఁ దిట్టెననియు వంజకొడుకు నన్నుఁ గొట్టెననియు నేవాఁడు నెన్నఁడు విననిదియుఁ జూడనిదియు నగు వాదం బప్రసిద్ధంబు. నాయింటిసమీపమున నొకఁడు తనయింట నధ్యయనంబు సేయుచుండుననియు సుస్వరమున గానము సేయుచుఁ గ్రీడించుచుండుననియు నాసుఖమున సుఖమును దుఃఖమున దుఃఖమును లోకము వొందదనియు నానిశాంతంబునొద్ద నొకఁడు వీథి కభిముఖముగఁ గ్రొత్తగుమ్మము నిర్మించెననియుఁ జేయు నభియోగము నిరాబాధము నిరర్థకమునగు. నాకూఁతు నల్లుఁడు తీసికొనిపోయెననియు మృతుండు మాట్లాడుట లేదనియుఁ జేయువాదము లోకవిరుద్ధము నసాధ్యంబునగు. వాది

తనకార్యము రాజునకు మున్నావేదించి పిమ్మట దానికి విరుద్ధముగ భాషించినను వివాదము వదలుకొన్నను బ్రతిపక్షంబు నాశ్రయించినను జితుండును దండ్యుండునగు. నిశ్చింతముగ వాది పూర్వపక్షము (ఫిర్యాదు) చేసినవెనుక గ్రాహ్యాగ్రాహ్యాంబుల బాగుగం బరిశోధించి సదస్యులచే ననుజ్ఞాతుండయి ప్రాడ్వివాకుఁడు ప్రతివాదిచే నుత్తరము వ్రాయించునది. అభియోగము చేసిన వానిసన్నిధి నభియోగంబు నంశంబు విని పూర్వపక్షమున కంతకు వర్తిల్లునదియు సారవంతము నసందిగ్ధంబు వినువారికి సుబోధంబు నగునుత్తరంబు (Answer) ప్రతివాది లిఖించునది. సందిగ్ధమును బ్రకృతాంశముకంటె భిన్నమును నత్యల్పము నతివిస్తారముఁ బక్షైకదేశ వ్యాప్తంబు నగు నది యుత్తరము గాదు. వాదిగాని ప్రతివాదిగాని (Defendent) యాహూతుండయి యేమియుం జెప్పకున్న నతఁడోడినవాఁడును దండ్యుండు నగు. వాదిపూర్వపక్షము యథార్థంబగుచుండఁ బ్రత్యర్థి యుత్తరంబీయనియెడ విచారపతి సామాద్యుపాయముల నుత్తరంబిప్పించునది. అజ్ఞానంబున నేని శాఠ్యమున నేని వాది విడిచినయంశం బుత్తరమున నున్న నట్లు ప్రతివాది యుత్తరం బీయనియంశము పూర్వపక్షమున నున్నను వారిద్దఱ నడిగి యాయంశము యుక్తి చాతుర్యమున న్యాయాధిపతి గ్రహించునది. ఉత్తరము సత్యంబు, మిథ్యోత్తరము, ప్రత్యవస్కందనము, పూర్వన్యాయము నని నలుఁదెఱంగుల నుండు. వాది చెప్పినది సత్యంబని యంగీకరించి యిచ్చిన యుత్తరము సత్యంబగు. అదియె ప్రతిపత్తియు ననంబడు. పూర్వపక్షము విని యందలి

శబ్దంబుననేని యర్థంబుననేని నిషేధించిన దాని మిథ్యోత్తరం బందురు. వివాదాంశము నేనెఱుఁగననియు, నీవ్యవహారము జరిగినపుడు నేజన్మింపలేదనియు, నే నీ వ్యవహారకాలమున నచట లేననియు నిది మిథ్యయనియు నిషేధభేదమున మిథ్యోత్తరము చతుర్విధంబయ్యె. వాది చేసినవాదము ప్రతివాది యొప్పికొని యీకారణమున నిది గ్రాహ్యము గాదని నిషేధించిన నది ప్రత్యవస్కందనంబు. ఈవిషయమున నాకు నీ వాదికి మున్ను వివాదము జరిగెననియు నం దీవాది యోటు వడియె ననియు జయపత్రముననేని సభ్యులచేతనేని సాక్షుల చేతనేని తెలియఁజేసి నిషేధించిన నది పూర్వన్యాయంబని కోవిదులు వక్కాణదురు. వాది ప్రతివాదుల సమక్షమున నుత్తరంబు గొనక రహస్యమున నట్లు చేసిన సభ్యులను రాజు దండింపవలయు. ప్రతివాది లిఖియించిన యుత్తరంబు శోధింపఁ బడినపిమ్మట నిర్ణయంబు (Decision and judgment) నకుఁ గారణంబయిన క్రియాభాగంబు ప్రవర్తిల్లు.

లిఖితాదిపరీక్ష

పూర్వపక్షంబు నుత్తరంబుం గ్రియయు నిర్ణయంబు నను నాల్గును ప్రతిపత్త్యుత్తరంబు గాని వ్యవహారంబులకుఁ బాదంబులు. అర్థిప్రత్యర్థులకార్యంబు సాధ్యంబును దద్కార్య సాధనంబు క్రియయు ననంబడు. అర్థియేని ప్రత్యర్థియేని తృతీయపాదంబునఁ గార్యసాధనంబగు సాక్షి లేఖ్యాది రూపంబయిన క్రియం బ్రదర్శింప వలయు. రాజు వివాదంబులఁ గ్రమంబుగ నేని కార్య గౌరవంబు నాలోచించి యక్రమంబుగ నేని వర్ణానుసారంబుగ నేని విచారింపవలయు.

సభ్యులు ప్రతివాదిచే నుత్తరంబు వ్రాయించినవెనుక సిర్ణ యార్థం బెవ్వఁడు సాక్ష్యాదిక్రియ ముందు తేవలయునో బాగుగ నాలోచించి వాని కాజ్ఞ యీవలయు. అట్లనుజ్ఞ యిచ్చినతరువాత నతఁడు తాఁ జెప్పినదాని నిర్వహించుక్రియఁ దేవలయు. ఒక వివాదంబున వాది ప్రతివాదుల కిద్దఱకును సాక్ష్యాదిక్రియ యనావశ్యకంబయి యుండు. మిథ్యోత్తరం బున వాదియుఁ బ్రత్యవస్కందనంబునను బూర్వన్యాయం బునను బ్రతివాదియుఁ గ్రియాభారంబు (Burden of proof) నిర్వహింప సభ్యు లనుజ్ఞ యీవలయు. ఒకప్పుడు కారణవిశే షంబువలనఁ బూర్వపక్షంబు నుత్తరపక్షం బగు. అప్పుడు ప్రతివాది యుత్తరం బిచ్చినవెనుక వాది తన వాఙ్మూలము ధ్రువపర్చుక్రియ లిఖయించి యిచ్చునది. పైనఁజెప్పినక్రియ, మానుషంబు దైవంబునని ద్వివిధంబగు. అందు మానుషంబు లిఖితంబు భుక్తి సాక్షులు నని త్రివిధంబు. ఈసాధనంబులు సంభవిల్లనినాఁడు దివ్యంబులయిన ప్రమాణంబులు గావలయు. అట్టిదైవమానుష సాధనంబులు తత్త్వంబులు ఛలంబులు నని యిరుదెఱఁగుల నుండు. నిజంబు చెప్పునది తత్త్వంబును కూటంబు (False) చెప్పునది ఛలంబునని వ్యవహారవిదులు చెప్పుదురు. రాజు యుక్తులను సామాద్యుపాయంబులను గూటంబు చెప్పు సాక్ష్యాదుల నెఱిఁగి నిరసించి నిజంబు చెప్పు వాని గ్రహించి వివాదంబులఁ దీర్చునది. మఱియు సాక్షి లిఖితాదులఁ దేఁ జిరకాలంబు గడువిచ్చిన ధర్మహానిరూపం బైన దోషంబు సంభవిల్లుఁగాన దానఁ గాలహరణంబు చేయింపఁ దగదు. రాజు లిఖితాది సాధనంబుల వాది ప్రతి

వాదుల యెదుటను గ్రహింప వలయును గాని వారి పరోక్షం
బున గ్రహింపఁ దగదు. ఒండొరుల సాక్ష్యాదిసాధనంబులఁ
గల దోషంబులు విచారణకాలంబున నర్థిప్రత్యర్థులు ప్రక
టింపవలయు. వారికిం దెలియని గూఢంబు లగుదోషంబులు
విచారనియుక్తులయిన సభ్యులు శాస్త్రదర్శన పూర్వకంబుగ
నిరూపింపవలయు. శాస్త్రవిరుద్ధంబు లగు దోషంబులఁ బ్రక
టించినవాఁడు దండ్యుఁడును సాధ్యార్థంబునుండి తొలఁగిన
వాఁడు నగుంగాన రాజు సాధనంబుల మేలఁకువతోఁ బరిశీ
లించునది. మఱియుఁ గూటసాక్ష్యంబు నట్టి లిఖితంబుం దెచ్చి
నవాని నవశ్యము దండించుచు ననృతవాదియైనట్టి సాక్షిని
నిజంబు దెలిసియుం జెప్పని సాక్షినిని ద్విగుణంబుగ దండింప
వలయు. మున్ను బ్రహ్మచే ననుభూత వ్యవహారంబునకు
స్మారకంబుగ లిఖితంబు సృజియింపఁబడె.

### లిఖిత=(దస్తావేజుల) విభాగము.

అట్టి లిఖితంబు రాజకీయంబు, లౌకికంబు నని ద్వి
విధంబు. అదిమరల స్వహస్తలిఖితంబుఁ బరహస్తలిఖితంబునని
రెండు తెఱంగులు. మఱియు నివియెల్లను సాక్షిమంతంబులు
నసాక్షిమంతంబులు నని ద్వివిధంబులు. ఇవి యన్నియు దేశస్థితి
ననుసరించి చెల్లందగినవియు. అందు లౌకికంబయిన (Non-official )లిఖితంబు భాగదానక్రయ ఋణాదులయిన నిమిత్తం
బులచే వివిధంబగు. రాజకీయంబు (Official) శాసనార్థంబు
జ్ఞాపనార్థంబు నిర్ణయార్థంబుసని ముప్విధంబులనుండు. దాయా
దుల కభిమతంబును సాక్షిమంతంబునగు భాగపత్రంబు కార్య

సిద్ధిం గావించుంగాని యట్టిది గానిది జనకుచే వ్రాయింపఁబడి
నను జెల్లదు. దానక్రయ విక్రయ పత్రంబులు సాక్షిమంతం
బులు దాయాదులకు సమ్మతంబులుం గావలయు. మఱియు నవి
స్థావరవిషయంబులైన నందు గ్రామాధికారుల సాక్ష్యంబు బల
వత్తరంబు. రాజహస్తంబునలిఖితంబుముద్రితంబు ప్రకృతులచే
నంకితంబు నగు లేఖ్యంబు రాజకీయంబు. ఆలేఖ్యంబున సంవ
త్సరంబును మాసంబును బక్షంబును దిథియు వారంబును
వేళయుఁ బ్రదేశంబును విషయంబును జాతియు నాకారం
బును బాయంబును బ్రమాణంబులయిన సాక్షిపత్రాదులును
గ్రమసంఖ్యయు నామంబును వారి నివాసంబును దల్లిదం
డ్రుల నామంబులు నభియోగ కారణంబును నివాదగ్రస్తం
బయిన వస్తువు నార్జించినవానిని దాని నిచ్చినవానిని గ్రమం
బుగ లిఖించి రాజు తన పేరును వాసస్థలంబును మఱియుం
గార్యసాధకంబు లగు నితరవిషయంబులను వ్రాసినం బ్రమా
ణంబును వీని వ్రాయకున్న నప్రమాణంబు నగు. మఱియుం
గ్రమభంగంబుగలదియు విపరీతార్థ బోధకంబును బ్రకీర్ణా
ర్థంబు నర్థశూన్యంబు నతీతకాల లిఖితంబును నప్రగల్భుని
చేత నింతిచేతను వ్రాయఁబడినదియు బలాత్కారంబున
వ్రాయించికొన్నదియు నగు లిఖితంబు (దస్తావేజు) ప్రామా
ణ్యంబుం బొందదు. సభ్యులే వాని వ్యవహారంబులయందు
లేఖ్యంబుల సాక్షుల భోగంబుల దివ్యంబుల బరిశీలించి
ప్రామాణ్యంబు నిర్ణయింతు రతఁడీలోకంబునఁ బరలోకంబు
నను సుఖంబు వడయు.

## సాక్షిస్వరూపము

వాది ప్రతివాదులకంటె నన్యుండు వివాదాంశంబు బాగుగ నెఱింగినవాఁడును సాక్షి యనంబడు. అతఁడుచూచినవాఁడును విన్నవాఁడు నని ద్వివిధుండగు. మరల నతఁడు కృతాకృతభేదంబున ద్వివిధుఁడు. వాదిప్రతివాదులయెదుట మున్ను తనచే శ్రవణదర్శనంబుల ననుభూతంబైన యంశంబు తుల్యంబుగ విన్నవించునేని యతఁడు సాక్షియగు. చిర కాలంబుననేని స్మృతియు బుద్ధియుఁ దొలంగని వాఁడును గరణపాటవంబు గలిగినవాఁడు వ్యవహారజ్ఞుఁడును సత్యంబు చెప్పువాఁడును సాక్ష్యంబునకుఁ దగు. ఇద్దఱువాదులకును సమ్మతుండగు ధర్మజ్ఞుఁడైన సాక్షి యొక్కఁడ యభియోగ నిర్ణయంబునకుఁ జాలు. అనుభూత సత్యవచనుండు నొకఁడ చాలు. వాదులకు సజాతీయులు స్వతంత్రులు యువలు విద్వాంసులు గృహస్థులు నప్రవాసులు నెల్ల వివాదంబుల సాక్షులు గావలయును; కాని చౌర్యంబు దండపారుష్య వాక్పారుష్యంబులు నను నపరాధంబులయం దెల్లజాతులవారికి నెల్లవారు సాక్షులు గావచ్చు. ఇంతుల వివాదంబున నింతులుసాక్ష్యంబీ నర్హలు.

## అగ్రాహ్యసాక్షులు

అజ్ఞానంబున బాలుండు నసత్యంబువలన నింతియుఁ బాపపుంగర్జంబుల నలవాటునఁ గపటియు, నెయ్యంబు కలిమిని జుట్టంబు, నభిమానంబున విజాతీయుఁడును, లోభంబున శఠుండును, బగఁదీర్పం గడఁగుట నరియును, జీవన లోపభయంబున సేవకుండును, మఱియు ధనసంబంధంబు

గలవారును దేహసంబంధంబు గలవారును విద్యాసంబంధంబు గలవారును శ్రేణులలో నొక్కనితో వివాదంబు గలప్పు డాశ్రేణివారును దెలిసినదానికి విరుద్ధంబుగఁ బల్కనోపుదురు గాన సాక్ష్యంబునకు నర్హులుగారు.

## సాక్షివిచారము

రాజు సాధ్యార్థంబున సాక్షులవిచారింపఁ గాలహరణంబు సేయక వాది ప్రతివాదులసన్నిధిని విచారింప వలయుంగాని వారిపరోక్షంబున నెన్నఁడు విచారింపఁ దగదు. ప్రత్యక్షమునఁ బ్రవర్తిల్లిన విషయంబున నాదిష్టులయి సాక్ష్యంబంగీకరింపని వారు దండ్యులగుదురు. ఎవఁడు మొదట వాదులచే సాక్షిపదంబున నిర్దేశింపఁబడక యాహ్వానంబునొందక రాజుచే నాదిష్టుండునుం గాక తథ్యంబేని మిథ్యయేని చెప్పు నానరాధముండును రాజునకు దండ్యుఁడగు. సాక్షులవచనంబు ద్వైధంబైనఁ బెక్కండ్రు చెప్పినదానిని బెకండ్రు పెక్కు తెఱంగులఁ జెప్పినయందు గుణవంతుల వచనంబును గుణవంతులు ననేక ప్రకారంబులఁ జెప్పిన గుణవత్తరుల వచనంబును రాజు గ్రహించునది. మొదట నిర్దిష్టుండు గాకున్నను గన్నులతోఁ జూచిన దానిని జెవులతో విన్నదానిని రాజడిగినప్పుడు సాక్షి సత్యంబు తప్పక చెప్పవలయు. వేఱువేఱుకాలంబుల వివాదంబునందలి యొక్కొక్కయంశంబు నెఱింగినవారి నొక్కొక్కనిం బిలిచి రా జాయాయి యంశంబులఁ బరికించునది యని సనాతనంబయిన యాచారంబు గలదు. మఱియు సాక్షులు స్వభావంబునఁ జెప్పినపలుకులు గ్రహింప వలయుం గాని బలం

బున నేమియుఁ జెప్పింపను సాక్ష్యంబు పూర్ణంబయినవెనుక మరల సాక్షి నేమియు నడుగనుం దగదు.

సాక్షి శ్రావణము.

రాజు విచారణ కాలంబున సాక్షిం బిలిచి ప్రమాణంబు సేయించి పురాణంబులయందలి సత్యవచనంబుల మహిమంబు నన్నృతంబువలని దోషంబును గీర్తించి మెల్ల మెల్లఁగ ననత్యంబు వలుక వెఱపు పుట్టించి యేదేశంబున నెక్కాలంబున నేకారణంబున నెట్టివివాదాంశంబు నెఱింగితి వని యడిగి లిఖితంబు వ్రాసిన సాక్షివైన నీవేమి లిఖించితివి సత్యంబు చెప్పు మని నియమించి సత్యంబు చెప్పినసాక్షి కీర్తియు నుత్తమలోకంబుం బడయు ననియు సత్యవచనంబున సాక్షి పూతుండగుననియు సత్యంబున ధర్మంబు వర్ధిల్లుననియు నీ కారణంబున నెల్ల వివాదంబుల సాక్షులు సత్యవాదులు గావలయుననియు నాత్మ యెల్లవారికి సాక్షియనియు నన్నృతంబు వల్కువాఁ డాత్మ నవమానించు ననియుఁ బాపాత్ముండు తనవృత్తం బెవ్వరు నెఱుంగరని తలఁచుఁగాని దేవతలు నాత్మయుఁ జూచుచుందురనియు నీవనృతంబు వలికి యేవాని కపజయంబు గలిగింతు వాతఁడు పెక్కు జన్మంబులం జేసిన పాపంబు నీకును నీ వనేక జన్మంబులఁ జేసినపుణ్యం బాతనికిని సంక్రమించుననియు వానికి సభయందు వినిపించి మఱి విచారింప వలయు.

సాధనములు (లిఖిత భోగాదులు) వాని బలాబలంబులు

రాజులు వాదికేని ప్రతివాది కేని లిఖితాది సాధనములఁ బ్రదర్శింప దైవికంబు రాజకృతంబు నగు నిమి

త్తంబు పరికించి దేశానుసారంబుగఁ గొంతకాలం బెడమీఁ దగు. లిఖితం బెక్కారణంబున నయిన నశించెనేని సాక్షులచేతను భోగంబులచేతను సాక్షులును లిఖితంబును లేకున్నను జిరకాల భోగంబు (Enjoyment or possession) చేతను భోగంబు లేకున్న సాక్షి లిఖితంబులచేతను రాజు వివాదంబుల నిర్ణయంబు సేయందగును; కాని కేవలసాక్షులచేతను భోగంబులచేతను లేఖనంబుచేతను నిర్ణయంబు సేయందగదు. కుటిలులు (Hypocrites) నిపుణులు నగువారు లేఖ్యబింబంబుల వ్రాయ సమర్థులు గానఁ గేవల లేఖ్యంబు సామర్థ్యంబునను స్నేహలోభభయంబుల సాక్షులు కూటంబు పల్కుదురనుశంకచేఁ గేవలసాక్షిబలంబునను బలవంతులు సస్వామికంబేని యస్వామికంబేని ద్రవ్యంబు బలదర్పంబున ననుభవింతురు గానఁ గేవల శంకిత భోగంబులచేతను విచారపతి వివాదనిర్ణయంబు సేయందగదు. సభ్యులు సందిగ్ధంబులయిన వ్యవహారంబులన సందేహింపవలయుం గాని యెల్ల వ్యవహారంబుల సంశయింప వలదు. అట్లు శంకించిన సభ్యుల రాజు శాసింపకున్న ననవస్థయగు. మఱియు లోకంబు భేదిల్లు; వ్యవహారంబును ధర్మంబును గ్రమంబుగ నశియించు. దానాదిలిఖితంబు గలదియు నిరాక్రోశంబు క్రమాగతంబు ప్రతివాది సన్నిధానంబున భుక్తంబు నగు చిరకాల భోగంబు ప్రమాణవంతంబు. ఎవఁ డెప్పుడును లిఖితంబు లేదనియు భోగవ్యాజంబునన తనకు వివాదవిషయంబైన పదార్థంబు రావలెననియు వాదించు నాతఁడు తస్కరుండగు. మఱియు నేకొలఁదియు భోగంబు లేని లిఖితంబును బలవంతంబు గాదు

గాని యేధని తనయెదుటఁ దనపదార్థంబు పరు లనుభవించు చుండ నెటేఁగియుఁ బదియేం డ్లుపేక్షించు నాతఁ డావస్తువు మరలఁ దనకు రావలయు నని వ్యవహారపదంబు సేయం దగఁడు. ఎవఁడు సమర్థుండయ్యుఁ దనభూమి నితరు లనుభవిం చుచుండ రాజునకు విన్నవింపక యిరువదేం డ్లుపేక్షించు నాతం డాభూమిని మరలఁ బొందఁ దగఁడు. కాని యెవఁడేని యనాగమంబుగఁ బరద్రవ్యంబు చిరకాలం బనుభవించినను రాజు వానిం జోరదండంబున దండించి ద్రవ్యంబు స్వత్వవం తున కిప్పించునది. ఎవఁడు లిఖితంబు నొందకున్నను నలువదేం డ్లెడతెగకుండ నేభూమి ననుభవించు రా జాతనినుండి యా భూమి దొలఁగింపఁ దగదు. ఆధియు (తాకట్టువస్తువు-తనఖా భూమి) సీమయుఁ బరులయింట దాఁచిన ధనాది జంగమ పదార్థంబును బరుల కొప్పగించిన గృహాది స్థిరపదార్థంబును బాలుని (Minor) ద్రవ్యంబును రాజద్రవ్యంబును శ్రోత్రియ ద్రవ్యంబును జిరకాలంబు పరానుభూతంబు లయ్యును స్వత్వం బునకు హాని పుట్టింప నోపవు. అయినను బూర్వోక్తంబయిన కాలం బతిక్రమించునంతదనుక నుపేక్షించిన యాతఁడా ద్ర వ్యంబుఁ బొంద నర్హుండుగాఁడు. ఇది సంక్షేపంబున సాక్షి భోగలిఖితంబుల స్వరూపంబు.

### అగ్న్యాది పరీక్ష

ఇంకఁ బ్రమాదంబున నీ మూఁడు సాధనంబులు లేని యేధనియగు వాదివాదంబు ప్రతివాది యపహ్నవించు నాతని కార్యంబు సాధింప సమర్థంబు లగు దివ్యోపాయంబులు చెప్పంబడు. యుక్తియుఁ జోదనాప్రతికాలంబును శపథం

బునటఁ గ్రమంబుగఁ గార్య సాధనంబులు. శాస్త్రంబునకు
శిష్టాచారంబునకు విరోధంబు లేకుండఁ దత్త్వనిర్ణయార్థంబు
రాజుచేఁ దర్కింపఁబడినయోజన యుక్తి యనంబడు. దానం
బును బ్రలోభనంబును భేదోపాయంబును దానికి సాధనంబు
లగు. వాది చెప్పినయంశంబు మాటిమాటికి నడిగిన దానిం
బ్రతివాది నిరాకరింపకున్న నది చోదనాప్రతికాలంబగు; వీనిచే
నర్థనిర్ణయంబు సాధ్యంబు గానపుడు దివ్యంబులయిన శపథం
బులచే సత్యంబు రా జెఱింగి ధర్మంబు శాసించునది. మున్ను
మహాత్ములైన దేవతలు దుష్కార్థంబున నీప్రమాణంబు లుప
యోగించిరి గాన వీనికి దివ్యంబులని నామంబు గల్గె. మఱియు
వసిష్ఠాదులయిన సప్తర్షులు భిస్సాహరణకాలమున నాత్మశుద్ధ్య
ర్థం బీప్రమాణంబు నంగీకరించిరి. అట్టి మహాత్ములచే నంగీకృ
తంబయిన యీప్రమాణంబు జ్ఞానదర్పంబున నంగీకరింపని
వాఁడు ధర్మతస్కరుం డగు. ఏబ్రాహ్మణుండు జ్ఞానహీనుం
డయి దివ్యంబు నిరాకరించు నాతని యర్థధర్మంబుల దేవతలు
హింసింతురు. ఎవఁ డాత్మవిశుద్ధ్యర్థంబు దివ్యంబు చేసి శుద్ధుఁ
డగు నతఁడు స్వర్గంబు నుత్తమకీర్తియుం బొందు. అగ్నివిష
జలంబులు, తులయు, ధర్మాధర్మంబులు, తండులంబులు,
శపథంబులును దివ్యనిర్ణయంబున సాధనంబులని మునులచే
నిర్దిష్టంబు లయ్యె. దివ్యంబులన్నియు బలవంతంబులకాని
యిందు లోకవిశ్వాసంబుం బట్టి పూర్వపూర్వంబు బలీయంబు.
తప్తాయోగోలంబు గరంబున ధరియించి యేడడుగులు నడు
చుట యేని కాలినయింగలంబుల నన్నియడుగులు నడుచుట
యేని తప్తతైలంబున నున్న లోహంపుగుళిక చేతఁ దీయుట

యేని సుతప్తంబయిన లోహశలాక నాల్కనుస్పృశించుటయేని యగ్నిపరీక్ష యగు. విషంబు గ్రహించుటఁగాఁడేఁ కృష్ణసర్పంబు హస్తముల నుద్ధరించుటఁగాఁడె విషపరీక్షయు స్వేష్టదేవత కభిషేకించిన జలంబు ద్రావి నియమితకాలమున నీట మునిఁగియుంట జలపరీక్షయునగు. తుల నధిరోహించి మొదటను దరువాతను హీనుఁడు నధికుఁడు నగునో కాఁడో శోధించుట; తులాపరీక్ష. ధర్మాధర్మమూర్తుల నదృష్టంబుగ గ్రహించుట ధర్మాధర్మపరీక్షయుఁ గర్షమాత్రమితంబు లగు తండులంబుల నమలించుట తండులపరీక్షయు నగు. పూజ్యులపాదంబులు స్పృశియించియుఁ బుత్రునిశిరంబు తట్టియు ధనంబు ముట్టియు నేనీపాపంపుఁగార్యంబు చేసితినేని నాసుకృతంబెల్ల నశియించుఁ బాపము వర్ధిల్లునని బాససేయుట శపథంబగు. సహస్రంబపహృతంబయిన నగ్నిపరీక్షయు నందు మూఁడంశము లపహృతంబయిన విషపరీక్షయు నర్థంబపహృతంబయిన జలపరీక్షయు మూఁడవవంతు తక్కువగా నపహృతంబయిన ధటాపరీక్షయుఁ జతుర్థాంశం బపహృతంబయిన ధర్మాధర్మశోధనంబును దదర్థంబయినఁ దండులపరీక్షయుఁ దదర్థం బపహృతంబయిన శపథంబును రాజు చేయించునది. వాదిసన్నిధిన దివ్యశోధనము చేయవలయు. దివ్యనిర్ణయమున శ్రుతినిదర్శనమువలనఁ బ్రతివాదికి దివ్యము నిర్ణయించునది. ఎవఁడును వాది నేనాఁడును దివ్యంబుల నియోగింపఁ జనదు గాని వాది యిచ్చచే దివ్యప్రమాణంబు సేయం జను. వాది ప్రతివాదులలో నొకఁడు దివ్యంబు సేయునపుడు రెండవవాఁడు సమ్ముఖస్థితుండు గావలయు. దస్యులచే నితఁడు తప్పుచేసిన వాఁడని నిర్దే

శింపఁబడినవానికిని రాజుచేశంకితుఁ డగువానికి నాత్మశుద్ధిపరు
లకు దివ్యంబు నిర్ణయింపఁ దగుం గాని యపుడు రెండవవాఁడు
సమ్ముఖమందున్న వాఁడుగానక్కఱ లేదు. పరదారగమనంబున
నగమ్యాగమనమున మహాపాతకమునను దివ్యం బావశ్యకము.
చౌర్యాదికార్యముల శంకితులకు సుతప్తగోళోద్ధరణము విధిం
పవచ్చు. ప్రాణాపాయకరంబయిన వివాదమున సాధనము
లున్నను వాది ప్రమాణము గోరెనేని వానివిచారణం బనా
వశ్యకము. కాని యా సాధనములు కపటపూర్ణంబులయినట్టు
రాజునకు విదితంబయ్యెనేని ధర్మాసనగతుండయి వాని దివ్యా
దుల శోధించునది. నిర్జనారణ్యమునను నిశీథమున నంతర్గృ
హంబునను జరిగిన యపరాధంబులందును స్త్రీలశీలాభియోగం
బునను బ్రతివాది వాదిచెప్పిన సర్వార్థంబు నపహ్నవించిన
పుడు మానుషసాధనంబు లయిన సాక్ష్యాదులు లేని యపుడు
నవిదుష్టంబు లయినపుడును రాజు కార్యంబుల దివ్యసాధనంబు
ల శోధించునది. మఱియు సాక్షు లున్నను మహాపాతకంబుల
యభియోగంబులందును నిక్షేపహారణంబునను దివ్యసాధ
నంబుల విచారించునది. రాజు వేనియుం దుత్తములుం దక్కిన
వారునగు సాక్షులు వేఱువేఱువిధముగా సాక్ష్యంబు సెప్పుదు
రో యావాదంబుల శపథంబులఁ దీర్చునది. స్థావరవిషయంబు
లయిన వివాదంబులందును దానంబుచేసి మరలఁ బుచ్చికొన్న
వానియందును గ్రయముచేసి సొమ్ము పుచ్చికొన నిచ్ఛయింపఁ
డను వాదంబునను పూగశ్రేణిగణంబులయు, స్వామిభృత్యు
లయు వివాదంబులందును సాక్షులను లిఖితంబును భుక్తిని బరి
శీలించి రాజు తీర్పవలయుం గాని దివ్యంబులఁ దీర్పందగదు.

వివాహ విషయంబును, ద్యూతసంబంధంబు, దేవోత్సవాది సంబంధంబు నయిన వివాదంబులయందు సాక్షులన కాని యితరసాధనంబుల విచారింపఁ దగదు. ద్వారమార్గాదులయుఁ బరీవాహాదులయు వివాదంబుల భుక్తియ కాని యితరంబు రాజు పరిశీలింపఁ దగదు. మీఁదటి వివాదంబుల వాదిప్రతివాదుల లో నొకఁడు మానుషసాధనంబులు నొకఁడు దైవసాధనంబులును విచారింపఁ గోరినను రాజు మానుషంబు లయిన సాక్షి భోగాదులు వివాదాంశంబున నేకదేశవ్యాప్తంబులయినను వానిన గ్రహించి విచారింప వలయును గాని దివ్యంబుల విచారింపఁ దగదు.

## తీర్పు

సాక్షి లిఖితాదిసాధనంబులను వాదకారణంబులను వాదుల చరిత్రంబునను శపథంబులను రాజునానను వాది యంగీకారంబునను నిర్ణయం (Decision) బాఱు తెఱంగుల నుండు.

ఏ వివాదంబుల సాక్షి లిఖితాదులును దివ్యావకాశం బును లేకుండు నా వివాదంబుల రాజు తనయిచ్ఛం దీర్పవచ్చు. సందిగ్ధంబులయి నిశ్చయింప నశక్యంబులయిన సీమానిర్ణయా దులను బ్రభువుగాన రాజు ప్రమాణము. రాజు స్వతంత్రుఁ డయి తీర్చెనేని కిల్బిషంబు నొందుం గావున ధర్మశాస్త్రాను సారంబుగ విచారింప వలయు. రాజామాత్యులలోభంబున వ్యవహారంబుల దోషంబు లొదవు; లోకంబు ధర్మచ్యుతి నొంది కూటకార్యంబులఁ బ్రవర్తిల్లు. కామక్రోధాదుల యతి శయంబున వ్యవహారంబు జరిగెనేని వాది ప్రతివాదులను

సాక్షులను సభ్యులను రాజును శాపంబు వొందుఁ గాన జేఁదు లోభాదికారణంబులఁ బోనడచి తగవుల విమర్శింప వలయు. ఏవారు రాజునకు ననర్థంబర్థవంతంబని విపరీతంబుగ నివేదింతురు వారును వారుఁజెప్పినది విచారింపక సత్యంబని తలఁచి యాకార్యంబున నట్లు ప్రవర్తించిన రాజును శాపంబు చేసిన వారికంటె నెనిమిది మడుంగు లెక్కువ పాపం బనుభవింత్రు. రా జధర్మప్రవృత్తుండయిన సభ్యు లుపేక్షింపక ధర్మంబు నివేదించునది. అట్లుచేయక యుపేక్షించినవారును రాజుతోఁ గూడ నధోముఖులయి నరకంబునఁ గూలుదురు. ధిగ్దండంబును వాగ్దండంబును సభ్యులును, ధనదండంబును వధదండంబును రాజును విధింప వలయు.

## వాదముల పునర్విమర్శనము

ఎవఁడు రాజు తీరితమునసుశిష్టము (Judgment and Decree)నధర్మంబని తలంచు వానివలన మునుపటి దండధనంబుకంటె ద్విగుణధనంబు పూఁటవెట్టించి (డిపాజెట్చేయించి) వివాదమును మరల విమర్శించునది. తీర్పయిన పిదపను సాక్షులచేతనేని సభ్యులచేతనేని యవసన్నుని (బాధింపఁబడినవాని) చేతనే నమాత్యులచేతనేఁ బత్రంబున దూషణంబు ప్రకటింపఁబడెనేని రాజు తాను విచారించిన తగవులయందును బునర్విమర్శముచేయ విధిగలదు. అమాత్యుఁడేని ప్రాడ్వివాకుఁడేని సభ్యులేని యధర్మంబుగ న్యాయస్థానంబునఁ దగవులఁదీర్చిన రాజు వాని మరలఁ బూర్ణంబుగ విచారించి తీర్పరుల సహస్ర ధనదండంబున దండించునది. క్రమంబుగ దండింపకున్న నే

వాఁడును సన్మార్గంబునఁ బ్రవర్తిల్లఁడు; కాన సభ్యదోషంబు ప్రకటింపఁబడెనేని రా. జా వాదమును మరల విమర్శించునది. వాది వాదము యుక్తిచే స్థిరపఱిచి కొనుటవలనను న్యాయాధిపతి యంగీకరించుటవలనను జయపత్రమును గొనుటవలనను జయి యగు. వాది వాదంబు ప్రాడ్వివాకాదులు శోధించి సత్యంబని యంగీకరించినను బ్రతివాది యొప్పికొన్నను రాజు జయించినవానికి జయపత్రంబీవలయుఁగాని వాదివాదం బసత్యంబని ప్రతివాది చెప్పినపుడు సభ్యులును విచారించి యట్లు నిర్ణయించిరేని వాదిని మిథ్యాభియోగమునకుఁ దగునట్లు బహువత్సరంబులు నిరోధించి (ఖైదుచేసి) ప్రతివాదిని గౌరవింపవలయు. కామక్రోధంబులు విసర్జించి ధర్మశాస్త్రానుసారంబుగ వివాదంబులఁ దీర్చుచేని నదులు సముద్రంబుంబోలె నెల్ల ప్రజలు ననువర్తింతురు.

### పదార్థ స్వామ్యము - వాని విభాగమును

తల్లిదండ్రులు జీవించినంతకాలంబును బుత్త్రుఁడు వృద్ధుఁడయినను జరస్థిర పదార్థంబులయందు స్వతంత్త్రుండు గాఁడు. ఆయిద్దఱియందును దల్లికంటెఁ దండ్రి బీజప్రాధాన్యమువలన స్వాతంత్ర్యంబున నధికుఁడు. తండ్రి లేనియపుడు తల్లి స్వాతంత్త్రురాలయ్యెడు. వారియభావమున జ్యేష్ఠుఁడు స్వతంత్త్రుఁడగు. జ్యేష్ఠత్వంబు వయోగుణంబుల లభియించు. తండ్రికిం బెక్కండ్రు భార్యలున్న వారియందుఁ బుత్త్రుండు తల్లియందుంబోలె భక్తింజూపుచుఁ దనభాగంబునకు సమంబయిన యొక భాగంబున వారినెల్లఁ బోషింప వలయు. కార్యంబులయం దెల్లఁ

విద్వాంసులు నిర్ణయించిరి. రాజు ననుజ్ఞ నొంది శత్రురాష్ట్రంబు నుండి ధనంబాహరించినచోరు లందాఅవపాలు రాజునకు నివేదించి తక్కినదాని నందఱు సమంబుగఁ బంచికొనునది. కాని యందెవ్వరైనం బలరులచేఁ జట్టువడిన నతని విడిపింప నయ్యెడు వ్యయం బెల్లవారు సమంబుగ వహింపవలయు.

హేమరస ధాన్యాదిపదార్థంబులు పెక్కం డ్రేకీభవించి సమాదిభేదంబున భాగంబు లేర్పఱిచికొని వాణిజ్యంబు సేసిన నందలి లాభంబు మొదల వారేర్పఱిచికొన్న భాగంబుల క్రమంబునఁ బంచికొనవలయు. సమంబుగను న్యూనంబుగను నధికంబుగను బాళ్లేర్పఱిచికొన్న వారు భాగానుసారంబుగ ముందు ధనంబు వెచ్చించి చేయవలసిన కార్యంబులు చేసి పిదప లాభంబు గ్రహింపవలయు. కర్షకులుం బెక్కండ్రు కృషిచేసిన నిట్లె పంచికొనందగు. సామాన్యధనంబును యాచితంబును న్యాసంబును దాసుఁడు తద్ధనంబు నాధియు నిక్షేపంబును వంశమున్నపుడు సర్వస్వము నన్వాహితముననువాని దన కెంతయాపదయైన బండితుఁడు విక్రయింపను దానంబు సేయను దగఁడు. ఈయఁగూడని వస్తు విచ్చినవానిని బుచ్చికొనం దగనిదానిఁ బుచ్చికొన్నవానిని రాజు చోరదండంబున దండించి ద్విగుణధనంబు స్వత్వవంతున కిప్పింపవలయు. తస్కరులవలనను గృహస్వామికంటె నితరులవలనను రహస్యంబున వస్తువులం గొనుచు నట్లు విక్రయించుచున్న వాఁడు చోరుఁడునుం బోలె రాజున కవశ్యము దండ్యుఁడగు. సజ్జనుండగు యజమానునిం బరిత్యజించిన పురోహితుని నట్టి పురోహితునిం బరిత్యజించిన యజమానుని రాజు దండింపవలయు. రాజు

వణిజులమ్ము పదార్థములకు వ్యయంబును దేశకాలములను నను సరించి ద్వాత్రింశాంశమేని షోడశాంశంబేని లాభంబు నిర్ణ యింప వలయు. మఱియు నేవాఁడైనలాభంబు నర్ధంబు గ్రహించుచు వ్యవహరింప వడ్డీ లేకుండనప్పీయవచ్చు. అధమర్ణు నివలన నుత్తమర్ణునకు మూలధనంబునకు ద్విగుణంబుగ వృద్ధి ధనంబు వచ్చినతరువాత వడ్డిపుచ్చుకొనం గూడదని బేహా రులకాజ్ఞ యీవలయు. ధనికులు చక్రవృద్ధిమిషంబునఁ బ్రజా ధనంబు హరింపఁ జూతురుగాన వారివలన జనులను రాజు సుయత్నంబున రక్షించునది. సమర్థుఁడయ్యు నెవ్వఁడు ధన వంతులయొద్ద నప్పుపుచ్చికొని హరియింపఁ జూచు నతనిచే సామాద్యుపాయంబులఁ బ్రభువు వారిసొమ్మిప్పింపవలయు. మఱియు నెవఁడేని వ్రాయించుకొన్న లిఖితంబు ప్రమాదం బున నష్టంబయినట్లు విన్నవించుకొన్న సాక్షులచే బాగుగం బరిశీలించి మరల మునుపటియట్లు వ్రాయించి యిప్పింప వలయు.

### దండింపఁ దగినవారు

ఇతరుల పదార్థంబుల నీయకుండఁ బుచ్చికొన్న వానిఁ గూటపణ్యంబు (సంకరపుసరకు) లమ్ము వానిని, మున్నిచ్చిన వాని మరలఁ గోరువానిని, ధర్మజ్ఞుఁడయిన రాజు తప్పక శా సించునది.

### గనులనుండి తీయువస్తువుల కర నిర్ణయము

శిల్పులకు వారుచేయు వస్తువులను వారిగుణంబులను బరికించి నృపుఁడు దినవేతనంబు నిర్ణయింపవలయు. ప్రతిదిన

ము గనులనుండితీసి రజతము నమ్మువానికిఁ దన్మూల్యంబున నైదవపాలేని నాల్గవభాగమేని మూఁడవయంశంబేని యర్థంబేని పన్ను నిర్ణయింపం దగుం గాని యంతకంటె నధికంబు నిర్ణయింపం దగదు.

### చేసిన వస్తువులస్వరూపము

చేసినవస్తువులం గరఁగినపుడు నూఱుపలంబులకు మించని శుచిస్వర్ణంబున నేమియుఁ దఱుగఁగూడదు. రజతంబునఁ జతుశ్శతాంశంబును దామ్రంబున నూటికొక్కపాలును వంగజసదసీసంబుల షోడశాంశంబును నాయసంబున నష్టమాంశంబును హీనంబగు; నంతకంటె నెక్కువ హీనంబయిన శిల్పియవశ్యంబు దండ్యుఁడగు.

### స్వర్ణరజతాది వస్తునిర్మాణమునకు భృతి

స్వర్ణంబున నదుకులుగల మెడపులఁ జేసిన ద్వాశతాంశంబును రాజతంబుల నట్టివానిం జేసిన నూటి కొక్కపాలును దఱుఁగును. సుసంయోగంబున(=మంచిటంకము కూర్పున)షోడశాంశంబు వర్ధిల్లు. వాని నిర్మాణవిశేషంబున వృద్ధిహ్రాసంబుల నెఱుంగుచు నెక్కువ తఱిఁగిన స్వర్ణకారు నవశ్యంబు రాజు శిక్షించునది. మఱియు స్వర్ణంబున నుత్తమవస్తువుల రచియించునపుడు తన్మూల్యంబున ముప్పదవయంశంబును మధ్యవస్తువులఁ జేయునపు డఱువదవయంశంబును హీనంబులయిన వానిం జేయునపు డందర్ధంబును హీనతరంబులయిన కటకాదుల నిర్మించునపుడు మీఁదటిదానియందు సగంబును

(240 వ యంశము) ఱేఁడు భృతి నిర్ణయింపవలయు. కేవల విప్రుతికిఁ బైదానియం దర్ధంబ భృతి యగు. మఱియు రజతమున నెక్కుడు జతనంబున రచియింపబడు నుత్తమవస్తువులకుఁ దన్మూల్యంబున నర్ధంబును మధ్యవస్తువులకు నాల్గవపాలును సాధారణంబులకు నెనిమిదవయంశంబును గటకాదులకు షోడశాంశంబును సర్వేశంబు గావచ్చు. తామ్రవంగాదుల కార్యంబులకు వానిమూల్యంబున నాల్గవవంతును లోహకార్యంబుల కర్ధంబేని సమంబేని ద్విగుణంబేని యష్టగుణంబేనియుఁ గూలి భూపతి నిర్ణయించునది. మఱియు సువర్ణాది ధాతువులయందుఁ గూటంబు సేయువారిని ద్విగుణంబుగ దండింపవలయు. మున్ను మునులచే నిరూపితంబును లోకులచే ననుష్ఠితంబు నగు వ్యవహారంబు పెక్కుతెఱంగులు కలదియయి యుండు. అదియంతయుఁ జెప్ప నశక్యంబు గావున దిఙ్మాత్ర మిం దుదాహృతం బయ్యె. ఇం దనుక్తంబులగు గుణంబులను దోషంబులను లోకంబునను శాస్త్రంబునను ఱేఁడెఱిఁగి వ్యవహరింపవలయు.

ఇది శుక్రనీతిసారంబున నాంధ్రీకృతంబునఁ జతుర్థాధ్యాయంబున

రాజధర్మనిరూపణం బను పంచమప్రకరణము

# చతుర్థాధ్యాయము

## షష్ఠప్రకరణము

---

### దుర్గభేదములు

ఇట్లు రాజధర్మంబు నిరూపించి శుక్రుండు సంగ్రహంబుగ షష్ఠంబయిన దుర్గప్రకరణంబు చెప్పందొడంగె. ఖాతంబునను గంటకపాషాణంబులను దుష్పథంబయినది వైరిణంబయిన దుర్గంబును నలుదిక్కుల మహాఖాతంబు గలది పారిఖంబు నిష్టకోపల మృద్భిత్తికాప్రాకారంబు గలది పారిఘంబును మహాకంటకవృక్షసముదాయ వ్యాప్తంబయినది వనదుర్గంబును నలుఁగడల జలాభావంబు గలది మరుదుర్గంబు నన్నిదెసల మహాజలావృతంబయినది జలదుర్గంబును మీఁద జలంబుగలదై వివిక్తోన్నతస్థలమునందు శిరోగృహాయుతంబుగ నిర్మితంబయినది గిరిదుర్గంబును నభేద్యంబు వ్యూహవిదులగు వీరులచే గుప్తంబు నగునది సైన్యదుర్గంబును శూరులతోడను ననుకూలు రగు బాంధవులతోడనుం గూడినది సహాయదుర్గంబు నగు. పారిఖంబుకంటె నైరిణంబును దానికంటెఁ బారిఘంబు నంతకంటె వనదుర్గంబును దానికంటె ధన్వదుర్గంబు నన్నిటికంటె జలదుర్గంబు నంతకంటెను గిరిదుర్గంబును శ్రేష్ఠంబులని నీతిజ్ఞులు వల్కుదురు. సహాయదుర్గంబును సైన్యదుర్గంబునను నివి యెల్ల దుర్గంబులకలంకా

రంబులు నవి లేని దుర్గంబులు నిష్ఫలంబులు నగు. మఱియు రాజునకు నన్నిదుర్గంబులకంటె సేనాదుర్గంబు శ్రేష్ఠంబని యుఁ దక్కిన దుర్గంబు లెల్లఁ దత్సాధకంబులనియు సేనాదు ర్గంబుగల రాజునకు భూమి వశ్యయగుననియు నది లేనిదుర్గం బులెల్ల బంధనాగారంబులనియు విద్వాంసులు చెప్పుదురు. కాఁబట్టి రాజుదాని నవశ్యము నాశ్రయించి రక్షించునది. దుర్గస్థుఁడయినజోదు శస్త్రధరుండయినఁ బ్రతియోధశతంబునే నోడింపఁజాలును. రాజుల కాపత్కాలంబున దుర్గాశ్రయం బుత్తమంబగు. మఱియు సైన్యదుర్గంబు గల శూరునకు స్థలం బెల్లదుర్గప్రాయంబ యగు. రాజులుదుర్గంబుల నెల్ల ధాన్య పుష్టంబులు వీరాస్త్రసంయుతంబులు యుద్ధసంభారపూర్ణం బులుం గోశసహితంబులు గావించి రక్షింపవలయు. సహాయ యుతంబయిన దుర్గంబునకు విజయంబు నిశ్చితంబు గావున నది యుత్తమంబు. మఱియు సహాయవంతంబెల్ల ఫలవంతంబగుం గావున దుర్గంబుల యానుకూల్యంబున రాజునకుఁ దప్పక విజ యంబుగలుగు.

ఇది శుక్రనీతిసారంబున నాంధ్రీకృతంబునఁ జతుర్థాధ్యాయంబున

దుర్గనిరూపణం బను షష్ఠప్రకరణము

# చతుర్థాధ్యాయము.

## సప్తమప్రకరణము-దాని భేదములును

### సేనాస్వరూపము-దాని భేదములును

ఇట్లు దుర్గప్రకారంబు సంగ్రహంబుగఁ జెప్పి సైన్య నిరూపణం బయిన సప్తమప్రకరణంబు భార్గవుండు చెప్పం దొడంగె. శస్త్రాస్త్రసంయుక్తంబయిన మనుష్యాదిగణంబు సేన నాఁబడు. సైన్యంబు స్వగమంబు నన్యగమంబు నని ద్వివిధంబగు. ఉభయంబును దైవియు నాసురియు మానవి యు నని త్రివిధంబయ్యె. ఈ మూఁటిలోఁ బూర్వపూర్వంబు బలాధికంబు. అందుఁ బరాపేక్ష లేకుండ గమనశీలంబు స్వగ మంబును యానసహాయంబునం బోవునది యన్యగమంబు ననంబడు. పాదాతంబయిన సైన్యంబు స్వగమంబును దక్కినది యన్యగమంబు నగు. అన్యగంబు రథాశ్వగజగభేదం బునం ద్రివిధంబు. సైన్యవంతునకకాని రాజ్యంబును ధనం బును బరాక్రమంబును సిద్ధింపవు. మఱియు బలవంతున కల్ప జనున కేని యెల్లవారు వశులును దుర్బలునకు శత్రులు నగు దురు; రాజునకుం జెప్పనేల. శరీరబలంబును శౌర్యబలంబును సేనాబలంబు నాస్త్రికబలంబును బంచమంబయిన ధీబలం బు నాయుర్బలంబును గలరాజు ప్రత్యక్షవిష్ణు వగు. దేవాసు రాదులును సేనాసహాయంబు నొందక యన్యోపాయంబుల

స్వల్పశత్రునేని జయింప సమర్థులుగారు. మఱియు సేనయే రిపురాజయంబునకుఁ గారణంబగుట రాజవశ్యంబు నభేద్యం బయిన బలంబు సంతరించునది. సేనాబలంబు స్వీయంబు మైత్రంబు నని ద్వివిధంబు. అది మౌలసాద్యస్కభేదంబున నిరుఁదెఱఁగులనుండు. ఇదియెల్లను సారంబు నసారంబు ననియు శిక్షితంబు నశిక్షితంబు ననియు గుల్మీభూతంబు నగుల్మీభూతంబు ననియు దత్తాస్త్రవాహంబు స్వాస్త్రవాహంబుననియు రెండువితంబులనుండు. సౌజన్యంబునఁ గార్యసాధకంబయిన బలంబు మైత్రంబును భృతిపాలితంబు స్వీయంబు నగు. అనేక వత్సరంబులనుండి యనుబంధించినది మౌలంబును నూతనం బుగ సంపాదించినది సాద్యస్కంబు నని తద్విదులు వక్కాణు రు. సుయుద్ధకాముకంబు సారంబును విపరీతం బసారంబును వ్యూహాదికుశలంబు శిక్షితంబును విపరీతం బశిక్షితంబును సాధికారికంబు గుల్మీభూతంబును స్వస్వామికం బగుల్మకం బును రాజశస్త్రాస్త్రంబులు గ్రహించునది దత్తాస్త్రంబును దక్కినది స్వశస్త్రాస్త్రంబును దేజస్సున స్వాధీనంబయిన కిరా తాదికం బారణ్యకంబును శత్రులచే నుత్సృష్టంబయి తన భృత్యవర్గంబునఁ జేరినదియు భేదోపాయంబున స్వాధీనంబ యిన సైన్యంబును శత్రుబలంబు నని చెప్పంబడు. ఇందుఁ గడ పటిబలంబులు రెండును దుర్బలంబులును గేవలకార్యసాధకం బులు గానివియు నగు. సములు నియుద్ధకుశలులు నగు సంగ్రా మదక్షులయిన వీరులతో నియుద్ధార్థంబు వ్యాయామంబునను బలపోషకంబులయిన యాహారంబులను శారీరబలంబును వ్యాఘ్రాదిమృగంబులతోడి మృగవ్యంబునను శస్త్రాస్త్రాభ్యా

సపాటవంబునను శూరసంసర్గంబునను శౌర్యబలంబును దగిన భృతిచే సేనాబలంబును దపస్సామర్థ్యంబున నస్త్రబలంబును విద్వత్సంగంబున ధీబలంబును స్వగోత్రంబున రాజ్యంబు చిర స్థాయిగావించు సత్కార్యానుష్ఠానంబున నాయుర్బలంబును రాజు వర్థిల్లఁజేయునది. ఎందనుక గోత్రంబున రాజ్యంబు సుప్రతిష్ఠితం బగు నందనుక మృతుఁడయ్యు బుత్త్రపౌత్త్రపరంపరచే జీవించినవాఁడయగు. ఆశ్వికంబయిన సైన్యంబుకంటెఁ జతుర్గుణంబయిన పాదాతంబును బంచమాంశంబయిన వృషబలంబు నష్టమాంశంబయిన క్రమేలకబలంబును దానం జతుర్థాంశంబు గజబలంబును దానియం దర్ధాంశంబయిన రథికబలంబును దద్బలంబుకంటె ద్విగుణంబయిన బృహన్నాళీకబలంబును రాజు లెల్లపుడు సంధరింపవలయు. మఱియుఁ బదాతిబహులంబును మధ్యమాశ్వంబు నల్పగజంబును సాధారణోష్ట్ర వృషభంబు నగు సైన్యంబు రాజు సంగ్రహింప వలయుంగాని గజాధికం బగుదాని సంగ్రహింపఁ జనదు.

ఆయమునుబట్టి గ్రహింపవలయు సేనయు - సంవత్సర వ్యయమును

ఏఁటేఁట లక్షకర్షమితం బయిన యాయంబు గల రాజు వయస్సార సంపన్నంబయి శస్త్రాస్త్రకుశలంబయిన పదాతి శతంబును లఘునాలిక యంత్రకుశలం బయిన పదాతి శత త్రయంబును నశీత్యశ్వంబుల నొక్క రథికుని బృహన్నాల ధారుల నిద్దఱను బదియుష్ట్రంబులను రెం డిభంబులను రెండుశకటంబులను బదియునాఱు వృషభంబులను నాఱుగురు లేఖకులను మంత్రిత్రితయంబు నవశ్యంబురక్షించుచుఁ బ్రతిమాసంబు దానభోగార్థంబు సార్ధసహస్రం

బును లేఖక జీవితార్థంబు శతంబును మంత్రిరక్షణార్థంబు త్రిశతంబును దారపుత్త్రాది పోషణార్థంబు శతత్రయంబును విద్వదర్థంబు శతద్వయంబును సాద్యశ్వాది జీవనార్థంబు చతుస్సహస్రంబును గజోష్ట్రవృషాది పోషణార్థంబు చతుశ్శతంబును వెచ్చించుచు మిగిలినదానిఁ గోశాగారంబునఁ జేర్చుచుండవలయు. మఱియు సైనికులవలనఁ బ్రతివర్షంబు వేషార్థంబు రాజు కొంతసొమ్ము పుచ్చుకొను చుండవలయు.

రాజులు సంపాదింపవలయు రథ గజాదులు

అయస్సార నిర్మితంబును జక్రసుగమంబును బర్యంకాసనంబును నాందోలంబుంబోలె నారోహణ స్థానంబుగలదియు శస్త్రాస్త్రసంధార్యుదరంబును బ్రియచ్ఛాయంబును మనోరమంబు మధ్యమాసనసారథికంబు సదశ్వకంబు నగు నరదంబు రాజుచే రక్ష్యంబగు. నీలతాలువు నీలజిహ్వాంబు వక్రదంతంబు నదంతంబు దీర్ఘక్రోధంబు క్రూరమదంబుఁ బదింటికంటెనేనెనిమిదింటికంటెనేని దక్కువ నఖంబులు గలదియు మందంబును భూశోధన పుచ్ఛంబు నగుగజం బనిష్టావహంబును విపరీతంబు శుభావహంబునగు.

గజభేదమును - దల్లక్షణంబును

గజంబులు మంద్రభద్ర మృగమిశ్ర భేదంబులఁ జతుర్విధంబులయ్యె. అందు మధునిభదంతంబును సుబలంబును సమాంగంబును వర్తులాకారంబును సుముఖంబును శ్రేష్ఠావయవంబునగు గజంబు భద్రజాతీయంబనియు స్థూలకుక్షియు సింహదృష్టియు బృహత్త్వగ్గల శుండంబును దీర్ఘకాయంబును మంద్రంబనియుఁ దనుకంఠ దంతశుండంబును హ్రస్వా

ధర లింగంబును స్థూలాంశుంబును వామనంబు నగు నది మృగసంజ్ఞంబనియు మిలితంబులయిన మీఁదటి లక్షణంబులు గలది మిశ్రంబనియుఁ దజ్జ్ఞులచే వ్యవహరింపఁబడు. గజంబుల కెల్లఁ బ్రమాణంబు వేఱ్వేఱ గ్రంథకర్తలచేఁ గీర్తితంబయ్యె. గజమానంబున నెన్మిది యవోదరంబు లొక్క యంగులంబు నిరువది నాల్గంగులంబు లొకకరంబు నని విద్వాంసులచేఁ జెప్పంబడియె. భద్రగజంబున కేడుహస్తంబుల యౌన్నత్యంబు నెనిమిదికరంబుల దైర్ఘ్యంబు దశకరమితంబయిన యుదరపరిణాహంబు నుండు. మంద్రమృగంబుల ప్రమాణంబు భద్రప్రమాణంబుకంటె నేకహస్తహీనంబుగాని దైర్ఘ్యంబు భద్రమంద్రంబులకు సదృశంబని మునులు చెప్పిరి. శుభలక్షణ సంయుతంబును విశాల భ్రూగండఫాలంబును శీఘ్రగతియునగు వారణం బెల్లవానియందుఁ బ్రశస్యతమంబగు.

### అశ్వపరిమాణమును-లక్షణములును-వాని భేదములును

పంచయవాత్మకంబయిన యంగులంబునన వాజిమానంబు వేఱుగ స్మృతంబయ్యె. చత్వారింశదంగుల ముఖంబయిన యశ్వం బుత్తమోత్తమంబును షట్త్రింశదంగుల ముఖంబయిన గంధర్వం బుత్తమంబును ద్వాత్రింశదంగులముఖంబయిన వాహంబు మధ్యమంబు నష్టావింశత్యంగుల ముఖంబయిన సైంధవంబు నీచంబునని చెప్పఁబడు. హయంబులకు ముఖమానంబున సర్వావయవమానంబు కల్ప్యంబు. ముఖమానంబుకంటె వాజానేయంబులకు నౌన్నత్యంబు త్రిగుణాధికంబును శిరోమణినుండి పుచ్ఛమూలంబు దనుకఁ దృతీయాంశాధికంబయిన చతుర్గుణ దైర్ఘ్యంబు నుదర

వైశాల్యంబు త్ర్యంగులాధికంబయిన త్రిగుణంబు నుండు. ఇది సాధారణ పరిమాణం బింక నష్టావింశత్యంగులముఖంబయిన యశ్వంబు నవలంబించి విశేషపరిమాణంబు చెప్పంబడు. శఫంబులయౌన్నత్యంబు మూఁడంగులంబులును మణిబంధం బునకు నాలుగంగులంబులును జంగలకు నిరువదంగులంబులును జానువులకు మూఁడంగులంబులును కూర్పరాంతంబయిన యూరువులకుఁ జతుర్దశాంగులంబుల యౌన్నత్యంబునుకూర్ప రంబు సంధినుండి కందంబుదనుక నష్టత్రింశదంగులంబుల నిడి వియును బ్రత్యకూరువులకు ముఖసదృశ పరిమాణంబును జంఘ కందు మూఁడంశంబుల యౌన్నత్యంబు నుండుననియు సుప్రసారిత గ్రీవాదైర్ఘ్యంబు ముఖపరిమాణముకంటె షష్ఠాం శాధికంబయిన ద్విగుణంబును దాని యౌన్నత్యంబు సార్ధ పాదహీనంబును స్కంధంబునుండి ముష్కమూలంబువఱకును గ్రీవాసమదైర్ఘ్యంబును ద్రికదైర్ఘ్యం బష్టాదశాంగులంబును బుచ్ఛదండ దైర్ఘ్యంబు ముఖార్ధంబును దదర్ధంబు లింగ ము ష్కదైర్ఘ్యంబును షడంగులంబేని పంచాంగులంబేని చతురం గులంబేని కర్ణ దైర్ఘ్యంబును శఫపరిణాహంబు పదియునైదం గులంబులును దదర్ధంబు మణిబంధంబునకును జానుజంఘ లకుం బరిధియు నూరుపరిధి యేకాదశాంగులంబును బశ్చి మోరుమూలపరిధి ద్వాదశాంగులమును మణిబంధమణి పరి మాణంబు నవాంగులమును నూరుమధ్యంబునం బక్షమూల చిహ్నమున కంగుష్ఠ పరిమాణంబు నుండునని బుధులు చెప్పు దురు. అశ్వోరసంబులకు గ్రీవోపరిభాగంబున శిరోమణినుండి స్కంధాంతంబుదాఁక సార్ధాంగులంబైన సటాస్థానంబు

ప్రశస్తంబగు. సట హస్తమాత్రాయతంబు నధోగమంబు నగునట్లు చేయింపఁదగు. పుచ్ఛవాలంబుల పరిమాణంబు సార్ధహస్తంబేని ద్విహస్తంబేని యయిన సుశోభనంబగు. కర్ణదైర్ఘ్యంబు సప్తాంగులంబేని యష్టాంగులంబేనియు నవాంగులంబేని దశాంగులంబేనియు వానివైశాల్యంబు చతురంగులంబేని త్ర్యంగులంబేనియు నై యుండు.

తురంగంబుల కంధరంబు స్థూలంబేని చిపిటంబేని కాక మయూరకంఠసన్నిభంబయిన శుభావహంబగు. మఱియు వాని గ్రీవాగ్ర పరిధి పిడికింట నెక్కువయిన ముఖపరిమాణంబు గలదియుఁ దన్మూలపరిధి దశాంగులోనంబయిన ద్విగుణంబును ముఖపరిమాణంబుకంటెఁ గ్రోడంబుకొలఁది తృతీయాంశహీనంబును నేత్రోపరిభాగపరిణాహంబు మొగంబుకొలఁదికంటె నష్టాంగులాధికంబును నాసికకు మీఁదను నేత్రంబులకుఁ గ్రిందనున్న భాగంబు చుట్టుకొలత ముఖపరిమాణంబునఁ దృతీయాంశ హీనంబును నేత్రవైశాల్యంబు ద్వ్యంగులంబును వానిదైర్ఘ్యంబు త్ర్యంగులంబును ముఖతృతీయాంశం బూర్ధ్వాంతరంబునకు నేత్రాగ్రంబుల మధ్యంబునకు ముఖపంచమాంశంబును గర్ణంబులయుఁ గర్ణనేత్రంబులయు మధ్యభాగంబునకు నంతయె పరిమాణంబును భూగతంబులయిన ఖురంబుల యంతరంబునకుఁ గర్ణాంతర సమ్మితంబయిన పరిమాణంబును మణినేత్రాంతరంబునకును భ్రూమధ్యంబునకును నాసానేత్రాంతరంబునకును సక్థి పరిమాణంబున మూఁడవయంశంబును సోష్ఠంబయిన ప్రోథంబునకు ముఖతృతీయాంశంబును నాసారంధ్రాంతరంబునకుఁ దద్దైర్ఘ్య

నవమాంశంబును గాయవిస్తారంబు నరార్ధ పరిమాణంబును, త్రికవిస్తారంబు నరహృదయ ప్రమాణంబును, బాహుమూలంబునకుఁ గ్రింద హృదయవిస్తారంబు నరచతుర్థాంశంబును, నధరోష్ఠంబునకుఁ జిబుకంబునకు నౌన్నత్యంబు సార్ధైకాంగులంబునుండు. ఉన్నత గ్రీవంబును నతపృష్ఠంబు నగు తురంగమంబు శోభిల్లు. దానిరూపంబు పటంబున వ్రాయంగోరు శిల్పివరుండు తదాకారంబు పరిశీలించి మనంబున నిల్పి వ్రాయవలయు. ఇట్లు చత్వారింశదంగులముఖంబు మొదలగు నశ్వంబులకు సర్వావయవమానంబు బుద్ధిమంతు లూహించునది. శ్మశ్రుహీనముఖంబును గాంతోత్తుంగ నాసికంబును దీర్ఘోద్ధత గ్రీవముఖంబును హ్రస్వకుక్షిఖురంబును ఖర్వశ్రవసంబును బ్రచండవేగంబును హంసమేఘనిస్వనంబు నాతిక్రూరంబును నాతిమృదువు నలౌకిక బలసంపన్నంబును సుకాంతి గంధవర్ణంబును సద్గుణావర్తాన్వితంబు నగునశ్వంబు మనోహరంబును సంగ్రాహ్యంబునగు. ఆవర్తంబులు వామదక్షిణ భేదంబున ద్వివిధంబులు. అవి మరలఁ బూర్ణాపూర్ణ భేదంబునను హ్రస్వదీర్ఘ భేదంబునను ద్వివిధంబులగు. వామీదేహంబున వామభ్రమంబులును హయదేహంబున దక్షిణభ్రమంబులును యథోక్తఫలదంబులగు. కాని విపరీతంబు లట్లు శుభాశుభ ఫలంబుల నీఁజాలవు. భ్రమంబులకు నిమ్న భావంబునను దిర్యగ్భావంబున నూర్ధ్వభావంబునను ఫలభేదంబు గలుగుచుండు. శంఖచక్రగదాపద్మ వేదిస్వస్తిక సన్నిభంబులును బ్రాసాదతోరణ సంకాశంబులును ధనుఃకలశ సదృశంబులును స్రజ్మీన ఖడ్గాభంబులునగు భ్రమంబులు శుభంబులగు. నాసికాగ్రం

బునను లలాటంబునను గంఠంబునను మస్తకంబునను శుభా
వర్తంబులుగల హయంబు లుత్తమంబులును హృదయంబు
నను స్కంధంబునను గలంబునను గటియందును నాభిని
గుక్షిని శుభభ్రమంబులుగలవి మధ్యమాశ్వంబులును నగు.
ఎద్దానిలలాటంబున రెండుసుడులు మస్తకంబున నొక్కసుడియు
నుద్భవంబగు నాహయంబు స్వామికిం బూర్ణహర్షదాయ
కంబు గావునం బూర్ణ హర్షంబను నన్వర్థాభిధానంబు గల
దియు నుత్తమంబు నగు. వెన్నెమ్ముననొక్క యావర్తంబు
గల యశ్వంబు సూర్య సంజ్ఞకంబును స్వామికి బహ్వాశ్వసం
పాదకంబునయి యుండు. లలాటంబున నడ్డంబుగ నుత్తరా
వర్తంబు లయినమూఁడు భ్రమంబులు గల యశ్వంబు త్రికూట
నామకంబు నశ్వాభివృద్ధికరంబునగు. మీఁదటి యట్లు సమ
భ్రమత్రయంబు గ్రీవయందున్న నది వాజీశంబయి రాజ
మందిరంబున నుండు. ఎద్దాని కపోలద్వయంబున నావర్త
ద్వయంబు శోభిల్లు నది రాజ్యవృద్ధికరంబు స్వామికి యశ
స్కరంబు నగు. అట్లుగాక యేకకపోలంబున నేకావర్తంబు
గలది సర్వనామకంబు స్వామినాశకంబు నయ్యెడు. గండం
బున దక్షిణాశ్రితంబయిన యావర్తంబు గలది స్వామికి సుఖ
దాయకంబు గావున శివంబునాఁబడు. మఱియు నాభ్రమ
ణంబు వామాశ్రితంబయినఁ బ్రభువునకు ధనక్షయకారియగు.
అవి రెండును రెండు గండంబులనున్న నింద్రాక్షుంబులను పేరు
వొంది స్వామికి రాజ్యాభివృద్ధి దాయకంబులగు. కర్ణమూ
లంబునను స్తనమధ్యంబునను నశ్వంబులకుఁ గల భ్రమద్వ
యంబు విజయనామకంబు గావున రాజునకు సమీకంబున

గీర్తి దాయకంబయ్యెడి. స్కంధపార్శ్వంబున నున్న యావ
ర్తంబు పద్మలక్షణంబు నాఁజాలి స్వామికి మహాధనంబు
సుఖంబు నీఁజాలు. ఏవాహంబు నాసామర్థ్యంబున నేకా
వర్తంబేని యావర్తత్రయంబేని వర్తిల్లు నా యశ్వంబు
భూపాలనామకంబు గంధర్వ చక్రవర్తియు నగు. కంఠంబున
శ్రేష్ఠంబయిన యొక మహావర్తంబుగల హయంబు స్వామికిఁ
జింతితార్థ ప్రదంబగుటఁ జింతామణి యనంబడు. గుల్ఫంబుల
ఫాలకంఠస్థంబులయిన యావర్తంబులు శుల్కనామకంబులు
వృద్ధికీర్తిదంబులునగు. ఏవాజికి నావర్తంబులదోయి వక్త్ర
గతంబేని కుక్షిప్రాంతగతంబేనియగు నావాజి తనకేని స్వామి
కేని నాశంబు గావింప నోపు. జానువుల నున్న యావర్తం
బులు ప్రవాసక్లేశదంబులును లింగంబున నున్నవి విజయ
శ్రీ వినాశమును గావించు. హయత్రికంబున నావర్తంబున్న
స్వామికిఁ ద్రివర్గహానియగు. పుచ్ఛమూలావర్తంబు ధూమ
కేతువగుట ననర్థదంబగు. గుహ్యపుచ్ఛత్రికావర్తంబు
కృతాంతనామకమును భయప్రదంబునగు. పార్శ్వవర్తినియైన
మధ్యదండంబను నశ్వచిహ్నం బుంగుటంబు కోలఁది యయిన
నతిదుష్టంబు. అదియె కచంబున నున్న శతపదియనియు
దీర్ఘంబయినకోలంది దుష్టయనియుఁ జెప్పుదురు. నేత్ర
హనుగండ దృగ్గల ప్రోథంబులందును వస్తిదేశంబునను
గటీకకున్నాభి గుహ్యంబులందును దక్షిణ కుక్షిపాదంబు
లందును ముష్కదేశంబునందును నున్న భ్రమంబులు
నశుభదాయకంబులనియు గలమధ్యంబునను బృష్ఠ మధ్యం
బునను బెదవులను గర్ణనాసాంతరంబునను వామకుక్షి

పార్శ్వంబులను నూరువులను హాయములకుఁ గలయావర్తం
బులు శుభదములు ననియు విద్వాంసులు చెప్పుదురు; మఱియు
ఫాలమున సాంతరములయిన రెండావర్తములున్న శుభఫల
దంబులు నవి రెండు నతిసన్నిహితములయిన మధ్యమఫలదం
బులు నతిలగ్నము లయిన దుష్ఫలములు నగుననియు నందురు.
అశ్వములకు లలాటమున నూర్ధ్వముఖంబయిన యావర్తత్రిత
యము సాంతరంబయియున్న స్వామికి శుభమును నచటనే
మూఁడుకొనలు గలభ్రమత్రయమున్న నశుభము నగు.
హాయములకు గలమధ్యమున నొక్కశుభావర్తమున్న సర్వా
శుభచిహ్నములదోషము వారింపనోపుననియుఁ బాదముల
నధోముఖములు ఫాలమున నూర్ధ్వముఖములు నగు భ్రమ
ములు శుభఫలదము లనియుఁ బ్రత్యఙ్ముఖియగు శతపది
యత్యంతాశుభదాయిని గాదనియుఁ బెద్దలు చెప్పుదురు.
లింగంబువెనుకను స్తనాగ్రంబునను నావర్తంబుగలయశ్వంబు
శుభదాయిగాదు. అశ్వముల కర్ణసమీపమున నున్న యేకా
వర్తము శృంగియనియు నింద్యంబనియుఁ జెప్పుదురు. గ్రీవో
పరిభాగమున నేకపార్శ్వంబున నావర్తంబుగల యశ్వం బేక
రశ్మి. పాదమున నూర్ధ్వముఖావర్తము గలదియుఁ గీలోత్పా
టియునగు నశ్వంబు సంగ్రాహ్యము గాదు. శుభచిహ్నములు
నశుభచిహ్నములు గల యశ్వములు మధ్యమములు. ముఖ
మునం బాదములను సితంబయినది పంచకల్యాణంబనియు
హృదయమునను గందమునను బుచ్ఛమునను నల్లయినది యష్ట
మంగళం బనియు నవిరెండును స్వామికి శుభకరంబు లనియుఁ
జెప్పంబడు. ఏకకర్ణంబున శ్యామంబును దక్షిణసర్వావయవం

బుల నేకవర్ణంబునగు హయంబు శ్యామకర్ణనామధేయంబును మేధ్యంబు ననియు శ్యామైకకర్ణంబును దక్కిన సర్వావయవం బుల ధవళైకవర్ణంబునయినది మేధ్యతరంబుం బూజ్యతరంబు ననియు వ్యవహరింపఁబడు. వైడూర్యసన్నిభంబు లగు నేత్రములు గల యశ్వంబు మిశ్రవర్ణంబయ్యు నేకవర్ణంబయ్యు సుందరంబయ్యెనా జయమంగలనామకంబుం బూజ్యంబునగు. కృష్ణపాదంబులును శ్వేతైకచరణంబులునగు హయంబులును ధూసరవర్ణంబులు రూక్షంబులు గర్దభాభంబులు నగువాహం బులును గృష్ణతాలుజిహ్వోష్ఠంబులగు వాజులును బుచ్ఛంబున వలకుములు దక్కిన యవయవముల నెల్ల గృష్ణవర్ణము గల ఖురువులును నింద్యము లగు. ఉన్నతపాదన్యాసగతియు ద్వీప వ్యాఘ్రగమనమును హంసమయూరపారావతగతియు మృగో ష్ట్రవానరగతియు నగుహయం బుత్తమంబుం బూజ్యము నగు. అతిభోజనంబు నతిపానము గావించిన సాదియు నెట్టిగమనం బునఁ బీడనొందకుండు నట్టిగమనము నట్టిగమనంబు గావించు తురంగమును శ్రేష్ఠములని కోవిదులు వల్కుదురు. సుశ్వేత తిలకమును వర్ణాంతరమునుం గలసప్తి యాశ్వికసేనాభంజ కమగు; మఱియు నశ్వములు స్నిగ్ధవర్ణములు బలాధిక ములు సుగతులు మహాకాయములు నాతిక్రూరములు సర్వాం గసుందరంబులు నయ్యెనేని భ్రమదూషితములు వర్ణదూషిత ములు నయిన బూజ్యంబులగు. అశ్వారోహణం బధికం బయిన మానిసికిఁ గార్శ్యమును వ్యాధియు జనియించు. దాని నేకొలఁదిని నేరకున్న నాలస్యము వొడము; మఱియు నశ్వం బు లపోషితంబులయిన క్షీణంబులు నతిపోషితము లయిన

రుగ్ణంబులు నిత్యశిక్షణమున సుగమనంబులు నశిక్షణమున దుర్గమనములు నగు. సుశిక్షకుం డశ్వము నారోహించి ఋజుకాయుండు స్థిరాసనుండునయి సమముగ ఖలీనము వట్టికొని జాన్వధోభాగముం బాదములు నార్చుచు నతిమృదువు నతిక్రూరముగాని కశాఘాతమునం దగినస్థలమునం గాలానుసారముగం దాడనము సేయుచు నడిపించునది. అశ్వహృదయజ్ఞులు గుల్ఫము సకిలించినం గతిమునను దొట్రువాటొందినం బార్శ్వములను వెఱపుంజెందినం గర్ణాంతరమునను నున్మార్గగామియయిన గ్రీవయందును గోపించిన బాహుమధ్యమునను భ్రాంతచిత్తంబయిన నుదరమునను గశాఘాతము గావింతురు గాని యొకపుడేని యన్యస్థలమున నట్లు చేయరు. మఱియుం గొందఱు హేషగావించుడుం గందమునను స్ఖలితమునొందిన జఘనమధ్యమునను భీతంబయిన వక్షమునను నుద్వృత్తంబయిన వక్త్రమునను రోషితంబయినం బుచ్ఛసంఘాతంబునను భ్రాంతంబయిన జానువులను దరటుచేయవలయు నంద్రు; కాని పలుమాఱు కాలమున నస్థానమునను స్వాశ్వంబు నొప్పింపం దగదు. అట్లు నొంచినం గొన్ని దోషములు పుట్టి యశ్వమున్నంతదనుక విడువకుండు; మఱియు శిక్షకుండు దుష్టాశ్వంబు దండహీనుండయి యారోహింపక దండమున నొంచుచుండవలయు. ఉత్తమాశ్వంబు షోడశమాత్రలకాలంబునం (Sixteen seconds.) జతుశ్శతహస్తంబుల దూరంబు వోనోపు. గతిహీనంబయినకొలందిని నశ్వంబు హీనంబగుచుండు. హయగతిశిక్షయందు సహస్రచాప (4000 గజములు) ప్రమితమండలభ్రమణం బుత్తమంబుం దదర్ధము మధ్యమంబుం దదర్ధము

నీచమును శతధనుఃపరిమితంబల్పంబుం దదర్ధం బత్యల్పంబు నగు. ఎట్లు నేర్పిన నశ్వంబు లేకదినమునన నూఱుయోజనం బులు వోం జాలు నట్లు మండలభ్రమణముల సుశిక్షకుండు శిక్ష వానికలవర్చునది. హేమంతశిశిర వసంతంబులయందు సాయంప్రాతస్సమయంబులును గ్రీష్మర్తువునందు సాయా హ్నంబును శరదృతువున యందుఁ బ్రాతఃకాలము నశ్వా రోహణమునకుఁ దగిన యవి. వర్షర్తువందును విషమభూము లందును నొక్కప్పుడేని యశ్వము నడిపింపఁ దగదు. శోభనం బయిన గమనమున నశ్వములకు జాఠరమును దార్ఢ్యమును శరీరకాఠిన్యము నారోగ్యమును వర్ధిల్లు. భారపరిశ్రాంతము మార్గపరిశ్రాంతంబు నగుహయంబును శిక్షకుఁడు మందమం దంబుగం బలుమాఱు ప్రచరింపఁజేసి పిమ్మట శర్కరా సక్తు మిశ్రంబయిన స్నేహంబును ద్రావించి సుపక్వంబు లయిన చణకంబులేని మాషంబులేని ముద్గంబులేనియుఁ బక్వంబులయిన యార్ద్రశుష్క మాంసంబులను భక్షణార్థం బొసఁగునది. మఱియు మార్గసమాగతం బయిన హయం బునకుఁ బల్యాణంబు వదలింపకయె సలవణంబయిన గుడంబు బలరక్షణార్థం బొసంగి గతస్వేదంబు శాంతంబు నయిన పిదప బృష్ఠబంధంబు వదలించి ఖలీనంబు నవతరించి తద్గా త్రమర్దనంబు సేయించి పాంసుమధ్యమున వివర్తింపించి స్నానాదులఁ జేయించి పోషింప వలయు. అశ్వములకు మద్య రసంబును మాంసరసంబును సర్వవ్యాధి హారణంబగు. మఱియు శక్త్యనుసారముగ ఘృతయుతంబేని క్షీరయుతంబేని వారియుతంబేని సక్తువు వానిచేఁ ద్రావించుచుండవలయు.

హాయంబు లాహారము భుజించిన యనంతరమును జలపానము
సేసినపిమ్మటను విశ్రాంతి వొందకుండ నారోహించిన వానికిఁ
గాసశ్వాసాదిరోగము లుప్పతిల్లు. వాజులకు భోజనార్థము
యవలుం జణకములు శ్రేష్ఠములును మాషములు మకుష్ఠ
ములు మధ్యమములును మసూరములు ముద్గములు నీచములు
నగు.

## అశ్వగతులు

అశ్వగతులు ధారా స్కందిత రేచిత ప్లుత ధారీతక
వల్గిత భేదమున నాఱు తెఱఁగుల నుండు.

అతివేగితంబయిన గమనంబు ధారయనియుఁ బార్ష్ణి
తోదంబుల నోదితంబయి యాకుంచితంబులయిన యగ్రపా
దంబుల నెగురుచు నశ్వంబుపోయిన నాస్కందితంబనియుఁ
గొంచియుం బెగిరి యఖండంబుగం బోయిన రేచితంబనియు
మృగంబుఁ బోలి నాల్గుపాదంబుల నెగురుచుం బోయినఁ
బ్లుతంబనియు నసంవల్గితంబులయిన పాదంబులతో సువ్యక్తం
బుగను ద్రుతంబుగనుం బోయిన ధారీతకంబనియు నిది రథ
వహానంబున వరంబనియుఁ గుంచితంబులయిన పదంబులతో
మయూరంబుపోలె నున్నతగ్రీవంబయి డోలాయితంబయిన
యర్ధశరీరంబుతోఁ గావించిన గమనంబు వల్గితంబనియు నశ్వ
గతిజ్ఞులు వల్కుదురు.

## వృషభోత్పత్తిస్వరూపము

ముఖపరిణాహంబుకంటె నుదరపరిణాహంబు చతుర్గుణం
బును సకమదంబయిన యుదరౌన్నత్యంబు త్రిగుణంబును
సార్థత్రిగుణంబయిన దైర్ఘ్యంబును సప్తతాలౌన్నత్యంబునుం

గలిగి వోఢయు స్వంగసుందరంబు నక్రూరంబు నగువృష భంబు ప్రశస్యంబును సంగ్రాహ్యంబు నగు. ఒక్కనాఁటన ముప్పదియోజనంబులు నడువ సమర్థంబయి నిచ్చలు భారవ హనక్లేశసహంబయి సుదృఢంబయి నవతాలోన్నతంబయిన యుష్ట్రంబు ప్రశస్తంబగు.

### నరాదులవయో నిర్ణయము

నరులకుం గుంజరంబులకు నూఱువత్సరంబులు నశ్వం బులకు ముప్పది నాలుగేండ్లును వృషోష్ట్రంబులకు నిరువది యైదు వర్షంబులును బరమాయువని బుధులు సెప్పుదురు. మఱియు నరులకు నేనుంగులకు నిరువది యబ్దంబులదనుక బాల్యంబును మానసుల కఱువదింటిదాఁకను హస్తులకెనువ దింటివఱకును మధ్యవయసును దర్వాత వార్ధకంబుననియు నశ్వవృషభోష్ట్రంబుల కైదేండ్లదాఁక బాల్యంబును షోడ శాబ్దపర్యంతంబు మధ్యమ వయసును బిమ్మట వార్ధకంబు ననియు విద్వాంసులు చెప్పుదురు. వృషభంబులకు నశ్వంబు లకును దంతోద్గమంబున నాయువు సువిజ్ఞేయంబగు.

### ఎద్దు మొదలగువాని వయసు పరీక్షించు విధము

అశ్వంబులకుఁ బ్రథమాబ్దంబున నాఱుసితంబు లయిన దంతంబులును ద్వితీయవర్షంబునఁ గృష్ణలోహిత వర్ణంబు లయిన యధోగత దంతంబులుం బుట్టు.

తృతీయాబ్దమున మఱి రెండు దంతము లుత్పన్నము లయి యవిషష్ఠాబ్దమున నలుపువొందు. చతుర్థాబ్దమున వాని ప్రక్కదంతములు రెంటును బంచమవర్షమున నంత్యము లయిన రెండు దంతములు నుద్భవిల్లి యవియుఁ గ్రమముగ నాఱవ

యేట నీలములు నవమవత్సరమునఁ బీతములునయి ద్వాద శాబ్దమున మరల సితములుం బంచదశవత్సరమునఁ గాచాభ ములు నష్టాదశమున మధుసంకాశములు నేకవింశాబ్దమున శంఖాభములు నగు. హయముల కిరువదినాలుగేండ్లతిక్రమిం చిన పిదప మూఁడు మూఁడేండ్లకు దంతముల ఛిద్రములు చలనముం బాతముం గలుగుచుండు. అశ్వములకుఁ బ్రోథ మున వలయాకారములయిన మూఁడు రేఖలున్న బూర్ణాయువు నా రేఖలు దక్కువయిన కొలఁది నల్పాయువు నగు. వృషము లకుఁ జతుర్థాబ్దమున నెనిమిదిదంతములు సితములయియుండు. పంచమాబ్దంబున నందుఁ జరమంబులు రెండూడి మరలవచ్చు. ఆఱవయేఁట నుపాంత్యములయిన రెండుదంతములుంబుట్టు. అష్టమమున మధ్యదంతములు పతితోత్పన్నములవశ్యమునగు. ఇవి క్రమముగ రెండేసియేండ్లకుఁ గృష్ణపీతసితరక్త శంఖచ్ఛా యములుగ మాఱుచుండు. పిదప రెండేసియేండ్లకుం జలనపాత ములఁ బొందు. ఉష్ట్రములకు నశ్వములకుఁ జెప్పినరీతిన వయః పరీక్ష చేయునది.

### గజాదుల శిక్షాసాధనములు

ఆకర్షతుల్య ముఖంబయిన యంకుశము గజనిగ్రహ మునకు సాధనము గావున హాస్తిపకుఁడు దానన దాని వినీతము సేయునది. ద్వాదశాంగుల మితములు నూర్ధ్వాగ ములు దృఢములు నగు పార్శ్వరజ్జువలయితము లగు రెండాక ర్షఖండములతోడం గూడిన ఖలీనమున (కళ్ళెమున) రాహుత్తుం డశ్వముల వశపఱిచికొనం దగు. నాసికాకర్ష రజ్జువునన యుష్ట్రములను వృషములను దచ్ఛిక్షకుఁడు వశగత

ములఁ జేయునది. ఈ జంతువులకు మలశోధనార్థము తీక్ష్ణాగ్రమును సప్తఫాలము నగు దండము గావలయు. మనుజులఁ బశువులను సుతాడనమున వినీతులఁ జేయుచుండవలయు. మఱియు సైనికులు ధనదండమున లోఁగరు గాన వారికి విశేషించి తాడనము గావలయు.

వృషభాదుల రాజు విడియించుచోట్లు - దండు విడలు విధము
శత్రుల వశపఱచుకొను విధమును

వృషాశ్వముల ననూపమునను గజోష్ట్రముల జాంగలమునను సాధారణప్రదేశమునఁ బదాతులను విడియింప రక్షణం బగు. రాజు స్వరాష్ట్రమున నెల్లెడల యోజనయోజనమునకు నొక్కొక చోట శతశతసైనికుల నిలుపవలయు. యుద్ధసంభారములు వహింప గజములు నుష్ట్రములు నశ్వములు శ్రేష్ఠములకాని వర్షేతరకాలమున నాకార్యమున కన్నిటికంటె శకటము లుత్తమము లగు. రా జల్పరిపు జయింపనేనియు నల్పసాధనమునఁ జనక బుద్ధిమంతుఁడయి సాద్యస్కంబయిన మహాసైన్యముతోఁ బోవవలయు. మఱియు మహాశత్రుల జయిపం బోవునెడ మూలబలముతోడఁ జనునది. అశిక్షితము నసారము నగు సాద్యస్కబలము తూలముం బోలె నిస్సారము గావున దాని యుద్ధేతరకార్యముల బుద్ధిమంతుఁడు నియోగింపవలయు. ప్రాణాత్యయము ప్రాప్తించుడు నల్పుండును విపరీతకార్యము సేయ యత్నించు నన శూరుండును వికారకరణక్షముండును క్షమియింపఁ డని చెప్పనేల. మహాబలసంపన్నుం డయ్యు నశూరుండు శత్రుముఖమున నిల్వనోపఁ డన నల్పసాధనుం డగునట్టివాఁడు నిల్వఁజాలఁ డని

చెప్పనేల. సుశిక్షితం బయిన బలము నల్పంబయిన సంతరించి
నశూరుండు పగఱ జయింప నోపు నన నట్టి మహాసేనాసంప
న్నుం డరుల జయించు టేమివింత. చిరకాలానుబంధి యైన
సైన్యము ప్రాణావసానమునను స్వామిని విడువనోపదు గావు
నఁ బగఱ జయింపఁ దలంపు గొన్నపుడు శిక్షితము సార
సంపన్నము నగుదానితోడన దాడి వెడలవలయు. పలుకుఁ
బ్రల్లదమునను బరుసంపు దండమునను భృతిహ్రాసమునను
నిత్యప్రవాసాయాసమునను సేనలు భేదిల్లు; అట్లయిన తేనికి
జయలేశంబుం గలుగదు; కావున శత్రురాజునకుఁ దత్సేన
లకు భేదంబు గల్గునట్టి యుపాయంబు ధనదానంబున నేని
కేవల కౌటిల్యముననేని సత్వరంబుగ రాజు చింతించుచుఁ దన
కట్టి యుపద్రవము గలుగకుండం బ్రయత్నించునది. మఱియు
నత్యంతప్రబలుం డగు నరిని సేవను బ్రబలరిపుని దానమాన
ములను హీనబలుని యుద్ధమునను సమబలుని మిత్రభావ
మునను వశంపఱచికొనుచు నెల్లవారల భేదోపాయమున
సాధింప యత్నించుచుండ వలయు. బలభేదనంబుకంటె శత్రు
ల సాధించు నుపాయం బొండు సులభంబు లేదు. బలభేదము
జనించునంతదనుకఁ బరుండు నీతిపరుండును సుపుష్టాగ్నికిఁ
బవనుండుం బోలె మిత్రుండు నగు. శత్రులచేఁ బరిత్యక్తం
బయిన బలమును జనసమూహసమక్షమునఁ బరిగ్రహింపఁ
జనదు. మఱియు దాని ముందుగ నేని వెనుక నేని యుద్ధమునకు
వేఱుగ నియోగింపవలయు. మైత్రంబయిన బలమును సమీప
మునఁ బార్శ్వమున నేని వెనుకటిదెస నేని ప్రాగ్భాగమున
నేని రణకాలమున భూజాని నిలుపవలయు.

## శస్త్రాస్త్రస్వరూపమును - వాని భేదమును

మంత్రమున నేని జంత్రమున నేనగ్నినే నెద్ది క్షిప్తం బగు నది యస్త్రమును దద్భిన్నంబయిన యసికుంతాదికము శస్త్రము ననంబడు. అస్త్రము మాంత్రికము నాళికము నని ద్వివిధము. మంత్రప్రయోజ్యం బయిన యస్త్రము సంభవిల్లనినాఁడు నృపతి శస్త్రములతోఁ గూడ సరిజయార్థంబు నాలికం బయిన యస్త్రము సంపాదించునది. అస్త్రశస్త్రములు లఘుదీర్ఘాకారధారాభేదంబులను బ్రయోగభేదంబులను వ్యవహారార్థము బహుప్రకారము లగునని తద్విదులు వల్కుదురు. నాళికము బృహన్నాలికము క్షుద్ర (లఘు) నాళికము నని ద్వివిధము. తిర్యగూర్ధ్వరంధ్రమూలంబును నలువది యంగుళముల పొడవు నాలంబు గలదియు మూలాంగ్రముల లక్ష్యభేదకములు లయిన చిన్నముండ్లు గలదియు జంత్రము ద్రిప్పిన నగ్న్యుత్పాదకంబును బ్రస్తరచూర్ణముల ధరించు కర్ణమూలమునుం గలిగి బలిష్ఠం బయిన యంగకాష్ఠ బుధ్నమును మధ్యాంగులపరిమితబిలమును నాలాంతిరమున నగ్నిచూర్ణము సంఘటించు శలాకాయుతము దృఢము నగునది లఘునాలికాస్త్రం బగు. (తుపాకి) ఇది పదాతులకును సాదులకును సమీకకాలమున ధార్యం బగు. ఈ యస్త్రము బలంబు కొలఁదిని త్వక్సారంబు బృహద్దీర్ఘగోలము స్థూలబిలాంతరము నయిన కొలఁదిని దూరలక్ష్యభేదకం బగు. మఱియు నిదియె మూలకీలభ్రమణమున లక్ష్యసమసంధానముఁ బొందునదియుఁ గాష్ఠావృతమును శకటాదివాహ్యమునయిన బృహన్నాలికంబని వ్యవహరింపఁబడు. అది సుయుక్తం బయిన విజయప్రదంబు.

## అగ్నిచూర్ణ స్వరూపము

అయిదుపాళ్లు శుద్ధంబయిన సువర్చలవణము నొక భాగము గంధకమును ధూమంబు వోకుండం గాల్పంబడిన యర్కస్నుహ్యాద్యంగారం బొక యంశమును గ్రహించి వేఱ్వేఱం జూర్ణముచేసి యివి యన్నియుం గలిపి యర్కస్నుహ్యారసోనరసములం బాకముచేసి యాతపమున నెండించి చక్కెరంబోలె మరల నూఱిన నగ్నిచూర్ణం బగు. (తుపాకి మందు. టపాకాయమందును.) ఆఱుపాళు లేని నాల్గుభాగము లేని సువర్చలవణమును నొక్కపాలింగలము నొకపాలు గంధకమును గ్రహించి మీఁదటియట్లు చేసినఁ గేవల నాలార్థం బయిన యగ్నిచూర్ణం బగు. లఘునాలికమునకుఁ గేవల లోహమయం బేని సీసగర్భం బేని యన్యలోహగర్భం బేని యగు గోలము గావలయు. నాలికాస్త్రము లోహసారమున నిర్మించిన నితరధాతువుల నిర్మించినను నిత్యసమ్మార్జనమున స్వచ్ఛము సేయించుచుఁ దదస్త్రధారులచే రక్షింపించుచుండవలయు. అంగారగంధకములయు మణిశిలాహరితాలములయు సువర్చలవణ సీసమలములయు హింగులాయోరజములయుఁ గర్పూరజతుచూర్ణములయు నీలీసరలనిర్యాసములయు యథోక్తము లయిన సమన్యూనాధికభాగములం జంద్రికాదికాంతిమంతము లయిన యగ్నిచూర్ణముల నభిజ్ఞులు పెక్కుతెఱంగుల నిర్మించి నాలగము లయిన గోలముల నగ్నిసంయోగమున లక్ష్యములం జిమ్ముదురు. నాలికము ధరించువాఁడు తదస్త్రము ముందు శోధించి దాన నగ్నిచూర్ణము నించి నాలమూలమునకుఁ బోవునట్లు శలాకను ఘట్టించి పిమ్మట

గోలము నందువైచి యనంతరము కర్ణమూలమున నగ్నిచూర్ణం బు ప్రయోగించి యగ్నినిలిపి గోలంబు లక్ష్యమునఁ జొనుపు నది.

### బాణముల విడుచువిధము - నాయుధ పరిమాణమును

ధానుష్కుఁడు నారినుండి విడువంబడిన బాణంబు లక్ష్యభేదియగునట్లు బాగుగ సంధించి మఱి విడుచునది. శిలీము ఖంబు లెల్లను ద్విహస్తపరిమితంబులును గుదియ జోదునకు హృదయపరిమితంబును నెనిమిదియంచులు గలదియు స్థూల మూలంబును బట్టిసంబు ప్రయోక్తృసమంబు నుభయముఖం బును బిడి గలదియు నయి యుండు. ఖడ్గంబు లీషద్వక్రం బులు నేకధారంబులు నాభిసమంబులుఁ జతురంగులవిస్తారం బులు చంద్రకాంతంబులు దృఢముష్టులు నయి యుండు. ప్రా సంబు చతుర్హస్తదండనిర్మితంబు క్షురాననంబును గుంతంబు దశహస్తమితంబు వర్తులశంకునిర్మితంబు ఫలాగ్రంబును గా వలయు. చక్రాయుధంబునకుఁ జుట్టుకొలఁది యాఱుహస్తం బులు క్షురసదృశంబయిన ప్రాంతంబును సునాభియు నుండ వలయు. హస్తత్రయమితంబును ద్రిశిఖంబు నగు లోహరజ్జు విశేషంబు పాశాయుధం బగు. లోహమయంబయిన కవచం బు శిరస్త్రాణంబుతోఁ గూడ గోధూమసమ్మితస్థూలపత్రం బున (గోధుమగింజంత దళసరిగలరేకుతో) దృఢంబుగ రాజు నిర్మింపించునది.

### ఎట్టిరాజు యుద్ధకాముఁడు గావలయు ?

యుద్ధసంభారంబుఁ బూర్ణంబుగ సమకూర్చి కొని శస్త్రసంపన్నుం డయి షాడ్గుణ్యమంత్రవిదుం డయిన రాజు

యుయుత్సుండు గావలయుఁ గాని యితరుఁ డట్టిఁడయిన దుఃఖంబు బొందుటయ కాక స్వరాజ్యభ్రంశంబు నొందు.

### యుద్ధస్వరూపమును దానిభేదములును

శత్రుభావంబు ధరియించిన నిశ్చయాత్ము లగు నిద్దఱు రాజులకు స్వకార్యసిద్ధ్యర్థం బస్త్రాదుల నయినవ్యాపారంబు యుద్ధంబు నాఁబడు. అది మంత్రాస్త్రముల నయిన దైవము నాలాద్యస్త్రముల నైన నాసురమును ఖడ్గాదిశస్త్రములను బాహులను నయిన మానవము ననంబడు. మఱియు యుద్ధము లొకని కనేకులతోడను బెక్కండ్రకుఁ బెక్కండ్రతోడను నొకని కొకనితోడ నిద్దఱతోడను నిర్వుర కిద్దఱతోడను గావచ్చు. దేశకాలములను బగఱబలమును దనబలమును షడ్గుణంబులు నుపాయములును బాగుగం బరికించి రాజు యుద్ధకాముకుండు గావలయు.

### యుద్ధానుకూలకాలము - దేశము

యుద్ధంబునకు శరద్ధేమంతశిశిరంబు లుత్తమంబులు వసంతంబు మధ్యమంబు గ్రీష్మబధమంబు నగు. వర్షాకాలంబున సామోపాయంబునఁ గార్యంబు నిర్వహింప వలయుం గాని యుద్ధంబునం గాదు. మఱియు రా జెపుడు యుద్ధసంభారసంపన్నుఁడు నధికబలుండు నుత్సాహవంతుఁడును శుభశకునుండు నగు నక్కాలంబు సమీకంబున కుత్తమం బగు. ఆవశ్యకంబయిన కార్యంబు ప్రాప్తించుడు నకాలంబు నను మనంబు నీశ్వరునందు నిల్పి ధీరుండు మృధంబు గావింపన తగు. గోవులకు విప్రులకును స్త్రీలకు నాపద వాటిల్లిన భూపాలుం డకాలంబునను జివ్వకుం జొచ్చునది. ఎద్దేశంబున

స్వసైనికులకు వ్యాయామభూములు సులభంబులు శత్రుసైని కులకు గడు దుర్లభంబులు నగు నా దేశంబు జన్యంబున కుత్తమంబు నేవిషయంబునఁ దనకుం బెఱలకుఁ దుల్యంబు లయిన వ్యాయామభూము లుండు నది మధ్యమంబు నేజన పదంబున విరోధివర్గంబునకు సుపర్యాప్తం బయిన వ్యాయామభూములును దనకుం దద్వైపరీత్యంబు నుండు నది యధమంబు నని తచ్ఛాస్త్రజ్ఞులచేఁ జెప్పంబడు.

### అసారాది బలములకు నెపుడు జయముగల్గు?

అరిబలంబు స్వబలంబునఁ దృతీయాంశహీనంబయిన నసారంబు నశిక్షితంబునగు సాధ్యస్క బలం బయినను స్వవిజయప్రదంబగు. మఱియుం బుత్రతుల్యంబుగఁ బాలితంబును దానమానంబుల వర్ధితంబును యుద్ధసంభారపూర్ణంబు నగు సైన్యంబునకు విజయంబు గలుగు.

### సంధివిగ్రహాదుల స్వరూపమును వానివిభాగములు నుపయోగించువిధమును

సంధి విగ్రహ యా నాసన, ద్వైధీభావ సమాశ్రయంబులను నాఱును మంత్రగుణంబులు. బలవంతుఁడయినదాయయు నేక్రియ నైత్రి వహియించు నాక్రియ సంధి యనంబడు. దానికై రాజు సుప్రయత్నంబు సేయవలయు. ఏద్దాన బాధింపఁబడి శత్రువు స్వాధీనుం డగు నాక్రియాకలాపంబు విగ్రహంబు నాఁబడు. అేఁ డాక్రియకై మంత్రులతో మఱిమఱి యాలోచించునది. శత్రునాశార్థంబు స్వాభీష్టసిద్ధ్యర్థంబు నయినదాడి యానంబు నాఁబడు. ఏద్దాన నాత్మరక్షణంబు నృత్రునాశంబు నగు నాయునికి యాసనం

బగు. ఎవ్వరిచే గుప్తుండయి దుర్బలుండును బలవంతుం డగు వారి నాశ్రయించుట యాశ్రయం బగు. స్వసైన్యంబులఁ బ్రతిగుల్మంబు నిల్పుట ద్వైధీభావంబు. బలీయసుం డయిన రిపునిచే నభియుక్తుం డయిననృపుఁ డనన్యప్రతిక్రియుం డయినఁ గాలయాపనంబు సేయుచు సంధి నపేక్షించునది. కేవలహిత కరం బయిన యుపహారంబున నొకటన సంధియగు. మైత్రీ వర్జితంబు లయిన సమ్మేలనప్రకారంబు లన్నియు నుపహార భేదంబున నగు. అభియోక్త బలీయసుఁడు గాన నాత్మహితం బయినయుపద గ్రహింపక నివర్తింపమి నది యిచ్చుటం గాక యన్యప్రకారంబున సంధి పొసఁగదు. అభియుక్తుండు శత్రు బలానుసారంబుగఁ గన్యనేని భూమినేని ధనమునేని తగిన యుపాయనంబు నభియోక్తకు సమర్పించునది. ఆవశ్యకం బయిన సేవయు నంగీకరింపందగు. మఱియు రాజు శత్రుజయా ర్థము తన సామంతులతోడను మైత్రి గావించునది; అనా ర్యులతోడ నయినను మున్మున్న స్నేహంబు గావించి పిదపఁ దదుత్సాదనంబునకు యత్నింపవలయు. నిబిడకంటకవృతం బయిన వేణుకుంజంబుంబోలె సంఘాతవంతుఁడును దురుచ్ఛే దుం డగు. మహాబలు లయిన పగఱయందు సంధియు సమ బలులయందు యుద్ధంబును దుర్బలులయందు యానమును సుహృదులం దాశ్రయంబును దుర్గములందు సైన్యవిభాజనం బును రాజున కవశ్యకర్తవ్యంబులు. శత్రుబాహుల్యంబు గల ప్పుడు బలవద్రిపులతో సంధి కావించికొని యాత్మరక్షణంబు గావించుకొనువాఁడు బుద్ధిమంతుండు. బలవంతునితో యుద్ధం బు సేయవలయు నను నెడ నిదర్శనంబు గానరాదు. గాలికిఁ

బ్రతిముఖంబుగ మేఘంబు వోఁజాలదు గదా. బలవంతునెడ వినమ్రులయి కాలంబునఁ బరాక్రమించువారిసంపదలు నిమ్న గలువ్రాలెఁ బ్రతీపంబు నొందవు. బుద్ధిమంతుఁడయిన ఱేఁడు సంధిచేసికొనియుఁ బరిపంథిని నమ్మంజనదు. మున్ను ద్రోహం బు సేయకుండ సంధిచేసికొన్న యింద్రుఁడు వృత్రాసురు హింసించె.

ఆపన్నుండయ్యు నభ్యుదయంబు గోరువాఁడు శత్రు లచేఁ బీడ్యమానుండయ్యు దేశకాలబలోపేతుండయి విగ్ర హంబు సేయ జతనంబు సేయవలయు. భిన్నమంత్రబలుండు నతివిషయాసక్తుఁడు ప్రజాద్రవ్యాపహారకుండు దుర్గతుఁడు నగు శత్రుని రాజవశ్యము ముట్టడించి పీడించునది; అట్లు చేయుట విగ్రహంబు నితరంబు కలహంబు నని చెప్పంబడు. అల్పబలుండు బలీయసునితో విగ్రహంబుసేసిన సర్వనాశంబు గల్గనోపుం గాన నట్లు సేయం దగదు. ఏకార్థాభినివేశంబు కలహకారణం బగుం గాని యుపాయాంతరంబునం గర్జంబు సిద్ధింపనినాఁడ మన్నీఁడు విగ్రహంబునకుం దొడరునది. విగ్ర హించియు సంధిచేసికొనియు నేకీభవించియు ఛలంబు గావిం చియు నుపేక్షించియుఁ గావించుటం జేసి యానం బయిదువిధం బు లయియుండు. రాజు శత్రులతోడం దన్మిత్రులతోడను విగ్రహించి చేయుయానంబు విగృహ్యయానంబును మఱి యొక్కనితో యుద్ధంబు సేయంజను నెడఁ భార్ష్ణిగ్రాహుం డయినయరితో సంధిచేసికొని కావించునది సంధాయయా నంబు నొకభూమీశుండు శక్తిశౌర్యసంపన్నులు సాంగ్రా మికులు నగు పెక్కండ్రుసామంతులతో నేకీభవించి చేయు

యానంబు సంభూయయానంబు నొక్కచోటికిం బ్రయాణంబు పగటి వేఱొకచోటికిం బ్రయాణంబు సేయుట ఛలయానంబును బలవంతుఁ డభిషేణనంబు గావించి పరాజయంబు నొంది యుపేక్షించి చేసినది యుపేక్షాయానంబు నని విజ్ఞులుం గులీనులు నగు బుద్ధిసచివులు వక్కాణించిరి. (వేఱొక పుస్తకమున ఛలయానమునకు బదులుగాఁ బ్రసంగయాన మనియు నది యొకచోటికిం బోవుచుఁ బ్రసంగమున వేఱొకచోటికిం బోవుట యనియు నున్నది.)

## సేనానాయకుని ముఖ్యకార్యము

దుర్వృత్తుండు నకులీనుండు నయిన నుదారునందు సైన్యంబు రంజిల్లుం గాన దానంబున సేనల రంజించుచుఁ బ్రవీరపురుషావృతుం డయి నాయకుండు ముందు వోవుచు సురక్ష్యంబు సారసంపన్నంబు నగు ధనంబును బ్రభువును బలమధ్యంబున నుంచి సదోద్యుక్తుండయి ధ్వజినీరక్షణంబు గావించు చుండునది. భయస్థానంబు లయిన నద్యద్రివనదుర్గంబులందు వాహినీపతి వ్యూహాకృతంబు లయిన బలంబులతోఁ జనునది.

## సేనాపతి యెపుడెట్టి వ్యూహమును రచింపవలయు

పురోభయంబు ప్రాప్తించునపుడు మకరవ్యూహంబున నుభయపక్షభయంబున శ్యేనవ్యూహంబున నేని ధీరవక్త్రంబయిన సూచీవ్యూహంబున నేనియుఁ బశ్చాద్భయంబున శకటవ్యూహంబునను నలుప్రక్కల వెఱపుప్పతిల్లిన సర్వతోభద్రంబున నేని వ్యాలంబున నేని చక్రవ్యూహంబున నేనియుఁ బడవాలు సేనల నడిపించునది. మఱియు దేశానుసారంబుగఁ

బరబలభేదకం బయిన వేఱొకయొడ్డనం బేనియుఁ బన్నుందగు. వాయిదంబులనేని బాసనేని సమీరితంబు లయిన వ్యూహ రచనాదిసంకేతంబులు స్వసైనికులకుందక్క నితరునకొకనికేనియుం దెలియకుండ నేర్పఱిచి గజంబులకు నశ్వంబులకుఁ బదాతులకు వేఱ్వేఱు తెఱంగుల యొడ్డనంబుల నియోగించుచుఁ దత్సంకేతంబుల రాజు సేనామధ్యంబుననేని వామదక్షిణపార్శ్వంబుల నేని యగ్రభాగంబుననేని నిల్చి సైనికులకు వినిపించుచు ననుశాసనంబు వారు మీఱక చేయునట్లనుజ్ఞ యిచ్చుచుండ వలయు.

## సైనికులు పోవువిధము

వ్యూహస్థులెల్లను సంమీలనప్రసారణంబులును బరిభ్రమణాకుంచనంబులును బర్యాయంబున యానసామ్ముఖ్యంబులును గావించుచు నష్టదలంబుంబోలెను గోలంబుంబోలెను సూచీతుల్యంబుగను శకటాకారంబున నర్ధచంద్రసదృశంబుగను నిల్చుచు వేర్వేఱుగ నల్పాల్పంబుగఁ బంక్తిపూర్వకంబుగఁ బ్రవేశించుచు శస్త్రాస్త్రమోక్షణంబును సత్వరంబుగ నస్త్రసంధానంబును లక్ష్యభేదనంబు నాత్మరక్షణంబు సేసికొనుచు, నొకఁడొకఁడుగఁ గాని యిద్దఱు మువ్వురుం గలిసి కాని ప్రవేశించుచు ముందఱకుం బోవుచు వెన్కకు మరలుచు మరల సమీపించుచు విమోక్షణార్థంబు సమీపించుచు విముక్తాస్త్రుండయి యపయానంబు గావించుచు ముందాసీనుండగువానిం జూచి సమీపించి నేర్చినట్లొకటి నేని రెంటి నేని సంఘుంబుకొలఁది నేని యస్త్రంబుల విడుచుచుండ వలయు.

### వ్యూహస్వరూపము-దాని భేదములును

ఆకసంబునఁ గ్రౌంచపుంబక్షులు బారులుగట్టి పోవు నట్లు దేశానుసారంబుగ సేన సంచారంబు గావించినఁ గ్రౌంచ వ్యూహం బగు. సూక్ష్మగ్రీవంబును మధ్యపుచ్ఛంబును స్థూల పక్షంబును విశాలపార్శ్వంబును దనుముఖంబుం గలుగున ట్లొడ్డిన శ్యేనవ్యూహంబు. చతుష్పాదంబు దీర్ఘస్థూలవక్త్రోష్ఠంబు నగు నది మకరంబును సూక్ష్మముఖంబును దీర్ఘంబు సమంబు నగు దండాంతంబున ఛిద్రసంపన్నం బయినది సూచీ వ్యూహంబును నేకమార్గంబు నెన్మిదిప్రకారంబుల వేష్టితంబు నగునది చక్రవ్యూహంబును నలుగడల నష్టపరిధి గలది సర్వతోభద్రంబును సర్వతోముఖంబు నష్టవలయము నమార్గము నగునది గోలకమును ననంబడు. మఱియు శకటాకారం బయి నది శకటమును వ్యాలాకృతి యగునది వ్యాలంబు నందురు. సైన్యంబుకొలఁదియు రణస్థలంబురీతియు మార్గముం బరి కించి సేనాని యేకవ్యూహం బేని బహువ్యూహంబుల నేని కల్పించునది.

### రాజు సేనల నెటనిల్పవలయు? శత్రు నెట్లు వశపఱిచి కొనవలయు?

జంత్రములనేని యస్త్రములనేని యేస్థలంబున నిల్చిన శత్రుసేనాభేదంబు సులభంబగునట్టి చోట్ల మూఁకల నెకిమీఁడు నిల్పునది. అట్లు నిల్చుటయు నాసనంబగు. విజిగీషువు శత్రు బలపోషకము లయిన తృణాన్నజలసంభారంబులను యవ సైంధవంబులను దక్కినవియుఁ జిరకాలంబు నిరోధించి యాస నమున నిరుద్ధవీవధాసారుండు భిన్నప్రకృతికుండు నగుపగతునిఁ గాలానుసారంబుగ వశుం జేయునది. అరివిజిగీషులు యుద్ధంబున

హీయమానులై సంధిచేసికొని సమయంబు నిరీక్షించుచుంట సంధాయాసనంబగు. బలవంతునిచేఁ బరాజితుండయినవాఁడు నిరుపాయప్రతిక్రియుం డయి కులీనుని సత్యవచనుని బలోత్కటుని నాశ్రయించుట యాశ్రయంబు.

ఓడినవాని సొమ్ము గ్రహింపవలయువారు

మఱియు విజిగీషునకు సహాయంబు గావించిన సుహృత్సంబంధిబాంధవులును వేతనంబు గ్రహియించు నితరులును బరాజితునిధనంబు విభజించి గ్రహింపవలయు; అట్లు సహాయంబు సేయువారును దుర్గంబులు నాపత్కాలంబున రాజులకు నాశ్రయంబుల యగు నని బుధులు చెప్పుదురు.

రాజుపాయమును నిశ్చయింపని యపు డెట్లుండవలయు ?

అనిశ్చితోపాయకార్యుం డయి నృపుఁడు కాకాక్షియుం బోలె ననుపలక్షితంబుగ సమయంబు ననుసరించి ద్వైధీభావంబునఁ జరియించువాఁడయినను వేఱుకార్యంబు చూపి యన్యకార్యంబునం బ్రవర్తించువాఁడయినం గావలయు.

కార్య మెట్లు సిద్ధించును ? ఎట్లు సిద్ధింపదు ?

సదుపాయంబులను సన్మంత్రంబునను సదుద్యమంబుల నల్పజనులకేని కార్యసంసిద్ధి యగునన నృపతికిం జెప్ప నేల. మఱియు నుద్యోగంబుననకాని మనోరథమాత్రంబున నేకార్యంబును సిద్ధింపదు. సుప్తమృగేంద్రముఖంబున గజంబులు స్వయంబుగం జొరవుగదా. అభేద్యంబయిన యయస్సారంబు నూపాయంబుల ద్రవీభవించు. వహ్నికి వారి నియామకం బని లోకప్రసిద్ధంబు; మఱియు నుపాయోపగృహీతంబైన యగ్నిచే

నుదకంబు శోషిల్లు; సదుపాయంబున హస్తిశిరంబున మానిసి పదంబు నిలుపు.

రాజే యుపాయము నేగుణమును గ్రహింపవలె?

ఉపాయంబుల భేదంబును షడ్గుణంబుల నాశ్రయంబును బ్రశస్తంబులు గావున విజిగీషు వగు నృపున కవి రెండు నవశ్యంబు గ్రాహ్యంబు లగు. రాజెన్నఁడును వాని విడనాడి యనికి యత్నంబు సేయందగదు; మఱియు శత్రురాజునకు నతని ప్రజలకును స్త్రీలకును సైనికులకుఁ దన్నాయకునకు భేదంబునఁ బరస్పర ప్రాతికూల్యంబు గలుగునట్లు మిగుల జతనంబు సేయవలయు. రాజు తనకును శత్రునకును గల యుపాయంబులను షడ్గుణంబులను బాగుగఁ బరిశీలించి సర్వస్వంబునకుఁ బ్రాణంబులకు నత్యయంబు ప్రాప్తించునెడ యుద్ధంబునకుం దొడరునది.

రాజెపుడు యుద్ధము తప్పక చేయవలయు?

బ్రాహ్మణులకు గోవులకు నింతులకు నాపద సంభవించినపుడు ఱేఁడు యుద్ధపరాఙ్ముఖుఁడు గాఁ జనదు; అట్లయ్యేని దేవతలచే నతఁడు మిగుల హింసింపఁబడు. మఱియు నుత్తములచేతనేని మధ్యములచేతనేని యధములచేతనేని పగఱచే నాహూతుం డయినపుడు ప్రజాపాలకుఁడు క్షత్త్రధర్మంబు స్మరియించి సంగ్రామనివృత్తుండు గాఁ జనదు. సంగ్రామనివృత్తుం డయిన రాజు, నప్రవాసి యగు బ్రాహ్మణుని, భూమి, బిలేశయంబుల సర్పంబుం బోలె, గ్రసియించు.

యుద్ధమును బ్రాహ్మణుఁ డెపుడు చేయవచ్చు?

క్షత్త్రంబు బ్రహ్మోద్భవం బగుట నాపత్కాలం

బున క్షత్త్రధర్మంబునఁ బ్రవర్తనంబు బ్రాహ్మణులకును బ్రశస్తంబ కాని నిందితంబు గాదు.

రాజున కెట్టిమరణము ప్రశస్తము?

అవిక్షతంబయిన దేహంబుతోఁ శ్లేష్మాదులఁ గ్రక్కుచుఁ గృపణంబుగ విలపించుచు సెజ్జ న్మరణించుట క్షత్త్రియున కధర్మం బని యైతిహాసికులు వక్కాణింతురు. క్షత్త్రియుండు స్వగణంబుతోఁ గూడి మార్తునితో యుద్ధంబుసేసి సువిక్షతుండయి వధంబునొంద నర్హుండు గాని తనగీమునఁ గృపణంబుగ మరణంబు నొంద నర్హుండు గాఁడు. ఆహవంబున మహీక్షితులు పరస్పర జిఘాంసువులయి యపరాఙ్ముఖులయి తమ శక్తికొలఁది యుధ్యమానులయి స్వర్గంబు వొందుదురు. మఱియు స్వామికార్యార్థంబు వాహినీముఖంబున ననివర్తితుండయి విక్రమించిన శూరునకు ననంతం బయిన స్వర్గంబు సంభవిల్లు. ఆలంబున వెఱపులేక పరాక్రమించి మృతుం డయిన శూరుండు సర్వ పాపనిర్ముక్తుం డయి యుత్తమలోకంబు నొందుఁ గాన నతనికి జ్ఞాతులు వగవం బనిలేదు. ఆయోధనంబున మృతుండయిన శూరుంజూచి యచ్చరలు వేనవేలు నేన వరియింతు నేన వరియింతు నని త్వరమాణ లయి ప్రధావింత్రు. మునులు చిరకాలంబు దీర్ఘంబయిన తపంబు సేసి పడయు నుత్తమపదంబు యుద్ధాభిముఖ నిహతుం డయిన శూరుండు శీఘ్రంబు వొందు. యుద్ధంబునఁ బలాయనంబు నొందమి సనాతనంబయిన ధర్మంబును బుణ్యంబును సర్వాశ్రమకర్మానుష్ఠానఫలదంబు నగు.

శౌర్యాభివర్ణనము

శౌర్యంబుకంటె నుత్కృష్టం బొండు ముల్లోకంబుల లేదు. శూరుండు సర్వలోకంబుం బాలింపనోపు. మఱియు నతనియందు సర్వధర్మంబులు సుప్రతిష్ఠితంబు లయియుండు. చరంబుల కచరంబులును దంష్ట్రుల కదంష్ట్రంబులును బాణి మంతంబుల కపాణులును శూరులకుం గాతరులు నన్నం బని బుధులు చెప్పిరి. ఈ లోకంబున యోగయుక్తుం డయిన పరి వ్రాజకుఁడును రణంబున నభిముఖముగ హతుఁడయిన శూరుం డు ననునిద్దఱు సూర్యమండలభేదు లగుదురు. శ్రుతి కలిమిం జేసి యాతతాయు లయిన బ్రాహ్మణులను విద్వాంసులను గురువుల నయిన వధియించి శక్తుఁడు యుద్ధమున నాత్మరక్ష ణము కావించి కొనవలయు.

రాజు విద్వాంసులతో నెపు డాలోచింపవలయు? నెపుడు గూడదు

మహాభయము ప్రాప్తించుడుం గారుణికులు ప్రాజ్ఞులు నపాపదర్శులు నగు నాచార్యులతో నాలోచింపక ప్రతీకార మునకుం గడంగునది. విచిత్రములయిన ప్రాసాదములను బ్రమదావనములను గోష్ఠులను వివిధము లగు కథలఁగావించు నపుడు విద్వాంసులు శోభిల్లుదురు. మఱియుం బరవివరజ్ఞాన మునను దత్త్వనిర్ణయాదు లందును హస్త్యశ్వాది జంతుకార్య కథనము లందును నన్న సంస్కారదోషముల కథనమునను బండితులు శోభిల్లుదురు. కేవల గుణపక్షపాతులయిన విద్వాం సులఁ బురస్కరించుకొనక యరిచిత్తగుణము లెఱిఁగి యె ట్లయిన ఱేఁడు శత్రువధమునకు యత్నించునది.

రాజు బ్రాహ్మణాదుల నెపుడు చంపిన దోషిగాఁడు?

ఆతతాయియయిన బ్రాహ్మణుండును శూద్రసముం డని యెన్నంబడు. ఆతతాయిని వధియించిన వాని కేదోష మును లేదు. శస్త్రము ధరించి చంప నేతెంచిన బాలకు నేని చంపిన దోషిగాఁడు. కాని యట్టివాని నుపేక్షించినఁ జంపిన దోషంబ యగు. ఉద్యతాయుధుండును క్రుద్ధుండును నపలాయితుండును నగు బ్రాహ్మణుని క్షత్రబంధుంబోలె యుద్ధమున హింసించి నను బ్రహ్మహత్యాదోషము లేదని ధర్మశాస్త్రములనిశ్చితం బయ్యె.

రాజు యుద్ధమునఁ బలాయితుఁ డయిన నేమి?

జీవితార్థియై యెవ్వఁడు యుద్ధమునుండి యప సరించు నా నరాధముండు జీవన్మృతుం డయి రాష్ట్రకృతం బయిన యఘం బెల్ల ననుభవించు. ప్రాణభయమున నెవ్వఁ డేని మిత్రుని స్వామిని విడిచి రణమునుండి నిర్గమించు నాతఁ డెల్లరచే నింద్యజీవనుం డయి యంతమున నరకలోకమున నుండు. ఆపద్గతుం డయిన మిత్రున కుపకరింపక - యుపేక్షిం చినవాఁ డీలోకమున నకీర్తినొంది మృతుఁడయి నరకమునం బడు.

రా జెవని విడువరాదు?

విస్రంభమున శరణము నొందినవానిఁ ద్యజియించిన వాఁడు బహుమన్వంతరములు ఘోరనరకమున వసియించు.

బ్రాహ్మణు లెట్టికాలమున యుద్ధముచేసిన దోషులుగారు?

బ్రాహ్మణులు శస్త్రాస్త్రములతో యుద్ధముచేసి సుదు ర్వృత్తుండయిన క్షత్రియుం జంపియుం దోషభాక్కులు గారు.

మఱియుక్షత్రకులము హీనంబయినపుడు శూద్రులు లోకముఁ బీడింప బ్రాహ్మణులు వారి నవశ్యము సరగ నశియింపఁ జేయునది.

యుద్ధ మెద్ది యుత్తమము ? ఎద్ది తదితరము ?

మాంత్రికాస్త్రములతోడి యుద్ధముత్తమమును నాలికాస్త్రములతోడి యనీకము మధ్యమమును శస్త్రములతోడి సమీకంబధమమును నియుద్ధం బంతకంటెను హీనతరంబు నని తద్విదులు వల్కుదురు.

యుద్ధస్వరూపము

మంత్రప్రేరితము లయిన మహాశక్తిబాణాదుల నయిన శత్రుసంహారము మాంత్రికాస్త్రయుద్ధమును సర్వయుద్ధముల నుత్తమము నని చెప్పంబడు. నాలముల నగ్నిచూర్ణము ఘటించి లక్ష్యముల గోలనిపాతనము గావించుచుఁ జేయునది నాలికాస్త్రయుద్ధమును రిపుభయంకరము నగు. నాలాద్యభావమునఁ గుంతాది శస్త్ర సంఘాతమున శత్రునాశనము గావించుట శస్త్రయుద్ధం బయ్యె. కౌశలంబున శత్రుశరీర గ్రంథుల భేదించియు బాహుల బంధించియుఁ జేయుఘాతనంబు బాహుయుద్ధం బగు.

బాహుయుద్ధవిభాగము

వామహస్తమునఁ గంఠోత్పీడనమును, బలాతిశయమున నేలం బొరలించి నిష్పేషణము గావించుటయు, శిరమునఁ బాదప్రహరణమును, జానులతో నుదరపీడనమును, మాలూరాకారం బయిన ముష్టిని గపోలములయందు దృఢతాడన

మును, మాటిమాటికిఁ గపోణిప్రదేశముతోఁ బొడుచుటయు, నెల్లశరీరమునఁ దలముల మర్దించుటయు, ఛలమున గిరగిరం ద్రిప్పుటయు, నని బాహుయుద్ధం బెన్మిది తెఱంగుల నుండును. నియుద్ధకుశలుం డందు నాలుగు తెఱంగుల బాహుయుద్ధముల క్షత్త్రియుని నైదువిధముల క్షత్త్రియాధముని నాలువిధముల వైశ్యుని నేడుప్రకారముల శూద్రుని నెన్మిదిరీతుల యుద్ధములను దదితరునిఁ జంపవలయు. యుద్ధము లెన్నండును శత్త్రుల యం దుపయోగింపవలయుం గాని మిత్త్రులయందుఁ గూడదు.

## యుద్ధమున సేనలనిల్పు విధము

జిగీషువు లఘువులు మహాంతము లగు నాలికాస్త్రముల ముందిడుకొని వానివెనుకం బదాతుల నిల్పి గజాశ్వములఁ బార్శ్వముల నునిచి భిన్నామాత్యబలుం డగు నరితో యుద్ధ మారంభించునది. సంగ్రామమునకుఁ దగినభూమి లభియించుదనుక ముస్ముంద యర్ధసైన్యమున జన్యము సేనానాయకులకుఁ గర్తవ్యం బని సమీరితం బయ్యె. పిమ్మట నమాత్యరక్షిత సైన్యములతో నమాత్యులకును బిదప రాజరక్షిత పృతనలతోఁ బ్రాణాత్యయమున రాజులకును యుద్ధం బవశ్యకర్తవ్యంబు.

## రాజు స్వసేనల నెపుడు రక్షింపవలె?

రాజు దీర్ఘప్రయాణమునం బరిశ్రాంతమును క్షుత్పిపాసాపీడితమును వ్యాధిదుర్భిక్షబాధితమును గరకాక్లాంతమును దస్యువిద్రుతమును బాంసుపంకజాలస్కన్నమును బ్రసుప్తమును బరిశ్రమాతురమును దుర్గతమును నగ్నిభయభ్రాంత

మును వృష్టివాతసమాహతము భోజనవ్యగ్రము నగు స్వసైన్యము జాగరూకుఁడయి రక్షించుచు శత్రుసైన్యంబుల నశియింపఁ జేయుచుండ వలయు.

మనీషులు మీఁదఁ జెప్పిన సేనావ్యసనము లన్నిటి కంటె భేదము పాపిష్ఠము ముఖ్యము నని చెప్పుదురు. భేదోపాయమున శిథిలం బయిన నానాప్రకారాగతనూతనసైన్యమును జేని కతిశ్రమము గావింపనోపునన సకాలం బట్లు చేయు నని చెప్పనేల ?

యుద్ధకాలమున రాజు చేయవలయు నేర్పాట్లు

వీరవ్రతాభిలాషి శత్రువర్గములయు నాత్మబలములయు షడ్గుణములు నుపాయములు మంత్రబలములుం బరికించి ధర్మయుద్ధమున నేని కూటయుద్ధమున నేని రిపులజయించునది. రాజు యుద్ధయాత్రాకాలమున భృత్యులను నాల్గవపాల నధికం బగు వేతనమున రంజించుచుఁ జర్మమునను గవచమునను స్వదేహరక్షణము గావించుకొను చుండవలయు. మఱియు వీర్యవర్ధనము లయిన మదద్రవ్యములు సైనికులచేఁ ద్రావించి వారల నుత్తేజితులను నిస్సందేహులను జేసి యుద్ధమున నియోగించి నాలికాస్త్రములను ఖడ్గాది శస్త్రములను శత్రుపాతనము సేయించునది. సాదులు కుంతములను రథికుఁడు గజస్థుఁడును బాణములను రణము సేయవలయు. మఱియు గజారూఢుఁడు గజారూఢునితోడను దురగారూఢుఁడుతురగారూఢుని తోడను రథికుఁడు రథికునితోడను బదాతి పదాతితోడను యుద్ధము సేయను శస్త్రముల శస్త్రముల చేతనునస్త్రముల నస్త్రముల చేతను నివారింపను రాజాన యీవలయు.

### యుద్ధమున వధానర్హులు

యోధులు సజ్జనులు చెప్పిన యుద్ధధర్మము స్మరియించి డాఁగిన వానిఁ గ్లీబునిఁ గృతాంజలిని ముక్తకేశుని నాసీనుని 'నీయధీనుండ' నని చెప్పినవాని సుప్తుని యుద్ధసన్నాహము సేయనివాని నగ్నుని నిరాయుధుని రణముఁజూడ వచ్చినవాని వేఱొకనితోఁ బోరుసేయువానిఁ బానముసేయువాని బోనము సేయువాని నన్యకార్యవ్యాపృతుని భయభ్రాంతుఁ దొలఁగి చనువాని వధియింపఁ దగదు. మఱియు బాలుని వృద్ధుని స్త్రీలోకమును గేవలనృపుని రణమున హింసింపఁ దగదు గాని వీరభావమునఁ బ్రతిఘటించి హింసించినను ధర్మహాని వాటిల్లదు.

### కూటయుద్ధము

ఈ నియమము లన్నియు ధర్మయుద్ధంబునన కాని కూటయుద్ధంబున లేవు. బలవద్రిపునాశంబునఁ గూటసదృశంబు వేఱొండు లేదు. పూర్వ మింద్రాదులును రామకృష్ణాదులును గూటయుద్ధంబు నాదరించి దాననముచిని వాలిని గాలయవనునిఁ జంపిరి.

### స్వకార్యము సాధించు విధము

ప్రఫుల్ల వదనంబునను గోమలవాక్యంబుల నపరాధాంగీకారంబునను సేవాదానంబులను నతిస్తవంబుల నుపకారంబులను దివ్యంబులను స్వాశయంబులను బరులనమ్మించి క్షురధారాసదృశం బయిన మనంబున వారియంతరం బన్వేషించుచుండవలయు. ప్రాజ్ఞుఁ డవమానము స్వీకరించియు మానంబు విడిచియు స్వార్థంబు సాధించుకొనవలయుం గాని మోఱకుఁ

దనంబున స్వకార్యధ్వంసంబు సేయంజనదు. శతానీకుఁడు
పర్యంకాసనంబున నుండి సేనాకార్యంబు పరిశీలించుచుండ
వలయు. రాజునకు రాష్ట్రంబునకు హితంబు గోరు సైని
కులు మోహారంబు సంకేతంబుల మీఱక చరింపవలయు.
శత్రులచే భేదితం బయిన స్వసైన్యంబుం దెలిసికొని రాజు
వధింపించునది; మఱియు జోదులు నూతనం బయిన కార్యం
బు సేసినపుడు వారికిం దగిన పసదనంబును గ్రమ ప్రాప్తంబు
లయిన మహోద్యోగంబుల నిచ్చుచుఁ దృణాగ్ని జల
సంరోధంబు గావించి శత్రులఁ బీడించి విషమంబున వేగపడి
హింసించుచుఁ గపటంబునను మహాస్వర్ణదానంబునను ద్విష
ద్బలంబు భేదించుచు విస్రంభసంసుప్తంబును బ్రజాగరక్లాంతం
బు నగుదాని మోసంబున జాగరూకుఁడయి నశింపఁజేయు
నది. వ్యసనాసక్తం బయినఁ బగఱకు సహాయంబు సేయ నేతెం
చిన దళంబులకు హానిసేయం దగదు. మఱియు నెట్టి శత్రుచే
నయినను దనకు సమీపతరం బయిన మండలంబు గ్రహింపఁ
జేయక క్షణంబు యుద్ధసన్నద్ధుఁడయి మరల క్షణం బపస
రించుచు రాజప్రమత్తుఁడయి దస్యుండువోలె దూరంబు
నుండి యాకస్మికపాతంబున నెక్కుమ్మడి నన్నిప్రక్కల
శత్రుబలంబు ముట్టడించుచుండవలయు; మఱియు యుద్ధంబుల
యోధులకు సంతసంబు పుట్టించుచు రజతంబును హేమం
బును గుప్యంబు నెవఁడెద్ది జయించు దానిం గార్యానురూపం
బుగ వాని కిచ్చుచు నట్లు పగఱ జయించి విజితునివలనఁ గరం
బేని రాజ్యాంశం బేని సర్వరాజ్యం బేని గ్రహించి తనకు
వశు లయిన యచ్చటిప్రజలఁ బుత్త్రులంబోలె రంజించుచుఁ

దూర్యాది మంగళఘోషంబులతోఁ స్వపురంబుం బ్రవేశించి యేకాలంబున నేదేశంబున నేపాత్రంబున నేయుపాయంబునఁ గార్యంబుల నాదిమధ్యావసానంబుల నెట్టిఫలంబు గల్గు నది యాలోచింప నన్యంబయిన మంత్రిగణంబు నియోగించునది. మంత్ర్యాద్యధికృతులు కార్యంబు నాలోచించి మున్ను యువరాజునకు నివేదింపవలయు. పిమ్మట యువరాజు వారలతోఁ గూడ నది రాజునకు నివేదించునది. మొదట రాజు సదసద్వివేకపూర్వకంబుగా యువరాజునకుఁ గార్యోపదేశంబు సేయను బిమ్మట నతఁడు మంత్రిగణంబున కుపదేశింపనుం దగు. పురోధసుండు రాజునకు నట్లు మున్ముందు కార్యోపదేశంబు సేయందగు. రాజు సైనికులను గ్రామోపకంఠంబున నిల్పుచు గ్రామస్థులకు సైనికులకు నప్పు లిచ్చి పుచ్చుకొను వ్యవహారంబు లేకుండం జేయుచు వారి యుపయోగార్థంబు పణ్యంబుల వేఱుగ నచట నుండ నియమించుచు నొక్కచోఁ సైన్యంబు వత్సరంబు పూర్ణం బగునంతదనుక నుండ నీక పరివర్తించుచుండునది. క్షణంబునన భటసహస్రంబు యుద్ధసన్నద్ధం బగునట్లు నృపుఁ డనుశాసనము సేయుచు నెన్మిదిదినముల కొకమాఱు సైనికుల కుగ్రకోపంబును నాతతాయితనంబును రాచకర్జంబుల విలంబనంబును రాజుననిష్టంబు నుపేక్షించుటయు స్వధర్మపరిత్యాగంబును బెఱలతోడి సంభాషణంబును ఱేని యానతి నొందక గ్రామప్రవేశంబును గావింపఁజన దనియుఁ దమయధికారుల తప్పులయినం బ్రకటింపవలయు ననియు స్వామికార్యంబునం బరస్పరమైత్రి కల్గి వర్తిల్లుఁ డనియు సూజ్జ్వలంబులయిన యస్త్ర

శస్త్రంబుల వసనంబుల నన్నంబును జలంబును బహ్వాన్న సాధకం బయిన పాత్రోత్కరంబును రక్షించుకొనుచుండవలయుననియు శాసనంబు మీఱి చరించువారిని జముని నిశాంతంబున కతిథులఁ జేయుదుననియు శత్రులనుండి ధనంబుగ్రహించి భేదంబు నొందిన సైనికుల నాకుఁ దెల్పుఁడనియు స్వనియమముల విన్పించుచుండ వలయు; మఱియ సైనికులకు నిచ్చలు మొగ్గరంబు లలవర్చుచు నయనంబున కొకసారి యస్త్రపాతంబున లక్ష్యభేదనంబు (గుఱికొట్టుట) గావించుచుఁ బ్రాత స్సాయంసమయంబుల సైనికుల గణియించుచు జాత్యాకృతి వయోగ్రామవాసంబుల లిఖయించుచు భృతిపరిమాణంబునం దిచ్చినదాని నీవలయుదాని నిచ్చిన పారితోషికంబులం బరిశీలించుచు నిచ్చినవానికెల్లఁ బ్రాప్తిపత్త్రంబు (Receipt) గ్రహించుచు వేతనపత్రంబిప్పించుచు శిక్షితులఘున భటులకెల్లఁ బూర్ణవేతనంబును వ్యూహాభ్యాసనియుక్తు లఘునవారికం దర్ధంబు నిచ్చుచు దుష్ప్రభు నాశ్రయించిన సేనల శత్రుభావంబున నశింపఁజేయుచు నృపుని (తన) దుర్గుణంబులకు సంతసించువారిని సద్గుణంబుల ద్వేషించువారిని వానియం దుదాసీనులగు వారిని బరిశీలించుచు దుష్టుల హింసించుచు సద్గుణు లయ్యుఁ గేవలసుఖాసక్తు లయిన భృత్యులఁ ద్యజించుచు నంతఃపురాదులను ధనాదివ్యయంబులను విశ్వస్తులు శుభాంతఃకరణులు నగు సేవకుల నిల్పుచుండవలయు. విస్రబ్ధులు లోకపూజితులు నగువారు రాజకార్యంబుల నియోగింపఁబడకున్నఁ గేవలనింద కల్గు. శత్రురాజసంబంధు లెవ్వ రాతని దుర్గుణంబుల నేవ పుట్టి భిన్నులయి యతనిచే నవ

మానితు లయి తన్ను సేవింత్రు కార్యసాధకు లయిన యట్టి
సేనపులను మంత్రిగణంబు నితరులను రాజు మహాభృతిచేఁ
బోషించుచుఁ గేవల లోభంబున శత్రులనుండి విముఖు
లయిన వారినం దర్థంబునఁ బాలించుచు శత్రులచే విడువంబడిన
సుగుణుల నధికభృతిచే రక్షించుచుండవలయు. మఱియు భేదో
పాయంబునఁ దనకు వశులయిన యెవ్వారి సహాయంబునఁ బర
రాష్ట్రంబు హృతం బగు వారి కది మొదలు వేతనంబు
లిచ్చుచు వారియనంతరము పుత్రు లున్నవారికి నం దర్థం
బును స్త్రీలున్న నందర్థంబును మానక యీవలయు. జయ
శాలి హృతరాజ్యుండయిన శత్రునకు గుణశాలియగు పుత్రుఁ
డున్న నతనిరాజ్యంబునఁ జతుర్థాంశంబును గుణహీనుఁడున్న
ద్వాత్రింశాంశంబు నీవలయు; మఱియు జితునిసంచితకోశంబు
భోగంబున కేని కుసీదంబున కేని హరియింపనగుం గాని కుసీ
దంబున కుపయోగించిన ద్విగుణం బగునంతదనుకన యుప
యోగింపనగదు. జయించినరాజు స్వమాహాత్మ్యంబు ప్రక
టింపఁ బరాజితుల రాజోచితమానంబుల రక్షింపవలయుం
గాని వారు దుర్వృత్తు లయినం బీడించునది. పుడమిఱేఁడు
యామికులం బరికించి వారియుపయోగార్థంబు సేయుంబవలు
నెన్మిదిప్రకారంబులనేని పదిప్రకారంబులనేని ద్వాదశప్రకా
రంబులనేని విభజించి నల్వురకంటె నధికులయిన వారిం దత్కా
ర్యంబున నియోగించి కార్యగౌరవంబు గలప్పుడు పెక్కండ్ర
నియోగించుచు నంతకంటె న్యూనుల నెన్నఁడు నియోగింపక
రక్ష్యంబులయిన వస్తులఁ జూపి వారి సమక్షంబున నొప్పించు
నది. వారు తమ కొప్పగించినద్రవ్యంబుల నప్రమత్తు లయి

రక్షించునది. యామికుఁడు తనకు నియమించిన కాలంబున స్వర్ణాదిపదార్థంబులఁ గీలకోష్ఠంబున (తాళము వైచినగది లో) రక్షించుచు నవసానంబున నన్యయామికునకు రక్ష్యవస్తువుల యాథార్థ్యంబు బోధించుచుండవలయు. ప్రతిక్షణంబును యామికులకుఁ గార్యంబు బోధించుచు మే లయిన నియమంబులఁ బాలించునపుడ నృపుఁ డెల్ల వారికిం బూజ్యుం డగు. ఎవనికిఁ గార్యాభినివేశంబును సత్కార్యంబుల నౌదార్యంబు నసత్కార్యంబుల వైముఖ్యంబును గల్గు నతఁడు రాజ్యంబు చిరకాలం బనుభవించు. ఎవని వచనంబు కార్యంబు సాధుభావంబు నస్థిరంబు లతఁడు శీఘ్రంబ స్నేహంబునుండియు రాజ్యంబునుండియుం దొలఁగు. మృగేంద్రంబు శాసింప వ్యాఘ్రగజాదులు శక్తంబులు గాని యట్లు స్వచ్ఛందగామి యగు రాజు ననుశాసింప మంత్రులు నశక్తులు గారు. తూలభారంబు గజంబుకు బద్ధంబు గావింపలేని యట్లు సారహీనులు రాజు నాఁగఁ జాలరు. పంకమగ్నం బయిన గజంబు నుద్ధరింప గజంబ సమర్థం బగునట్లు నీతిభ్రష్టుండయిన రాజును నయజ్ఞుఁడయిన ఱేఁ డుద్ధరింప శక్తుఁ డగు. బలవంతుఁడయిన నృపునకు భృత్యవర్గం బల్పంబయిన నతనియందు సిరియుం దేజంబు నపారంబయి యుండుం గాని హీననృపునియందు నతని మంత్రిగణంబునందు నట్లు గాదు. రాజునకుఁ బెక్కండ్రతో నైకమత్యంబు బలవత్తరంబు; బహుసూత్రవేష్టితం బయిన రజ్జువు సింహాదుల నాకర్షింపఁ జాలు. హీనరాజ్యుండు రిపుభృత్యుండు నగు రాజు మహాసైన్యంబు ధరియింపక స్వపుత్రాద్యభివృద్ధ్యర్థంబు కోశసంచయంబు గావించునది.

రాజు లెల్లను శయనంబును భోజనంబును నిద్రాక్షుధా కాలంబుల గ్రహింపవలయు; అట్లు కానినాఁడు శీఘ్రంబు నెవ్వ వచ్చు. రాజు లీప్రకారంబున వెచ్చింపవలయుం గాని యన్య ప్రకారంబునఁ గూడదు. ధర్మవిహీనులు నీతివిహీనులు దుర్బ లులు నగు రాజులు ధర్మబలసంపన్ను లయిన నరపతులచే నవశ్యంబు చోరులుం బోలె దండ్యు లగుదురు. నీచనృపుఁ డయ్యు సర్వధర్మావనంబున శ్రైష్ఠ్యంబు నుత్తమనృపుఁ డయ్యు ధర్మనాశనంబున నీచత్వంబునుం బొందు. రాజ్యంబు నొందినవాఁడు లోకంబునం బ్రశస్యుఁడును ధర్మాధర్మప్రవృ త్తికిం గారణంబు నగు. మన్వాదులచే నాదృతంబయిన య ర్థంబు ద్వావింశతిశతశ్లోకంబుల భార్గవునిచే నీతిసారంబున నుక్తంబయ్యె. శుక్రునిచేఁ బ్రోక్తంబయిన యీ నీతిసారంబు ననిశంబుఁ జింతించునేత వ్యవహారధురంబు వహింప సమర్థుఁ డయి యుండు. శుక్రునకుఁ దుల్యుఁడగునీతిమంతుఁడు ముల్లో కంబుల లేఁడు గావునఁ దత్కృతంబయినది సన్నీతియు నన్య కృతంబయినది వ్యవహారులకుఁ గునీతియు నగు. మందభాగ్యు లగు నే నృపు లసామర్థ్యంబున నేని లోభంబున నేని నీతి నాశ్రయింపరు వారు నరకభాజను లగుదురు.

ఇది శుక్రనీతిసారంబున నాంధ్రీకృతంబునఁ జతుర్థాధ్యాయంబున సేనానిరూపణం బను సప్తమప్రకరణము నధ్యాయమును.

సమాప్తము.

శ్రీరస్తు

# శుక్రనీతిసారము

## పంచమాధ్యాయము



### నీతిశేషము

శాస్త్రసమ్మతంబును, సప్తాంగంబులకు రాజ్యంబునకు సర్వజనంబులకును, హితకరంబునయిన నీతిశాస్త్రశేషంబుఁ జెప్పెద నని శుక్రుండు పలాసుల కిట్లనియె. జనుఁడు నూఱేండ్లతిక్రమించిన పిమ్మట నయినను బగఱ వశపఱిచి కొందునని యెడదఁ బరికించి వారలఛిద్రంబు లన్వేషించుచుండవలయు. భూమీశుండు మంత్రబలసంపన్నుండయి యరిహీనమంత్రబలుండయి భృత్యవర్గంబునుండియు రాష్ట్రంబునుండియు ననర్థాగమం బుత్ప్రేక్షించునట్లు చేయుచు నూడిగంబు సేయువ్యాజంబున నేని వాణిజ్యంబు సేయు నెపంబున నేని రిపురాష్ట్రంబుఁ బ్రవేశించి పరిశీలించుచు సావధానుండయి మార్జారంబుంబోలెను లుబ్ధకుండుబలెను బకంబుంబోలెను సమయంబు వేచియుండి నిర్భయుఁడును వ్యసనాసక్తుండు నగు పగతు నున్మూలించునది.

మఱియును యుద్ధకాముకుండు శత్రుజనపదంబునఁ గాఁపురంబున్న దాని నేకాంతంబునఁ దన్ను ద్వేషించుదానిని

విడిచి ప్రత్యనీకవినాశని యగు సేనను యుద్ధంబున నియో
గించుచు సాహసించి స్వసైన్యనాశంబు గావింపక రక్షించు
నది. భృత్యులును దానమానవియుక్తులయ్యు జీవితంబు ధనం
బు నపేక్షించి సమయంబునఁ బెఱలకు వశంవదులు గాకుండు
నది. మేఘోదకంబుల సస్యంబులకుఁ బుష్టిగల్గినట్లు నద్యాది
జలంబులఁ గల్గదు గదా; అట్లె రాజద్రవ్యంబునఁ బ్రజాపుష్టి
గల్గినట్లు ధనికులధనంబునఁ గల్గదు. మహావీర్యబలుం డయ్యు
రాజు మార్దవంబు ప్రకటించుచు ముందు శత్రురాజ్యంబు
ప్రవేశించి యతనికార్యంబు నిర్వహించుచు సంజాతదృఢ
మూలుం డయి యతని రాష్ట్రంబు సర్వంబు హరియించి
మూలంబు నున్మూలింపఁ గోరి తర్వాత నతనిదాయాదులను
సేనానాయకులను దద్రాజ్యాంశదానంబున వశపఱిచికొను
నది. వృక్షంబు సంక్షీణమూలం బయినఁ దచ్ఛాఖలు క్రమ
క్రమంబుగ శుష్కించునట్లు భూపతి నశియించుడుఁ దక్కిన
యతనిసేవకులు క్రమంబుగ నశియింత్రు. రాజ్యవృక్షంబు
నకు మూలంబు నృపతియు స్కంధంబు మంత్రిగణంబును
శాఖాసముదయంబు సేనపులును బల్లవంబులు సేనయుఁ
గుసుమంబులు ప్రజలును ఫలంబులు భూమిభాగంబులును
బీజంబు భూమియు నని చెప్పంబడు. జేంపు విశ్వాసంబుఁ
జెందినవాని నయినను శత్రుభూపాలుని నమ్మి యల్పపరివార
యుతుండయి యేకతంబున నతనిగీముఁ జొరరాదు. మఱియు
రూపంబునను వేషంబునను స్వసదృశులగుజనులఁ బెక్కండ్ర
నికటంబున రక్షించుచు గుప్తవిశిష్టచిహ్నుం డయి సమయం
బున నన్యాదృశుం డగుచు వేశ్యలచేతను నటులచేతను

మద్యంబులచేతను గాయనులచేతను రిపుల మోహింపఁ జేయుచు సువస్త్రాభరణంబులతోడను గుటుంబంబుతోడను విశిష్ట చిహ్నంబుతోడను యుద్ధరంగంబు నొకపుడుం బ్రవేశింపక స్త్రీ పుత్ర భృత్యవర్గంబును శత్రువర్గంబును క్షణంబు నుపేక్షింపక సావధానుండు గావలయు. జీవించియున్నంతవఱకు సద్గుణుం డగు పుత్రునందును రాజు స్వాధికారంబు సర్వంబును సమర్పింపఁదగదు. అట్లు సేయుట మహానర్థంబు మదంబుం గలిగించుం గాన విష్ణ్వాదులును దమ యధికారంబు పుత్రులందు సమర్పింపరైరి. ఆయువు స్వల్పావశిష్టం బగుడు ఱేఁడు స్వామ్యంబు సత్పుత్రునందు నిల్పునది; యువరాజాదులు స్వామ్యలోభచాపలభారంబున క్షణంబునరాజకం బయిన రాష్ట్రంబు ధరియింపఁ జాలరు. రాజపుత్రుఁడు త్తమపదంబు నొంది సునీతిఁ బ్రజలఁ బాలించుచుఁ బూర్వామాత్యులందుఁ దండ్రియందుఁ బోలె గౌరవంబుఁ జూపుచుండునది. పూర్వమంత్రులును నూతనరాజశాసనంబు యుక్తం బేని మునుపటికంటె నధికంబుగ గౌరవించుచు నయుక్తం బేని సమయాంతరంబున నిదికార్యంబని నిషేధింపవలయుం గాని యతనికిఁ దోడ్పడి ధనాశచే దుర్ణయంబునఁ బ్రవర్తింపఁ దగదు; ప్రవర్తించిరేని యాతేనితో వారును బదభ్రష్టులగుదురు. కులభక్తులయినభృత్యుల ద్వేషించుచు నూతనుల భజియించురాజు శత్రువశుండయి ధనప్రాణంబులతో వియోజితుం డగును. నవ్యంబయినజనంబును గుణవంతంబు నీతిమంతంబు నయిన నారిచరితం బిమ్ముగం బరీక్షించి ప్రాచీన సేవకులతోఁ దుల్యంబుగఁ గార్యంబుల నియోగింప నగు.

మాయావులు కార్యంబు గలంతకాలంబును మృదువచనంబులను స్తుతులను నతులను సేవలను దానంబులను జేసి సేవింత్రు; సాధువు లెల్లకాలమును బ్రత్యక్షంబునం బరోక్షంబునను సమంబుగను నిష్కపటంబుగను సేవింత్రు; భూమ్యాకాశంబులకుం బోలె వీరి కింతయంతరంబు గలదు. ధూర్తులుం జోరులు జారులు నని విఖ్యాతులు మాయకు జనకులును బరస్వాహరణంబున నిందితులు నగుదురు గానియందు మొదటివాఁడు ప్రత్యక్షంబునను దక్కినవారు పరోక్షంబునను బరధనంబు హరియింత్రు. ధూర్తులగువా రజ్ఞులకు హితంబహితంబనియు నహితంబు హితంబనియు బోధించి తమ కార్యంబు నెఱవేర్చికొని మిగుల నమ్మించియు ఛద్మంబున హాని చేయుదురు. మానిసి యెవని కప్రియంబు సేయం దలంచు వానికి మున్ముందు ప్రియంబు సేయ వలయు; వ్యాధుండు మృగవధార్థంబు సుస్వరంబుగ గానంబు సేయు. మాయ సేయకుండ జనునకు మహాద్రవ్యంబు శీఘ్రంబుగ సంఘటిల్లదు. పరస్వంబు హరింపకుండ నెవ్వఁడు మహాధనుండు గాఁడు. మాయ నవలంబించినం గాని యీప్సితార్థసిద్ధి యొదవ నేరదు. నృపులు పరధనాపహరణంబు పరమం బగు స్వధర్మం బని తలంచి యొండొరులతో మహాయుద్ధంబు గావించి ప్రాణంబులుం ద్యజియింత్రు. రాజునకుఁ బరస్వాహరణంబునఁ బాపంబు లేదేని దస్యువులకును లేకుండెడు; కాని పాపం బాశ్రయభేదంబున ధర్మరూపం బయి యుండు. పెక్కండ్ర చే స్తుతింపఁబడిన వ్యాపారంబు ధర్మంబును బలువురచే నిందితంబధర్మంబు

నగుం గాని ధర్మతత్త్వం బేవారికిఁ దెలియ నశక్యం బయి యుండు. అతిదానంబు తపంబును సత్యంబు నీలోకంబున దారిద్ర్యంబు గావించు. ధర్మార్థంబుల సాధింపఁజాలనివాని వచనంబు నిష్ఫలం బగు. అర్థంబును ధర్మంబు నార్జింపఁ గుశలుండును దేశకాలజ్ఞుండును నిస్సంశయుండు నగువాఁడు పూజ్యుండగుం గాని సంశయంబు నెల్లెడలఁ గలవాఁడు సమ్మతుండుఁ గాఁడు. పురుషుం డర్థంబునకు దాసుండు, నర్థం బేవానికి దాసభావంబు నొందమి నెల్లవాఁడు నర్థంబు సంపాదింప మిగుల జతనంబు గావించునది. అర్థంబునన ధర్మంబును గామంబును మోక్షంబును నరులకు సిద్ధించు. శస్త్రాస్త్రశూన్యంబయిన శౌర్యంబును స్త్రీవిహీనంబయిన గార్హస్థ్యంబును గ్రాహకుని వినాఁ గౌశలంబును యోధుల కైకమత్యంబు లేని యుద్ధంబును సుసహాయంబు లేని యాపదయు మహాదుఃఖజనకంబు లగు; మఱియు నాపత్కాలంబున మిత్రసమంబయిన సహాయంబు లేదు. అవిభక్తధనులగు జ్ఞాతుల మైత్రిని విభక్తధనుల నియతభృతిని మిత్రుని సత్యంబునను స్వసదృశభోగంబులను దన్పుచు జేనిం జుట్టంబుల సంగాతకాండ్రఁ గొలువుడుకాండ్ర సంతసంపెట్టుచుఁ దనధనంబుల ననుభవించు నరుఁడు సుఖి యగు. ఱేఁడు దర్పంబును గార్పణ్యంబును మానంబు ద్వేషంబు భయంబును విడిచి విశేషభృతిదానంబునను బ్రేమమానంబులను గౌరవించి భృత్యుల స్వార్థసిద్ధ్యర్థంబు నియోగించునది. కాని మఱియొక ప్రకారంబున నియోగింపఁ గాదు. బ్రాహ్మణులకు దానంబున నగ్నికి జన్నంబులను బాంధులకుఁ బానీయదానంబునను దృప్తి చేయుచు నుండువాఁడు

సుఖియు విపరీతుఁడు దుఃఖియు నగు. పరుల నవమానించు తలఁపు దర్పంబును, నే నెల్లవారికంటె నధికుఁడ నను నభిప్రాయంబు మానంబును, వ్యయంబున దైన్యంబు కార్పణ్యంబును, స్వనాశశంకభయంబును, మనశ్చాంచల్యం బుద్వేగంబు నని ప్రకీర్తితంబు లయ్యె. క్షుద్రునకే నవమానంబు గావింప మహావైరం బగు. దానమానసత్యశౌర్యమార్దవంబులు సౌహార్దకరంబులు. రాజాపత్కాలంబున బుధులను గురులను సోదరులను బంధువులను భృత్యులను జ్ఞాతులను సభ్యులను సభకు రావించి వినతుండయి యీయాపద సంతరించు నుపాయంబు చెప్పుఁడని కోరి మీరు మాకుం బరమమిత్రులరు గాని భృత్యులు గారనియు మీకుం దుల్యంబగు సహాయంబు మా కొండు లే దనియు భృతియందు నూఁడవయంశం బేని యర్థం బేని భోజనార్థం బిపుడు గ్రహింపుఁడు తక్కినదాని నాపత్సముత్తీర్ణుండ నయి యుపకారంబు మఱవక యొసఁగెద ననియు స్వాభీష్టంబు వేఁడునది. షోడశాబ్దంబులు కుటుంబంబు పోషింప సమర్థం బగుధనంబు గలభృత్యుఁ డెనిమిదేండ్లదనుక వేతనంబు గ్రహింపకయ స్వామికార్యంబు సేయ నగు; మఱియు నితరుఁడును స్వధనానుసారంబుగ భృతిం గొనకయ తేనికార్యంబునఁ బ్రవర్తిల్లంజను; కాని నిర్ధనుం డన్నవస్త్రంబులం గొనియె ప్రవర్తించునది. ఎవ్వానివలన సుఖం బనుభవించె నతనిదుఃఖంబున దుఃఖంబుం బొందని కృతఘ్నుని స్వామి యేని యన్యు లేని నిందింపక మానరు. ఎవనియన్న మొకమాఱయిన బాగుగ భుజియింపఁబడె నతని కార్యార్థంబు జీవితంబు త్యజియించిన భృత్యుండు సుశ్లోకుం

డు గాన నాపత్కాలంబున నేవాఁడును రాజును విడువం దగదు; మఱియు భృత్యునికార్యంబు సేయఁ బ్రాణంబులు వీడిన రాజు నుత్తముఁ డనంబడు. రాముని నీతిసామర్థ్యంబున వానరులును సుభృత్యత్వంబు నంగీకరించిరి గాన నతనికిం దుల్యుండగు నీతిమంతుండు పృథివిని లేఁడు. చోరుల యైక మత్యంబును గ్రామనాశనంబు గావింప నోపు నన రాజభృత్యుల యైకమత్యంబు శత్రునాశంబు గావించునని చెప్పనేల? కృష్ణుండునుం బోలెఁ గూటనీతిజ్ఞుఁడయిన రాజు లోకంబున నొకఁడు లేఁడు. ఆతఁడు తనచెలియలి సుభద్ర నర్జునునకు ఛలంబున నిప్పించె. నీతిమంతుల యభిప్రాయంబున స్వశ్రేయస్సాధనం బఖిలంబు యుక్తి యనంబడు. మధ్యస్థుఁడు మొదల స్నేహంబు గావించి పిమ్మట నతనికార్యంబు చేసి ధర్మవాదంబున స్వకార్యంబు సాధించికొనవలయు. పరస్పర ప్రీతి గల్గునట్లు గుణంబుల వర్ణించుచు నిష్టాన్నధనవసనాదులఁ బ్రలోభనంబు గావించినఁ గార్యసిద్ధి యగు. కుట్టినులకు, మాయికులకు, మధ్యస్థులకు, శపథావలంబనంబును మిథ్యాసల్లాపంబును ధైర్యవర్ధనంబును (సంతసము వెంచుట) గార్యంబు సాధించు నుపాయంబులు. ఆత్మరక్షణోపాయంబుఁ జింతింపనివాఁడు పశువుకంటెను జడుఁడు; యువతులును దుశ్చరితంబు దాఁప సాకుఁగల్పింతురు గాదె. యుక్తి ఛలాత్మికయు సత్యాత్మికయు నని ద్వివిధ యగు. కపటారులయందు ఛలంబు బ్రయోగింప వలయు. కానినాఁడు మహాత్ముల కేని శీలనాశం బగు. లోకంబునం బెక్కండ్రు బుద్ధిమంతులు కలరు గాని యొక్కఁడ కాఁడు; కావునఁ దాత్త్వికంబయిన యుక్తి

నిష్ఫలం బగుటం జూచి కుశలు లగువారు దేశకాలానుసారం బుగఁ బురుషానుసారంబుగను బెక్కువిధంబుల యుక్తులం గల్పింతురు. మాయాకుశలు లగువారు మంత్రముల నోషధు లను వేఱువేఱువేషములను గాలమును వచనమును సంశ్ర యించి పెక్కుతెఱంగుల మోసంబు చేయుదురు. విక్రీతం బేని దత్తంబేని యగు వస్త్రభాండాదిపదార్థంబుల నధికారి సముక్షంబునన యాత్మచిహ్నంబు శాశ్వతం బగునట్లు గ్రహీత వేయించునది. మఱియు స్తేయకూటాదినివృత్తికై యావస్తు వులు రాజజ్ఞాతంబులు(రిజిష్టరు చేయఁబడినవి)గఁ జేయించునది. రాజును దనయొద్ద నిడిన జడాంధబధిరబాలుర ద్రవ్యంబులకు వృద్ధి యీవలయు. స్త్రీలు స్వీయాదిభేదంబున ముత్తెఱంగుల నున్నట్లు భృతకులు నుత్తమాదిభేదంబున ముప్విధంబుల నుం దురు. స్వామీతరులయం దనురాగంబు నొందక స్వామియం దనురక్తుం డగువాఁ డుత్తముఁడు నధికభృతి నపేక్షించి యితరు లను స్వామిని సేవించువాఁడు మధ్యముఁడును స్వామిచే నధికం బుగఁ బుష్టుఁ డయ్యు నన్యుని సేవించువాఁ డధముఁడు నగు దురు. అపకృతుం డయ్యు నుపకరించువాఁ డుత్తముఁడును సామ్యం బభిలషించువాఁడు మధ్యముఁడును స్వకార్యైక తత్పరుం డధముఁడు ననియు వ్యవహరింపఁబడుదురు. ఉప దేశంబు నొందకుండ నేవారికిని గేవలప్రమాణంబుల సుజ్ఞా నంబు వొడమదు. బాల్యంబుం దారుణ్యము నారబ్ధకార్యము నకు సమాప్తిదము లగుం గాని వార్ధకంబట్టిదిగాదని ధీమంతుఁ డెఱిఁగి యత్రమంబుగ సమాప్తి నొందఁ దగినకార్యం బారం భించునది. ఏకకాలమున బహుకార్యారంభము సుఖావహము

గాదు గావున నారబ్ధకార్యము సమాప్తి నొందుదనుక నన్య
కార్యము ప్రాజ్ఞుఁడారంభింపఁ దగదు. ముం దొక కార్యం
బారంభించి యది సిద్ధింపకమున్న వేఱొకదాని నారంభించిన
నదియు నిదియుం జెడుం గావునఁ గృతి, సుఖముగ సమాప్తి
నొందు దానిన యారంభించునది. కార్యసిద్ధి నాపాదించు
కలహమును వరం బగుం గాని నిరర్థకం బయినయది యాయు
ర్ధనసుహృద్యశోధర్మహారం బగు. ఈర్ష్యయు లోభమును మద
మును బ్రీతియుఁ గ్రోధమును భీతియు సాహసము నను నీ యేడు
ను గార్యప్రవృత్తిచ్ఛిద్రమునకు హేతువు లని బుధులు పల్కు-
దురు. అనాపదయందుఁ గార్యం బెట్లునడిపిన నచ్ఛిద్రంబు విద్వ
త్సమ్మతంబుఁ గాలాంతరంబునన బాధంబు నగు నట్లు బుధులు
నడుపుదురు. దశగ్రామాధిపతియు శతానీకుఁడు నశ్వారూఢు
లయి పరిచారకులతోఁ గూడి చరింప వలయు. మఱియు
గ్రామాధికృతులు నట్లు చేయవలయు. సాహస్రికుఁడును శత
గ్రామపాలుండును శస్త్రాస్త్రధారు లగు పదుండ్రు పదాతుల
తోడ నేని యాశ్వికులతోడ నేని కూడి యేకాశ్వరథారూఢు
లయి చరింపవలయు. సహస్రగ్రామాధిపతియు నాయుతికుం
డును శిబికారూఢుండేని ద్వ్యశ్వరథారూఢుఁడేని గజారూ
ఢుఁడేని యగుచు వింశతిసేవకులతోఁ గూడి చరింప వలయు.
అయుతగ్రామపాలుండును బంచాయుతసేనానాయకుఁడును
బహుసేవకపరివృతు లయి యేయానంబున నేని చతురశ్వ
రథంబున నేని యేగుచుండవలయు. పిమ్మట నాధిపత్యాధి
క్యంబు వీక్షించి గౌరవాధిక్యమును గల్పించుచు ధనికులందును
గుణవంతులందు నట్లాధిక్యానుసారముగ నేర్పఱుచుచు స్వదే

శంబున శ్రేష్ఠుఁడు మానహీనుండును, నీచుఁ డధికమానయు తుండు గాకుండ శ్రేయోర్థి యగు రాజు చేయునది.

మఱియు రాజు గ్రామంబులను బత్తనములను హీన మధ్యమోత్తములకు గృహార్థము భూములీవలయు. ముప్పది రెండుహస్తముల దైర్ఘ్యముఁ బదియునాఱుహస్తముల వైశాల్యము గల వాసభూమి యధమయు నర్ధాధిక మధ్యమయు ద్విగుణయుత్తమయు నగు; మఱియు వాసభూమి కుటుంబ స్థితికిఁ దగినదిగ నుండవలయుం గాని యధికయు న్యూనయుఁ గాఁజనదు. రాజుచే నధికారమున నియుక్తులెల్లను గ్రామ బహిర్భాగమున నుండం దగినవారు. సైనికులయం దొకఁడును నృపునికార్యంబు లేనియపుడు గ్రామమునం బ్రవేశింపను గ్రామజనులఁ బీడింపనుం దగదు. మఱియు గ్రామ్య జనులు వారితో నెప్పుడు వ్యవహరింపనుం దగదు. సైనికుల కనుదినమును శౌర్యవృద్ధి గావించుధర్మము నట్టివాద్యనృత్త గీతములును జేఁడు కుశలులచే వినిపించుచు యుద్ధకార్యంబునన కాని యన్యకార్యమున వాని నియోగింప కుండునది. సత్యాచారు లయిన ధనికులు వ్యవహారమున హాతు లయిన రాజు వారి నుద్ధరించుచు నష్టి వొందిన కృషీవలుల నయితము రక్షించునది.

సైనికులలో ధనికులున్న వారికిం దగినభృతి యిచ్చుచు వారి వ్యయముకంటెఁ ద్రింశాంశం బధికముగఁ బరదేశగమనార్థము ధనంబిచ్చుచు నాత్మకోశమువోలె వారి ధనమును సుయత్నమున రక్షించుచు మిథ్యాచారులయిన ధనికులధనము హరియించుచుండవలయు. ధనికులచే వృద్ధి చతుర్గుణముగ

గృహీతంబయిన పిదప నధమర్ణులవలన నతనికి మరల ధన మిప్పింపఁదగదు.

ఇది శ్రీ భారద్వాజసగోత్రాపస్తంబసూత్ర పురాణపండ
వంశమణి భద్రయ్యశాస్త్రి తనూభవ విద్వద్విధేయ
మల్లయనామధేయాంధ్రీకృత మైన శుక్రనీతి
సారమున సర్వమును బంచమాధ్యాయము
సమాప్తము.



# శుక్రనీతిసారము

## కఠినపదముల కర్థము

---

| పదము | అర్థము |
|---|---|

సర్గము=సృష్టి
విస్తృతము=విశాలము
క్రియైకదేశబోధకము= నేర్వవలయు వానిలో నొకభాగముం దెల్పునది
అధిగమించు= నేర్చికొను
వృష్టి=వర్షము
వితె=వ్యర్థము
క్లీబులు=అసమర్థులు
అతివాదము=అధికసంభాషణము
ప్రధావించు=పరువెత్తు
జంఘాలంబు=వడిగఁబోవునది
అపథ్యాశి = దేహమునకనుకూలము గాని వస్తువులం దినువాఁడు
గుంటిశిఖరంబు=పర్వతాగ్రము
అత్యాహితకరము=మిగులభయమును గల్గించునది
హ్రాసము=క్షయము
అసిధారావలేహనము = కత్తివాతిని నాల్కతో స్పృశించుటం బోలునది
స్వారాధ్యుఁడు=శ్రమలేకుండ సేవింపఁ దగినవాఁడు
దురారాధ్యుఁడు=శ్రమచే సేవింపఁ దగినవాఁడు

పనుపఱుచు=అలవాటుచేయు
సీరకాష్ఠము=నాఁగలి
అనుగలము=అనుకూలము
అనుమేయించు=ఊహించు
ఉత్సన్నము=నశించునది
విజిగీషువు=జయింపఁగోరువాఁడు
షండతిలలు=నూవుతప్పలం బోలినవారు
ప్రణిధి=వేగులవాఁడు
సాగియు=సుఖియించు
అకర్ణధారంబు = చుక్కాని పట్టువాఁడు లేనిది
కలంబు=దోనె
వైశ్రవణుఁడు=కుబేరుఁడు
దాంతి=మనోనిగ్రహము
అరినిషూదనుఁడు=శత్రులజయించువాఁడు
ఉద్వేజనకరంబు=పీడించునది
చికిత్సితగదుఁడు=రోగమునకు వైద్యము చేయించుకొన్నవాఁడు
నిష్ఠ్యూతానల ధూమధూమ్రముఖంబు =ఉమియుచున్న యగ్నియొక్క పొగచే బూడిదరంగు గల మోము గలది
విపశ్చితులు=విద్వాంసులు

పదము — అర్థము

సంవననము=వశీకరణసాధనము

ప్రణిపాతము=నమస్కారము

అలంభావము=సంపూర్తి

విషయామిషము = విషయములను భోగ్యము

ఆకృష్టుఁడు=ఆకర్షింపఁబడినవాఁడు

ఉత్కర్తనము=కత్తిరించుట

అరిగాఁపులు=రయితులు

అనీకము=సేన

కరదులు=పన్నిచ్చువారు

గద్యాణము=ఒక తెలుఁగు బంగారు నాణెము, వరహా

బహుభుజపరిణాహా= పెద్ద చేతుల వైశాల్యము గలది

సత్రికటుము = మూఁడు ముంగిళ్లు గలది

పరివర్తకులు=మాఱువారు

యామికులు = గుమ్మమును గాచువారు

ఉపకార్యాట్టసంయుతము = మేడతోడను బురుజులతోడను గూడినది

దూష్యము=వస్త్రగృహము

కోష్ఠము=గది

బృహన్నలికయంత్రము=ఫిరంగి

గౌల్మికము = సేనావిశేష సంబంధమైనది, జీతము పుచ్చికొని పని చేయు సైనికులు గల సేన గుల్మమని కొందఱు

ప్రకృతులు=మంత్రులు

అధికృతులు=ఉద్యోగులు

పద్య=సన్నమార్గము

పదము — అర్థము

సుధాశర్కరలు = సున్నముం గంకరయును

ప్రహరము=మూఁడుగంటల కాలము

ఆరెకులు=గస్తీతిరుగువారు

ప్రతిభువు=జామీనుదారు

నిర్యాసము=జిగురు

ఉత్కోచము=లంచము

పైశున్యము=కొండెగానితనము

ఆధర్షణము=బెదరింపు

ఉన్మానంబు=తూనిక

దత్తాభయుఁడు = అభయమీఁబడినవాఁడు

బ్రదిమి=జీవనము

కుసీదము=వడ్డివ్యాపారము

అనృశంస్యము=హానిచేయమి

శిఖి=నెమిలి

కేక=నెమిలికూఁత

అనవద్యచరితులు = మంచినడవడికలవారు

పర్వము=పండువు

స్వత్వనివర్తనపురస్సరముగ= హక్కు విడుచుకొనునట్లుగ

గృహీతృజీవితావధికము= పుచ్చుకొన్నవాఁడు జీవించియున్నంతకాలము హద్దు

గోష్ఠము=గోశాల

సాహిణము=గుఱ్ఱపుసాల

అంధువు=నూయి

ఘరట్టము=తిరుగల్లు

ఉచ్ఛ్రాయము= ఎత్తు

అపవరకము=గది

కర్పరము=ఇల్లు నేయు పెంకు

| పదము | అర్థము | పదము | అర్థము |
|---|---|---|---|

గుల్మము=సేనావిశేషము
తోరణగండ్లు=కిటికీలు [నది
సుయంత్రితము= బాగుగఁగట్టంబడి
కార్పటికుఁడు=నిత్యముం బ్రయాణ
ము చేయువాఁడు
చరుఁడు=వేగులవాఁడు
ఛలంబు=కపటము
వర్షిష్ఠుఁడు=పెద్దవాఁడు
సిద్ధాస్త్రుఁడు=సిద్ధమైన యస్త్రవిద్య
గలవాఁడు
నగ్నశస్త్రుఁడు=ఒరనుండి తీసిన కత్తి
ధరించినవాఁడు
ఛది=ఇంటికప్పు
దస్యువృత్తి=దొంగతనము
నిర్ఘృణుఁడు=దయలేనివాఁడు
భాగధేయము=అదృష్టము [వాఁడు
అనలసులు = చుఱుకుఁదనము గల
కృత్రిముఁడు = తలిదండ్రులవదలి
యెచ్చటనేని తిరుగువానిం దెచ్చి
పుత్త్రుఁడుగా భావించిన నతఁడు
కృత్రిముఁడు
స్వామ్యము=హక్కు; ప్రభుత్వము
కైతవము, కపటము
అభిజనవంతుఁడు=సద్వంశమునజన్మిం
చినవాఁడు
ఒడ్డనము=సేనను యుద్ధానుకూలము
గఁ బన్నుట
వితథము=వ్యర్థము
సౌచికులు=కుట్టుపనిచేయువారు
తంతువాయులు=సాలీలు
క్లిశ్యమానుఁడు = కష్టపెట్టఁబడుచు
న్నవాఁడు

వేఁగి=పెద్దపులి
అకృష్టభూమి=దున్ననిభూమి
కొఱఁకులపంట=బీళ్లలోనిపంట
అవద్యము=దుష్టము
భృతకుఁడు = కూలిపుచ్చుకొని పని
చేయువాఁడు
చదుకము = నాల్గువీధులుం గలియు
చోటు
ఉద్వమించు=క్రక్కు
స్పశుఁడు=చారుఁడు
పార్థక్యము=వేఱిమి
మైముఱువు=కవచము
వరాటము=గవ్వ [వాఁడు
కార్యాక్షముఁడు = పనిచేయలేని
సాధిలేఖ్యము=తాకట్టుపత్త్రము
అభిశప్తుఁడు = నిందింపఁబడినవాఁడు
సాద్యస్కము=అప్పుడున్నది
ఉపభుక్తము=అనుభవింపఁబడినది
వినిమయాత్మకము=మార్చుకొన్నది
నిశ్చితాన్యస్వామికము=పరులదియని
నిశ్చయింపఁబడినది
భాటకము=బాడిగ
పునరావర్తకము=మరలవచ్చునది
భృతకము=కూలి
త్రివర్గశూన్యము = ధర్మార్థకామము
లలో నెద్దానిని సాధింపలేనిది
అనుల్బణము=అధికముగానిది
సంభిన్నాలాపము=ఇతరులు మాట్లా
డుకొనుచుండ నడ్డముగ మాటా
డుట
స్కన్నము=అఱిపోయినది
శీర్ణతరి=శిథిలమైనపడవ

| పదము | అర్థము |
|---|---|

అతివిప్స = మిక్కిలి సంపాదింపవలె
ననునిచ్ఛ [తుఁడు
వేగితుఁడు = మలమూత్రాది బాధి
గంజ = కల్లుదుకాణము
శత్రునమనము = శత్రులవంచుట
ప్రత్యుత్పన్నమతి = సమయోచితమై
న తెలివిగల [కొన్నవాఁడు
జిఘాంసకుఁడు = హింసింపఁదలఁచి
విఘసాశనుఁడు = అతిథిపూజ మొద
లగునవి కావించి తచ్ఛేషమును
భుజించువాఁడు
స్వస = చెల్లెలు
స్నుష = కోడలు
లగ్నకుఁడు = జామీనుదారుఁడు
పర్యుదంచనము = అప్పు
అధమర్ణికము = ఋణస్థులయొద్ద ను
న్నది [నున్నది
ఉత్తమర్ణికము = ఋణదాతయొద్ద
అజర్యము = మైత్రి
వావదూకత = మాటలాడుశక్తి
సాకిరులు = సాక్షులు
హింస్రుఁడు = క్రూరుఁడు
యథాజాతుఁడు = మూర్ఖుఁడు
దేవజీవకుఁడు = అర్చకుఁడు
క్రొత్తడి = పతివ్రత
జరభి = చెడునడవడిగల స్త్రీ
పాలసుఁడు = మూర్ఖుఁడు
విస్రంభార్హులు = నమ్మఁదగినవారు
హట్టము = బజారు
ఉత్థానశీలుఁడు = శత్రువులమీఁదికిఁ
బోవు స్వభావముగలవాఁడు
ధర్షణి = కులట

| పదము | అర్థము |
|---|---|

కర్ణేజపుఁడు = కొండెగాఁడు
అజాలగర్భము = లోపల గుల్లలేనిది
వ్రీహి = ధాన్యము
చిపిటము = తప్ప
దలాఢము = ఊకవలెనున్నది
నిర్వేశము = కూలి
వార్ధుషికుఁడు = వడ్డిచే జీవించువాఁడు
ప్రసారభూమి = బజారు
గరువలు = విద్వాంసులు
కృత్స్నము = పూర్ణమైన
స్మర్యమాణకర్తృకము = తలఁపఁబడి
న కర్తగలది
శకృత్తులు = పేడ మొదలగు యెరువులు
బబ్బులాదులు = బూరుగ మొదలగు
నవి
ఆరకూటము = ఇత్తడి
చలార్చ = ఉత్సవవిగ్రహము
ప్రాట్టు = అడుగువాఁడు
వివాకుఁడు = చెప్పువాఁడు [కుండు
నిపానము = నూతిదగ్గఱనున్న నీళ్ల
ఘోషణాచ్ఛాదనము = చాటింపును
గప్పిపుచ్చుట
ఆవేదనము = పిర్యాదు
ఆసేధించు = అడ్డగించు
యియక్షులు = యజ్ఞము చేయువారు
అధికరణము = న్యాయస్థానము
కూటకరణము = కల్తీచేయుట
ప్రాప్తాధర్షణులు = బెదరింపఁబడిన
వారు మొదలగువారు
పక్షము = పిర్యాదు. దావా
ధిగ్దండము = చీవాట్లు పెట్టుట
సొన్నారులు = స్వర్ణకారులు

| పదము | అర్థము |
|---|---|

నిర్వేశము=కూలి

స్వగమము=స్వయముగాఁ బోవునది

అన్యగమము=వాహన సహాయమునఁ బోవునది

వాలము = తండ్రి తాతల నాఁటి సైన్యము

భృతిపాలితంబు = జీతమునం గాపాడఁ బడినది

ఉత్సృష్టము=విడువఁబడినది

బృహన్నాళికము= పెద్ద నాళము గల యాయుధమును (ఫిరంగిని) ధరించినది

లఘునాళికము=తుపాకి

ఆజానేయము=ఉత్తమాశ్వము

శఫంబు=పశువుల కాలిగిట్ట

కూర్పరము=మోచేయి

కంఠంబుదనుక=మెడవఱకును

శఫపరిణాహము = డెక్కల వైశాల్యము

ప్రోథము=గుఱ్ఱపుముట్టె

గ్రీవ=మెడ

సమీకము=యుద్ధము

సప్తి=గుఱ్ఱము

భ్రమదూషితము=చెడుసుడులుగలది

కార్శ్యము=చిక్కుట

ఖలీనము=కళ్లెము

కశాఘాతము=చబుకుదెబ్బ

శతధనుఃపరిమితము = నూఱుధనువుల పరిమాణము గలది

జాఠరము=గర్భమునందలి యగ్ని

సక్తువు=పేలపుఁబిండి

క్షిప్తము=చిమ్మఁబడినది

ప్రస్తరచూర్ణము=రాతిపొడుము

| పదము | అర్థము |
|---|---|

అర్కస్నుహ్యగ్నికాష్ఠము = జిల్లేడు కట్టెలు, జెముడుపుల్లలు

గోలకము=తుపాకిగుండు

సుపర్యాప్తము=మిక్కిలి చాలినది

అభియుక్తుఁడు=విద్వాంసుఁడు

ఉపహారభేదము=వేర్వేఱు కానికెలు

ఉత్సాదనము=నాశము

నిమ్నగలు=నదులు

ఏకార్థాభినివేశంబు=ఒక కార్యమునం బట్టుదల

మన్నీఁడు=ప్రభువు

అభిషేణనము=సేనలతో శత్రు నెదిరింపఁబోవుట

ధ్వజినీరక్షణము=సేనా సంరక్షణము

ఒడ్డనము=సేనల పన్నుగడ

సమీరితము=చెప్పంబడినది

సంమీలనము=మూసికొనుట

ప్రసారణము=జాచుట

ఆకుంచనము=ముడుచుట

వ్యాలము=క్రూరమృగము

ఆయస్సారము=ఉక్కు

అవిక్షతము=నఱకఁబడనిది

అపసరించు=తొలఁగు

గేహము=ఇల్లు

జిఘాంసువు=హింసింపఁగోరువాఁడు

యుధ్యమానులు = యుద్ధము చేయువారు

క్షత్త్రబంధువు=రాజాధముఁడు

పృతన=సేన

కరకాక్రాంతము = రాలవానచే నలసినది

దస్యువిద్రుతము=దొంగలచేఁ దఱుమఁబడినది

# శుక్రనీతిసారము

## తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 19 | హోళి కర్మంబు | హోళిఁ గర్మంబు |
| 13 | 2 | జవ్వనంబుఁ బ్రడిమి | జవ్వనంబును బ్రదిమి |
| | 18 | విశయవంతుడు | వినయవంతుఁడు |
| 40 | 9 | రైన దామట్టి | రైనఁదామట్టి |
| 48 | 7 | లోకంబున బరలోక | లోకంబునఁ బరలోక |
| 46 | 1 | బులు | బుల |
| 65 | 13 | లేకుండ | లేకుండ నిది యంగీకృతమని |
| 98 | 8 | సంభాషణమునను | సంభాషణమును |
| 100 | 21 | తేజస్వ్వి | తేజస్వి |
| 106 | 13 | సేనాని | సేనాని |
| 112 | 16 | బావించునది | బాలించునది |
| 135 | 9 | తేజస్వ్వి | తేజస్వి |
| 136 | 17 | జన్మమున...గానోపఁడు | జన్మమున నుత్తముఁడయ్యు సంసర్గమున నీచుఁడగుఁ గాని జన్మమున నీచుఁడగు వాఁడు సంసర్గమున నుత్తముఁడు గానోపఁడు. English Translation |
| 138 | 17 | సాహింవిటత | సాటవిదిత |
| 143 | 17 | ధావ్యార్థి | ధాన్యార్థి |
| 146 | 1 | గ్రథనము | గ్రథనము |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| | 15 | గ్రధితం | గ్రథితం |
| 165 | 13 | వ్యాఘ్రంబును | వ్యాఘ్రంబు |
| 180 | 23 | యేవాఁడ...నిధియు | యేవాఁడ...నిధియై |
| 188 | 11 | నివాద | వివాద |
| 193 | 14 | బాలుని...బును | బాలుని...బును దాసులగు స్త్రీలు పూఁటపెట్టిన ధనంబును |
| 208 | 3 | సప్త...దాని...ములును | సప్తమప్రకరణము |
| 227 | 24 | సుయుత్తం | సుయుక్తం |
| 239 | 23 | కర్మానుషాన | కర్మానుష్ఠాన |
| 255 | 19 | యొందొరుల | యొండొరుల |

---

